


“ఎలా చేసావ్?!” ఇంటర్వ్యూ జరుగుతున్న గదినుండి బైటకొచ్చిన ‘జ్వాల’ని ఆత్రంగా అడిగాడు ప్రతాప్.

“మామూలే!” నుదుటికి పట్టిన చెమటని తుడుచుకుంటూ అతి మామూలుగా చెప్పింది జ్వాల.

“ఆర శ్యూర్?!”

“పద వెళ్దాం.”

“నీ పిచ్చిగాని! ఇంటర్వ్యూ కెళ్ళగానే జాబ్ వస్తుందా? అయినా ఇంటర్వ్యూ అనేది కేవలం హంబగ్. అంతకుముందే ఎవర్నో సెలక్ట్ చేసుకునే వుంటారు!” బస్ కోసం చూస్తూ, నిరాశగా అన్నది.

“అది కాదు జ్వాల! ఆ డైరెక్టర్ గారిని చూస్తుంటే ఎంతో నిజాయితీపరుడిలా కన్పిస్తున్నాడు.”

“ఆహా! పైకందరూ అలాగే వుంటారు. మనదగ్గర రికమెండేషనో, లంచమో ఏదో ఒకటి లేందే మనకీ జన్మలో వుద్యోగం రాదు!” ఖచ్చితంగా అన్నది.

“కాని నాకెందుకో యీ జాబ్ వస్తుందని నమ్మకంగా వున్నది!” ఆశగా అన్నాడు.

"అదుగో! ఆ వృక్షాన్ని చూడు!" కనుచూపు మేర కన్పిస్తున్న, వూడలు దిగిన పెద్ద మర్రి వృక్షాన్ని చూపెడుతూ అన్నది.

"......" ప్రతాప్ అర్థంకాని వాడిలా చూసాడు.

"దానిక్రింద కూర్చుని 'జోస్యం చెప్పబడును' బోర్డు పెట్టుకో. నీ నోటికొచ్చిన అబద్ధాలు చెప్పి బోలెడు సంపాదించవచ్చు!", సీరియస్‌గా ముఖం పెట్టి అన్నది.

"ఛా! నీకంతా హాస్యంగానే వుంటుంది!" చిన్నగా నవ్వుతూ అన్నాడు. తనూ నవ్వింది. తర్వాత యిద్దరూ మరో గంటన్నరలో కొంపకి చేరుకున్నారు.

"ఎలా చేసావే?!" గుమ్మంలోనే అడిగింది కాంతి.

"చూడు కాంతమ్మా! మనకి బస్ ఖర్చులు తప్పితే, వుద్యోగం చచ్చి గీ పెట్టినా రాదు!"

"ఊహు. రాదని తెలిసి బాగా చెప్పలేదా?!"

"బాగానే చెప్పాన్లే! కాసిని మంచితీర్థం యివ్వు తల్లీ!" విసుగ్గా అన్నది.

"ప్రతాప్! నిజంగా నీకు నమ్మకముందిరా, నాకు జాబ్ వస్తుందని?!"

"ఈ ఇంటర్వ్యూలని చూస్తుంటే, నాకు నమ్మకం కలగటం లేదు!"

"నిజం! డబ్బు దండగ తప్ప, ఫలితం శూన్యం! అందుకే ఇంక దేనికీ అప్లికేషను పెట్టను!" దృఢంగా అన్నది.

"మరేం చేస్తావ్?!"

"ఓ బజ్జీల కొట్టు పెడదామనుకుంటున్నాను!"

"ఛీ! యింత చదువు చదివి..."

"ఎంత పెద్ద చదువు? ఈ రోజుల్లో డిగ్రీ చదువు కూడా ఓ చదువేనా?"

"బామ్మవాళ్ళేమంటారో?" సందేహంగా అన్నాడు.

"వాళ్ళకి చెప్పొద్దు!" స్థిరంగా అన్నది.

"జ్వాల! నిజంగా పెడతావా?!" యింకా అపనమ్మకంగానే

ఆడిగాడు.

"ఆc!"

* * *

తర్వాత రోజు...

తన ఫ్రెండ్స్ ముగ్గురినీ సమావేశ పరిచింది. ముగ్గురూ, ప్రస్తుతం తనలాగే నిరుద్యోగులు.

"ఇప్పట్లో మీకు ఉద్యోగాలొచ్చే సూచనలేమైనా వున్నాయా?!" సూటిగా అడిగింది.

అందరూ ఒకటే సమాధానం 'లేవు' అనే యిచ్చారు.

"మీ కెవరికయినా..."

"రికమెండేషన్లు లేవు. లంచాలిచ్చే శక్తీ లేదుగాని, నువ్వేంటి నాయకురాలి ఫోజులో మాట్లాడుతున్నావ్?!" సుఫీన్ అడిగాడు.

చిన్నగా నవ్వుకున్నారంతా.

"నేనో చిన్న హోటల్లాటిది పెట్టాలనుకుంటున్నాను!" జ్వాల గట్టిగా అన్నది.

"ఏంటీ?!" ఆశ్చర్యంగా అడిగాడు.

జ్వాల రిపీట్ చెయ్యలేదు.

"ఏదో ఓ సెంటర్లో సాయంకాలం టిఫిన్స్ పెడదామనుంది!"

"అంటే?!" శాంతి అర్ధంకానట్లు చూసింది.

"అంటే ఏముంది? బజ్జీలు, వడలు యివి రెండు హాట్స్. ఇంకో స్వీటేదయినా పెడదాం. ముందు చిన్నగా ప్రారంభిస్తే తర్వాత దాన్నే పెద్దదిగా చేయొచ్చు!"

చాలాసేపు ఎవరూ మాట్లాడలేదు.

"ఎవరికిష్టమయితే వాళ్ళు పార్టనర్స్‌గా చేరొచ్చు. పెట్టుబడి కూడా అతి తక్కువ. తలా వందే!" అందరినీ పరిశీలనగా చూస్తూ అన్నది.

అందరిళ్ళలోనూ, నిరుద్యోగుల్ని ఎలా చూడాలో అలానే చూస్తున్నారు. తమకంటే పెద్దవాళ్ళు చులకన చేస్తుంటే, చిన్న

వాళ్ళూ హేళన చేయడం మామూలే. అప్లికేషన్ పెట్టడాని క్కూడా తండ్రిని దేబిరించాలి. విసుక్కుంటూనే ఇవ్వడం, వీలయి నప్పుడల్లా, అవసరం వున్నా లేకపోయినా, మాటలతో కించ పరచడం, దెప్పడం, అప్పుడు తలదించుకుని తమలో తాము కుమిలి పోవడం దాదాపు యీ సంవత్సరంనుండీ జరుగుతున్నదే! అందరికీ, యింటికి వెళ్ళటం విసుగ్గానే వున్నది.

ఇలాటి సమయంలో జ్వాల మాటలు అందరికీ నచ్చడంలో ఆశ్చర్యమేం లేదు. ముగ్గురూ తమ అంగీకారాన్ని తెలియజేసారు.

"ఎక్కడ పెడ్దాం?!" సుధీర్ కొద్దిగా వుత్సాహంగా అడిగాడు.

"నేనన్నీ రాత్రే ఆలోచించాను!"

"ఎక్కడ?!"

"హోటల్ స్వాగత్ ఎదురుగా ఓ సందు వుంది కదూ! ఆ సందు ఏమంత రద్దీగా వుండదు. ఆ సందు మొదట్లో చిన్న రేకుల షెడ్ వేద్దాం!"

"అది గవర్నమెంట్ స్థలంగా?!" సందేహంగా అడిగాడు ప్రసాద్.

"అడిగినప్పుడు చూద్దాంలే!" నిర్లక్ష్యంగా అన్నది.

"మరి ఫర్నిచరో?!" సుధీర్ అడిగాడు.

"మనం పెట్టేది బజ్జీల కొట్టు. బట్టల కొట్టు కాదు!" నవ్వుతూ అన్నది జ్వాల.

"అయితే మాత్రం ఓ రెండు టేబుల్స్, ఐదారు కుర్చీలు కావద్దా?"

"అవును. అవన్నీ సెకండ్ హాండ్‌వి కొందాం" జ్వాల అన్నది.

"మా యింట్లో ఓ యినప టేబుల్ రంగులుపోయి, కొద్దిగా పాడయింది వుంది. దాన్ని మరామత్తు చేసి, రంగులు వేద్దాం. ఇంకో టేబుల్ కొందాం!" శాంతి అన్నది.

"గుడ్! మా యింట్లో ఓ చెక్క కుర్చీ వుంది. తీసుకు వస్తాను."

"అయితే ఒక టేబుల్, నాలుగు ఛైయిర్స్ మొత్తం ఓ రెండు వందల్లో వస్తాయి. ఇంకో రెండు వందలు వుంటే షెడ్ వెయ్యడానికి కావాలి!"

"కనీసం ఆరువందలయినా కావాలి!" సుధీర్ సుమారుగా లెక్క వేసి చెప్పేడు.

"టేబుల్స్, ఛైయిర్స్ ఇప్పుడొద్దులే. తర్వాత సెల్లో చూడొచ్చు!" జ్వాల ఆలోచిస్తూ అన్నది.

"నలుగురం కలిసి ఓ మూడువందలు తీసుకొస్తే ప్రస్తుతానికి చాలు!"

"మనం అడిగితే ఇంట్లో యిస్తారా?!" సుధీర్ అనుమానంగా అన్నాడు.

"ఇవ్వరు. ఏదో ఓ జాబ్ వస్తుందని దానికి లంచం ఓ వంద కావాలని అడిగితే?!" ఆలోచనగా అన్నాడు ప్రతాప్.

"ఇవ్వకపోతే దొంగతనం చేద్దాం!" విసుగ్గా అన్నాడు సుధీర్.

తర్వాత రోజుకి సమావేశం వాయిదా వేసారు.

* * *

సరిగ్గా ఐదు రోజుల తర్వాత...

హోటల్ స్వాగత్ పక్కన 'పట్టభద్రుల ఫలహారశాల' అనే నామం గల చిన్న హోటల్ వెలిసింది. రేకులతో ఓ చిన్న గది చేశారు. ఆ చిన్న గదికే నాలుగు లైట్లు పెట్టారు. ఓ టేబుల్ మీద అప్పుడే వండిన వేడివేడి బజ్జీలు, వడలు నోరూరిస్తున్నాయి. శాంతి, జ్వాల, ప్రసాద్ ముగ్గురూ పొయ్యి దగ్గరే చిన్న స్టూల్స్ వేసుకుని చేస్తున్నారు. చాలామంది స్టూడెంట్స్ వచ్చారు అక్కడికి.

ఆ రోజు అందరూ ఎంతో వుత్సాహంగా కొన్నారు. చాలా మంది రాత్రి తొమ్మిది దాకా అలాగే వున్నారు.

"మేము కేన్వాస్ చేయమా?" ఓ స్టూడెంట్ ముందుకొచ్చి అడిగాడు.

"అబ్బే! వద్దండీ" సుధీర్ నవ్వుతూ అన్నాడు.

"కాని ఆ అబ్బాయి బైట నిలబడి "బజ్జీలండీ బజ్జీలు! వేడి వేడి బజ్జీలు!" అంటూ అరవడం మొదలుపెట్టాడు.

దాంతో అందరూ లయబద్ధంగా చప్పట్లు కొడుతూ, చూసే వాళ్ళకి అక్కడ బజ్జీల కొట్టుకాక, సంగీత కచేరీ అన్పించేలా చేసారు. అక్కడ చేరిన వారందరిచేత బలవంతంగా కొనిపించారు. వాళ్ళు యిష్టంగానో అయిష్టంగానో కొన్నారు. కాలేజీ కాంటీన్‌లో తింటూ ఎంత గొడవ చేస్తారో, అంత గొడవగానూ వుంది అక్కడ.

జ్వాల ధైర్యంగా హోటలు పెడదామన్నదే కాని, మనస్సులో బెరుగ్గానే వున్నది ఎలా సాగుతుందోనని.

ఆ రోజు తాము వూహించిన దానికంటే బాగానే వచ్చింది. లెఖ్ఖ చూస్తే పాతికరూపాయలు లాభం వచ్చింది.

"ఇవి కూడా మిగలకపోతే ఇంకా నాలుగైదు రూపాయలు వచ్చేవే" శాంతి మిగిలిన బజ్జీలు, వడలువంక చూస్తూ అన్నది.

"వడలు రేపటివరకూ బాగానే వుంటాయి. బజ్జీలు మాత్రం యీ రోజే ఖాళీ చెయ్యాలి" జ్వాల టేబుల్ మీద కూర్చుంటూ అన్నది.

తర్వాత శాంతి ఒక్కో కాగితంలో నాలుగు బజ్జీలు, ఒక వడ పెట్టి అక్కడ వున్న వాళ్ళందరికి యిచ్చింది. అవి తిని మంచి నీళ్ళు త్రాగి అందరూ లేచారు.

"జ్వాలా నాకో ఐదు రూపాయలు కావాలి" సుధీర్ నసుగుతూ అన్నాడు.

"ఏ రోజు లాభం వచ్చింది ఆ రోజు పంచుకుంటే యింక దీన్ని ఎలా పెద్దది చేస్తాం. ఈ రోజు పెట్టుబడితో లాభం కూడా కలిపి రేపు పెట్టుబడి క్రింద పెడ్తే యింకా ఎక్కువ లాభం వస్తుంది కదా!" జ్వాల సందేహంగా చూస్తూ అన్నది.

"అది కరక్టేగాని, సుధీర్‌కు చాలా అవసరం అయి వుంటుంది," అని "ఏం సుధీర్ అంతేనా?" ప్రతాప్ అడిగాడు.

సుధీర్ తలాడించాడు. జ్వాల సుధీర్‌కు మటుకు ఐదు

రూపాయ లిచ్చింది. మిగిలిన డబ్బంతా బ్యాగ్‌లో సర్దేసింది. అందరూ ఎవరింటికి వాళ్ళు బయలుదేరారు.

* * *

రెండు రోజుల తర్వాత కాంతి ఇంట్లో పెద్ద గొడవే చేసింది. రాత్రి తొమ్మిదిన్నరకి వచ్చిన ఇద్దరినీ వాకిట్లోనే నిలేసింది.

"ఎక్కడినుండి మీరు వచ్చింది?"

ఇద్దరూ తడుముకోకుండా "ఫ్రెండింటి దగ్గర నుండే," అన్నారు.

"సిగ్గులేదూ? అబద్దం చెప్పడానికి?"

జ్వాల, ప్రతాప్ ముఖముఖాలు చూసుకున్నారు.

"నీ కసలు బుద్ధుందా? ఆడపిల్లవి. బజార్లో బజ్జీల కొట్టు దగ్గరా కూర్చునేది?"

"ఏంటే ఆ గొడవ కాంతమ్మా?" లోపలినుండి కాంతి అమ్మమ్మ అడిగింది.

"చూడు అమ్మమ్మా! వీళ్ళు చేసేపని" ఫిర్యాదుగా అన్నది.

"ఏం లేదు బామ్మా!" నవ్వుతూ అని, ఒక చేత్తో కాంతి నోరు మూసి ప్రక్క గదిలోకి లాక్కెళ్ళింది. ప్రతాప్ కూడా వాళ్ళ ననుసరించాడు.

"కాంతీ! ప్లీజ్ బామ్మకు చెప్పకే!" బ్రతిమాలుతున్న ధోరణిలో అన్నది జ్వాల.

"ఏం? ఎందుకు చెప్పకూడదూ?"

"అబ్బ! చెప్పొద్దంటే వినవేం? బామ్మ అనవసరంగా గొడవ చేస్తుంది, చుట్టుప్రక్కల వాళ్ళందరూ వినేలా."

"గొడవ చేస్తుందని ఆవిడననటం దేనికి? బజార్లో బజ్జీల కొట్టు పెడితే అందరికీ తెలియదూ! మీరు చేసేపని ఏమైనా బాగుందా?"

"కాంతీ!" నెమ్మదిగా అన్నాడు ప్రతాప్.

"బుద్ధి లేకపోతేసరి! ఇద్దరికిద్దరూ తోడు దొంగలయ్యారు. అసలిలా చేయడానికి మనస్సెలా వొప్పింది? హవ్వ! చదివారెందుకు చదువు? ఇంత చదివి బజ్జీలు వండటమా? పరువేమౌతుందో ఆలో

చించారా?'' బ్రతిమాలే కొద్దీ రెచ్చిపోతున్న కాంతి అన్నది.

దాంతో జ్వాల కోపంతో మండిపోయింది.

''హుఁ! పరువు! తిండానికి తిండి లేకపోయినాసరే పరువు కావాలి! ఆకలితో ఛస్తున్నాసరే పరువు పోకూడదు. నా కలాంటి పరువు అక్కర్లేదు!'' విసురుగా అన్నది.

''హవ్వ! ఎంత బరితెగించి పోయావే!'' బుగ్గలు నొక్కుకుంటూ, అంతా విన్న బామ్మ అన్నది.

బామ్మవైపు తిరస్కారంగా చూచింది.

''ఇలా అయితే మీ యిద్దరి పెళ్ళి అయినట్లే!'' యీసడిస్తూ అన్నది.

''అయ్యో! బామ్మా! నువ్వింకా మాకు పెళ్ళిచేసే సితిలో వున్నావా? పోనీ పాపం కట్నం లేకుండా చేసుకునేందుకు నీకు మనవళ్ళు కూడా లేరే?!'' జాలి పడుతున్నట్లుగా నవ్వింది.

''ఏంటా నవ్వు? మొగరాయుడిలా?!''

''నాకు తెలీకడుగుతాను. నవ్వులు కూడా మొగాడికని, ఆడదానికని వేర్వేరుగా వుంటాయా?!'' అమాయకంగా ముఖంపెట్టి అడిగింది.

''వుండవూ మరి? మా కాలంలో యిలా నవ్వే వాళ్ళమా?''

''ఎందుకని బామ్మా?!'' ప్రతాప్ నెమ్మదిగా ఆవిడ పక్కకి చేరాడు. జ్వాల, ప్రతాప్ యిద్దరూ కలిసి ఆవిడని పక్కనోక్క పట్టించారు.

''అమ్మమ్మా! అసలు విషయం చెప్పకుండా ఎలా దాటేస్తున్నారో చూసావా?!'' ఫిర్యాదుగా అన్నది కాంతి.

''అఁ! నిజమేనే! ఒరే! ప్రతాప్! నిజం చెప్పరా? మీ రెక్కడినుండిరా వస్తుంది?!''

''బామ్మా! చచ్చే ఆకలిగా వున్నది. అన్నం పెట్టవా?!'' జ్వాల అడిగింది.

''తర్వాత చెప్తార్లే కాంతమ్మా! పాపం! ఆకలేస్తుందట. అన్నం పెట్టు!'' కాంతి విసుక్కుంటూ లోపలికెళ్ళింది.

*　　*　　*

"జ్వాల!"

"ఏం టే?!"

"అలా వెళ్దాం పద!"

"ఎక్కడికి?"

"మా తాతకి వున్నట్లుండి తలనొప్పి వచ్చేసింది. దానికి తోడు కళ్ళు తిరుగుతున్నట్లు, వళ్ళు తూలినట్లు వగైరా వగైరాలతో బి. పి. ఎక్కువయిందేమోనని అనుమానం. ఇంట్లో నాన్న లేరు. డాక్టర్‌ని తీసుకురమ్మని అమ్మ ఒకటే గొడవ!"

"మీ ఫ్యామిలీ డాక్టర్ గారిల్లు చాలాదూరం కదూ?!"

"ఆఁ! అయినా అతను వూళ్ళో లేరు!"

"మరయితే ఎక్కడికి?!"

"ఇదుగో! యీ వీధిలో ఎక్కడో ఓ డాక్టరు బోర్డు చూసిన గుర్తు. వెళ్దాం!"

ఇద్దరూ ఓ డాక్టరు బోర్డున్న యింట్లో కెళ్ళారు. ఎక్కడా మనుష్యులున్నట్లు లేరు. ఓ గదిలోనుండి సన్నగా వెస్ట్రిన్ మ్యూజిక్ విన్పిస్తుంది. తలుపుమీద నెమ్మదిగా శబ్దం చేసింది. సమాధానం రాకపోవడంతో చిన్నగా నెట్టింది జ్వాల. ఎలాంటి శబ్దం లేకుండా, అతివిధేయుడయిన సేవకుడిలా తలుపు తెరుచుకుంది. లోపల ఓ పదిమంది మ్యూజిక్‌కి అనుగుణంగా డాన్స్ చేస్తున్నారు.

"ఎవరు కావాలి?!" ఓ అబ్బాయి తనవైపే వస్తూ విసుగ్గా అడగడంతో, అందరూ డాన్స్ ఆపి, ఆ అబ్బాయికంటే విసుగ్గా చూసారు.

"డాక్టరుగారు కావాలి!" శాంతి నెమ్మదిగా అన్నది.

"లేరు! యిప్పుడు రారు!" విసుగ్గా చెప్పి, యింక మీరు వెళ్ళొచ్చు నన్నట్లు చూసాడు.

"థేంక్స్" చెప్పి బైటికొచ్చారు.

ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు. హుషారుగా, హోరుమనే సంగీతం ఇద్దరి చెవుల్లోనూ గింగురుమంటూంది. పరధ్యానంగా అడుగు లేస్తున్నారు. హఠాత్తుగా కరెంటు ఫెయిలయింది.

"జ్వాల!" భయంగా జ్వాల చేతిని పట్టుకుని అన్నది శాంతి.

"ష్!" ధైర్యం చెప్తున్నట్లుగా శాంతి చేతిని గట్టిగా పట్టుకుంది. ఇంతలో రెండు చేతులు ఇద్దరి మెడలమీద పడినయ్! పడిన చేతిమీద మరో చెయ్యి. శాంతి భయంతో గడ్డకట్టినట్లయింది. జ్వాల విసురుగా వెనక్కి తిరిగి దొరికిన చేతిని గట్టిగా పట్టుకుని మరింత గట్టిగా నొక్కేసింది.

"అబ్బా!" బాధతో కూడిన మూలుగుతోపాటు, గుప్పున లైట్లు ఒక్కసారిగా వెలిగినయ్.

ఎవరో చప్పున పారిపోవటం కన్పించింది. తన చేతిలోవున్న చేతివైపు చూచింది. మృదువుగా, సుకుమారంగా, సన్నటి పొడుగాటి వేళ్ళతో ఆర్టిస్టిక్‌గా వుంది. తలెత్తి ఆ చేయి తాలూకు వ్యక్తివైపు చూసింది.

అతని ముఖం బాధని బలవంతంగా దిగమింగుతున్నట్లుగా వుంది.

"మీ...మీ...రు" అతను మాటలకోసం తడుముకున్నట్లుగా అన్నాడు.

"బావున్నామా?!" అడిగింది జ్వాల.

"అహ... కాదు!" అనుకోని ప్రశ్నకి వుక్కిరి బిక్కిరవుతూ అన్నాడు.

"ఏంటీ? బాగలేమా? కళ్ళు సరిగా పనేస్తున్నాయా?!" వ్యంగ్యంగా అడిగింది.

"అబ్బె... అదికాదు" ఖంగారుగా అన్నాడు.

"మరేంటి మిస్టర్! అమ్మాయిలు కన్పించగానే..." శాంతి విసురుగా అన్నది.

"ఛ! ఛ! నేనా వుద్దేశ్యంతో మీమీద చెయ్యి వెయ్యలేదు. మీ యిద్దరి వెనగ్గా ఒకతను నడవడం, కరెంటు పోగానే మీమీద చెయ్యి వెయ్యడం చూసి, అతన్ని తన్నాలనుకుని అతని చేతిని పట్టుకోబోయాను. మీరేమో నన్నే విలననుకున్నారు!" చిన్నగా, అతి నెమ్మదిగా చెప్పేడు.

జ్వాల, శాంతి ముఖాలు చూసుకున్నారు. మళ్ళీ యిద్దరూ ముఖాలు తిప్పి అతనివైపు అనుమానంగా చూసారు.

"ప్రామిస్! నే నలాంటి వాడిని కాను!" నమ్మకంగా అన్నాడు.

"సారీ! ఎటో ది సేమ్ టైమ్ థేంక్యూ!" జ్వాల చిన్నగా చెప్పింది.

"జ్వాల! నీ మెడమీద రక్తం!" ఆదుర్దాగా అన్నది శాంతి.

జ్వాల మెడమీద తడిమి చూసుకుంది. చేతికి చెమ్మ తగిలింది.

"ఏంటిది? మీరూ మాతో వస్తున్నారు?" శాంతి తమ వెనకే వస్తున్నతన్ని చూస్తూ, విసుగ్గా అడిగింది.

"నా దారి యిదే!"

"జ్వాల! పద, అటు వెళ్దాం!" వెనక్కి తిరుగుతూ అన్నది.

"ఎక్కడికి వెళ్తున్నారు?" అసందర్భంగా అడిగాడు.

"డాక్టర్ దగ్గరకి!" శాంతి అన్నది.

"ఎందుకండీ? ఈ కొంచం దెబ్బకే పదిరూపాయలు వదిలించుకోడం? కావాలంటే నేను కాస్త మందేసి కట్టుకడతాను" ధైర్యంగా అన్నాడు.

"ఇక్కడికి దగ్గర్లో డాక్టరెవరయినా వున్నారా?" అతని మాటలు పట్టించుకోకుండా అడిగింది జ్వాల.

"నేను పనికి రానాండి?!"

"ఈ దెబ్బకి కాదులెండి. అసలు మేము డాక్టర్ కోసమే బైలేరాం."

"నేనూ డాక్టర్ నేనండి!" నవ్వుతూ అన్నాడు.

"మీరా?!" యిద్దరూ ఆశ్చర్యంగా అడిగారు.

"అలా కన్పించడం లేదేమో కానండి, నేనయితే డాక్టర్ నే!"

"......"

"నా క్లినిక్ కొద్దిదూరంలోనే వుంది. వస్తారా?!"

"రండి!" తాళంతీసిలోపలికి ఆహ్వానించాడు. పెద్దగది. ఓ వైపు టేబులుంది. దాని చుట్టూ నాలుగు కుర్చీలు దగ్గర్లో ఓ పొడుగాటిబల్ల. గది మధ్యలో స్క్రీన్. ఓ ర్యాక్ నిండా అవసరమయిన మందులూ, మరో ర్యాక్ లో కొన్ని పుస్తకాలూ వున్నాయి.

"మీ యింట్లో అనారోగ్యం ఎవరికండి? లోషన్ నీళ్ళతో

కడిగి, టించర్ వేస్తూ అడిగాడు.

"మా తాతగారికి" శాంతి చెప్పింది.

"మీ ఫీజు!" అతను స్క్రీన్ కవతలి వైపు వెళ్తుండగా అడిగింది.

"మీ తాతగారికి కూడా చూడాలన్నారుగా? ఒక్కసారే యిద్దరు!"

"జ్వాల! యితగాడు డాక్టరేగాని, తాతయ్య ఒప్పుకోడే? ఎలా?" శాంతి సందిగ్ధంగా అడిగింది, అతను లోపలి కెళ్ళింతర్వాత.

"ఏంటి మీ తాతగారి కంప్లయింటు?!" టవల్‌తో చేతులు తుడుచుకుంటూ అడిగాడు.

"ఒకటి, అరా కాదు. బోలెడున్నాయి. అవన్నీ నాకు గుర్తు లేవు!" శాంతి నవ్వుతూ అన్నది.

"పదండి. వెళ్దాం!"

* * *

"ఎవరా అబ్బాయి?!" తాతగారు, అనుమానంగా చూస్తూ అన్నారు.

"నీ కోసమే!" శాంతి.

"నా కోసమా? పేరేంటి బాబూ? మీ దేవూరు? మీ నాన్న పేరేంటి? ఏంచేస్తుంటారు? మీ అమ్మ దేవూరు?" ఎక్కడ చూసానా అని గుర్తుకు తెచ్చుకుంటూ, అడిగారు.

అతడు యిబ్బందిగా శాంతివైపు చూసాడు.

"అదికాదు తాతయ్యా! నీ కోసమంటే నీకు తెల్సిన వాళ్ళు కాదు. డాక్టర్ గారు!"

"ఏవిటీ యీ అబ్బాయి డాక్టరా?!" అసంతృప్తిగా, గులాబిరంగులో సన్నగా, సుకుమారంగా, పొడుగ్గా వున్నతనివైపు చూసాడు.

"ఏం చదువుకున్నావయ్యా?!"

"ఎమ్. డి. చదువుతున్నానండి!" వినయంగా అన్నాడు.

"అంటే యింకా చదువుతూనే, ప్రాక్టీసా? హు! కలికాలం!

చదువులు పూర్తి కాకుండానే, డబ్బు సంపాదిస్తున్నారు!''

''అదికాదండి. నేను ఎమ్. బి. బి. యస్., చదివాను!'' ఖంగారుగా అన్నాడు.

''తాతయ్యా! నీ వంట్లో ఎలా వుందో చెప్పు. చూస్తారు!'' విసుగ్గా అన్నది.

''ఒంట్లో నీరసంగా, తలనొప్పిగా, కళ్ళు తిరుగుతున్నట్లుగా వుంది. కాళ్ళూ, చేతులూ ఒకటే లాగేస్తున్నాయి. బి. పి. వుందేమో చూడు బాబూ! సర్పాసిల్ వేసుకోమంటావా! న్యూరోబియాన్ వాడనా? లేకపోతే నవాలినా?!'' రోగాలు వాటితోపాటు వాడాల్సిన మందులూ గడగడా తనే చెప్పేసి, యివన్నీ నీ కింకా తెల్సి వుండవులే అన్నట్లుగా చూసారు.

అతను ఓపిగ్గా బి. పి. చూసి, తాతగారు చెప్పేవన్నీ అతి శ్రద్ధగా వింటూ, మధ్యలో అవసరమయినప్పుడు మాట్లాడుతున్నాడు. ఈ కుర్ర డాక్టర్లకి సహనంగా, నిదానంగా చూసే ఓపిక వుండదని తాతగారి నిశ్చితాభిప్రాయం. అలాటిదీ కుర్రవాడు తన అభిప్రాయాన్ని తారుమారు చేసేలా వున్నాడే, గట్టివాడనుకున్నాడు.

''ఇంతకీ నువ్వు ఫారిన్ వెళ్ళొచ్చావా?!''

''లేదండి!''

''లేదూ?!'' నిరుత్సాహంగా పెదవి విరిచాడు. ఫారిన్ వెళ్ళొస్తేనే కాని ఏ డాక్టరూ, డాక్టరు కాదనేది అతని అభిప్రాయం.

''ప్రాక్టీసు పెట్టావా? అదీ లేదా?!''

''పెట్టానండి!''

''అయితే రోజుకే మాత్రం వస్తుంటేంటీ?!''

''క్రొత్తగా పెట్టాను కదండీ! పదో, పాతికో వస్తాయి!''

''అంటే రోజు కొకళ్లూ, యిద్దరూనా?!''

''కాదండి. రోజుకో పదిహేనో, యిరవై మందో వస్తారు!''

''మరయితే యింకేం? పదిహేను మందయినా నూటయాభై వస్తాయిగా?!''

''అదికాదండి. నేను ఒక్క రూపాయి మాత్రమే ఫీజుగా

పుచ్చుకుంటానండి. నేను చూసేది తక్కువ జీతం వచ్చేవాళ్ళకీ, పదిరూపాయలు ఫీజిచ్చి చూపెట్టుకోలేని పేదలకి!''

"ఏంవిటీ రూపాయి డాక్టరువా?!'' ఆ అనడంలో ఆశ్చర్యం, హేళన తొంగి చూస్తున్నాయి.

అమ్మకు కాని సరుకుని, తగ్గింపురేట్లతో వసూల్చుకునే వ్యాపారి గుర్తుకొచ్చాడు. పదిరూపాయలు ఫీజంటే ఎవరూ రాక పోవడంతో, ఒక్క రూపాయ చేసేడేమో? అనుమానంగా చూసాడు.

"కాఫీ తీసుకోండి! చేతులు కడుక్కున్న తర్వాత టవల్ యిచ్చి చెప్పింది.

మౌనంగా కాఫీ త్రాగి లేచాడు.

"ఇదుగోండి మీ ఫీజు!'' యిరవై రూపాయల నోటు అందించింది.

"నా ఫీజు రెండు రూపాయలే!''

"అతగాడు రూపాయి డాక్టరేనట!'' తాతగారు చెప్పారు.

"నిజంగానా? అయినా రూపాయి ఫీజేంటి? అన్ని ధరలూ అంబర వీధుల్లో విహరిస్తుంటే, డాక్టర్ల ఫీజు అవనిమీద నిల్చిందా?!'' హాస్యంగా అన్నది జ్వాల.

"అబ్బే! డాక్టర్సందరి ఫీజు సంగతికాదు. నేను మాత్రం రూపాయే తీసుకుంటాను!''

"ఇలా అయితే మీరేమీ సంపాదించలేరు. డాక్టరన్న తర్వాత ఓ నాలుగు డిగ్రీలు, అందులో ఒకటో, రెండో ఫారిన్ వి అయితేనే మంచి ప్రాక్టీసు వుంటుంది. అలాగే అతగాడికి పదన్నా, ఇరవయ్యన్నా సవినయంగా సమర్పించుకుంటారు'' జ్వాల నవ్వుతూ అన్నది.

"నిజమే మీరన్నది. కాని ఫీజు లిచ్చుకోనని పేదలు, గుమాస్తాలు వుంటారని మర్చిపోతే ఎలా? మన జనాభాలో వాళ్ళే ఎక్కువ. అందరూ, ఫారిన్ వెళ్ళి డిగ్రీలు తెచ్చుకుని, ముప్ఫయి రూపాయలు ఫీజంటే, పేదల సంగతేంటి?''

"కాని, మీ ఫ్యామిలీ ఈ రూపాయి ఫీజుతో ఎలా గడు

స్తుంది?!''

''నా సంపాదన మీద ఆధారపడి లేరులెండి మా యింట్లో వాళ్ళు!'' నవ్వుతూ అన్నాడు.

''అంటే?!''

''మా డాడీ మంచి బిజినెస్ చేస్తున్నారు. నా అవసరం లేదు!''

''అయితే అదృష్టవంతులు మీరు. మీ ఆశయాల్ని ఆచరణలో పెట్టగలరు!''

''అబ్బే! నాకు పెద్దగా ఏ ఆశయాలు లేవు!'' మొహమాటంగా అన్నాడు.

''గుడ్ నైట్ డాక్టర్! వెరీమచ్ థాంక్స్!''

''గుడ్ నైట్! అవునూ! యింతకీ మనం పరిచయం చేసుకోలేదు కదూ? నా పేరు ధీరజ్!''

''నా పేరు జ్వాల. తను శాంతి!''

* * *

ఆ రోజుకి బజ్జీల కొట్టు పెట్టి సరిగ్గా నెలయింది. నలుగురూ కూర్చుని జమా, ఖర్చులు చూస్తున్నారు. నెలనుండీ నలుగురూ కలిసి శాంతి వాళ్ళ ముందు హాల్లో మూడు గంటలసేపు ముప్ఫయి మందికి ట్యూషన్స్ చెప్తున్నారు. మొత్తం ట్యూషన్స్ మీద నాలుగు వందలు, బజ్జీల వ్యాపారంలో ఆరువందలూ వచ్చాయి. ఇంత చేసినా ఒక్కొక్కరికి రెండువందల యాభయ్యి వచ్చింది. అయినా ఎవరూ నిరుత్సాహపడలేదు. మొదటి నెలే యింత వస్తే యింకా ముందు ముందు చాలా వస్తుందని అందరికీ అనిపించింది. అందరిలో సుధీర్ కే కాస్త నిరుత్సాహంగా వుంది.

''మనం యింత కష్టపడ్డా రెండువందల యాభయ్యేగా వచ్చింది. ఇంతకంటే పెళ్ళిళ్ళప్పుడు వంటమనిషిగా వెళ్తే రోజుకు పదిహేను రూపాయల్తో పాటు, విందు భోజనమూ దొరుకుతుంది!''

''సుధీర్! అనవసరంగా మిగతావాళ్ళని నిరుత్సాహ పర్చకు. మనం ఖాళీగా కూర్చుని, యింట్లో వాళ్ళ దీవెనలు తింటూ వుంటే

బావుందా? మన సంపాదన అంటూ వుంటే, అది ఎంతయినా కావచ్చు, మనమీద మనకెంత ఆత్మవిశ్వాసం వుంటుంది? యిదివరకటిలా మనమేమంత నిరుత్సాహంగా లేము" ప్రసాద్ ఆత్మవిశ్వాసంతోనూ, భవిష్యత్ పట్ల ఆశతోనూ అన్నాడు.

"సుక్కర్! మనం పెట్టిన పెట్టుబడిని బట్టి లాభాలు వుంటాయి. వంద పెట్టి లాభాలు వేలల్లో రావాలంటే ఎలా వస్తాయి? మనం పెట్టిన పెట్టుబడికి, పడిన కష్టానికి తగ్గ ప్రతిఫలమే వచ్చింది" జ్వాల నెమ్మదిగా, నచ్చచెప్పే ధోరణిలో అన్నది.

"నీ కిష్టం లేకపోతే మానెయ్!" ప్రసాద్ కోపంగా, విసుగ్గా అన్నాడు.

"అదికాదు జ్వాల!..." మధ్యలోనే ఆపేసాడు పోస్టుమన్ని చూసి.

జ్వాల పేర ఓ కవరుంది. జ్వాల కవరు చింపి ఆత్రంగా చూసింది.

"ఏంటది?!" మిగతా ముగ్గురూ ఒక్కసారే అడిగారు.

"అప్పుడెప్పుడో అప్లయి చేసాను. ఇప్పుడు ఇంటర్వ్యూకి రమ్మంటున్నారు."

"ఈసారి వస్తుందేమో?!" శాంతి అన్నది.

"నాకేం నమ్మకం లేదు!"

"ఈ ఫ్రారే కాబట్టి, వెళ్ళిరా. వస్తే వస్తుంది. లేకపోతే లేదు!" ప్రసాద్ అన్నాడు.

* * *

తర్వాత రోజు ఇంటర్వ్యూకి వెళ్ళింది.

"గుడ్ మార్నింగ్!" వెళ్ళగానే విష్ చేసింది.

"ఎస్! గుడ్ మార్నింగ్!" అంటూనే అలవాటుగా చెయ్యి చాచేరు.

జ్వాల మౌనంగా ఒరిజనల్స్ అందించింది.

ఇంతలో ఫోన్ రింగయింది.

"హల్లో!"

"ఆఁ ఆఁ మీరా?!" సంతోషంగా అన్నాడు.

"......"

"అబ్బే! ఇంకా సెలక్షన్ కాలేదండి!"

"......"

ఓ నిముషంసేపు అవతలవైపు వాళ్ళు చెప్పేది విన్నారు.

"ఓ! అలాగే!" అంటూ పెట్టేసారు.

"గుడ్ బై సర్స్!" టేబుల్ మీదున్న తన సర్టిఫికెట్స్ని తీసుకుని, వెనక్కి తిరిగింది.

"అదేంటి?!" ఆశ్చర్యంగా అడిగారు పార్థసారధిగారు.

ఇన్నిసార్లు ఇంటర్వ్యూ చేసినా, తనేమీ అడగకుండానే, తను వెళ్ళమనకుండానే, ఇలా వెళ్ళినవాళ్ళు తనకెప్పుడూ తటస్థపడలేదు. వర్మగారు కూడా అంతే ఆశ్చర్యంగా చూసారు.

"అవునండి. ఏ వి. ఐ. పి గారో, తమ క్యాండిడేటు వుందంటూ, ఫోన్ చెయ్యడం. మీరు సరే ననడం. ఇలాంటి సంఘటనలు సినిమాల్లోనూ, పుస్తకాల్లోనూ, మామూలే కదా? ఇప్పుడూ అంతే అయింది!"

ముందు తెల్లబోయినా, తర్వాత జ్వాల చెప్పిన తీరుకి, ఇద్దరికీ నవ్వొచ్చింది. అంత ధైర్యంగా చెప్పినందుకు మెచ్చుకోకుండా వుండలేకపోయ్యారు.

"ప్లీజ్! జ్వాల! టేక్ యువర్ సీట్!" పార్థసారధిగారు అన్నారు.

"నువ్వు చెప్పింది నిజమే! పురుషోత్తమరావుగారు తెలుసుగా? అతను ఫోన్ చేసాడు వాళ్ళ క్యాండిడేటు వుందని. కాని ఆ క్యాండిడేటు అన్నీ అనర్హతలూ వున్న వ్యక్తి! పైగా ఎస్.సి. కాదు. అతడూ ఇంటర్వ్యూకొచ్చాడు!" వర్మగారు చెప్పారు.

"థేంక్యూ సర్స్!" అతనంత వివరంగా చెప్తుంటే, మనస్ఫూర్తిగా అన్నది.

"ఈ పోస్ట్ కాకపోతే, ఇంకోటి, టెంపరరీ పోస్టు వుంది. చేస్తావా?!"

"చేస్తానండి."

"స్టెనో కమ్ టైపిస్ట్ పోస్టు. మా స్టెనో హెల్త్ బాగలేక

లీవ్ పెట్టాను రెండు నెలలు?''

అప్పటికప్పుడు అప్లికేషన్ పెట్టడం, జాయినింగ్ రిపోర్టివ్వడం వెంటనే జరిగింది. జ్వాల కింకా నమ్మ బుద్ధికావడం లేదు. దీన్ని అదృష్టమనాలో యింకేమనాలో తెలియలేదు.

*　　　　*　　　　*

అనుకోకుండా ఉద్యోగం వచ్చినందుకు మిత్రులంతా ఆనందించారు, జ్వాలని అభినందించారు. సాయంకాలం ఆఫీసునుండి రాగానే ముఖం కడుక్కోడం, మళ్ళీ తయారై స్నేహితులతోపాటు తనూ, బజ్జీలు వెయ్యడంలో సాయపడడం, ఎప్పుడో రాత్రి తొమ్మిదిన్నరకి యింటికి జేరడం. ఇదీ రోజూ కార్యక్రమం. ఒక్క క్షణం తీరక నేది లేదు.

ఆ రోజు...

ఏవో ఫైల్సుమీద పార్థసారధిగారి సంతకం కావాలంటూ, వర్మగారే వాళ్ళింటికి పంపించారు.

డబ్బున్న వాళ్ళిల్లులాగానే అత్యంతాధునికంగా, ఖరీదైన ఫర్నిచర్‌తో సినిమా సెట్టింగ్‌లా వుంది. ప్యూన్, మర్యాదగా ఆఫీసుగది చూపించి, 'కూర్చో' మని చెప్పి వెళ్ళాడు. అయిదు నిముషాలు కదలకుండా కూర్చునేసరికి విసుగ్గా వుండి, లేచి కిటికీ దగ్గర కెళ్ళింది. కర్టెన్ తొలగించి చూసింది. చల్లని గాలితోపాటు, గులాబీల సువాసనలు ఒక్కసారిగా వచ్చినయ్! అపురూపంగా అతి తక్కువగా దొరికే గులాబీల రకాలు, ఆకర్షణీయంగా, ఆహ్లాదంగా శరీరాన్నీ, మనస్సునీ మత్తెక్కించేలా వున్నాయి. చేయి చాచి పసుపురంగులో వున్న గులాబీని మృదువుగా స్పృశించబోయింది.

''ఆగు! కొయ్యొద్దు!'' పెద్ద ఉరుములాంటి కేకకి, ఉలిక్కిపడి, చేతిని వెనక్కి తీసేసుకుంది.

''ఎవరు నువ్వు? ఏం కావాలి?!'' తన అనుమతి లేకుండా గులాబీని కొయ్యబోయే జ్వాలని మ్రింగేసేలా చూస్తూ అడిగాడు.

జ్వాల మాట్లాడకుండా, యింకా గులాబీల సౌరభాన్ని మర్చిపోలేకుండా వుంది.

మనోజ్ తీవ్రంగా, జ్వాలని చూసాడు. 'ఎక్కడో చూసాను యీ అమ్మాయిని. అమ్మాయిల్ని అంగుళంనూ అందమైన అమ్మాయిల్ని ఒక్కసారి చూస్తే చాలు. గుర్తుంటుంది కొందరికి. ఆ కొందరిలో మనోజ్ మొదటివాడు. అందుకే జ్వాలని త్వరగా గుర్తుపట్టాడు. టుబాకో కంపెనీలో, ఏదో పోస్టుకి ఇంటర్వ్యూకి వచ్చినట్లు వెంటనే గుర్తొచ్చింది. ఓహో! రికమెండేషన్ కోసం కాబోలు.

"రికమెండేషన్ కోసమా?!"

తల అడ్డంగా వూపింది.

"అసలెవరికోసం వచ్చావ్?!"

జ్వాల చురుగ్గా చూసింది. ఎలాంటి పరిచయమూ లేని తనని నువ్వు అనే యీ పెద్దమనిషెవరు? జ్వాల కలాంటి వాళ్ళంటే అసహ్యం. అందుకే అతడెంత పెద్దమనిషయినా, తనూ గౌరవం యివ్వదల్చుకోలేదు.

"నీ కోసం మాత్రం కాదు!" 'నీ' దగ్గర వత్తి పలుకుతూ అన్నది.

'షాక్' తిన్నట్లు చూసాడు. ఎంత ధైర్యం యీ పిల్లకి! తనని నువ్వు అంటుందా? పైగా ఆ చూపులు చూడు! ఎంత తిరస్కారంగా వున్నాయో?

పార్థసారథిగారొచ్చేసరికి యిద్దరూ ఒకళ్ళనొకళ్ళు తీవ్రంగా, ప్రత్యర్థుల్లా చూసుకుంటున్నారు.

"జ్వాల! ఏంటిలా వచ్చావ్?!" నవ్వుతూ లోపలికొస్తూ అడిగారు.

జ్వాలట! మండిపట్లే వుంది! మనస్సులోనే అనుకుని, "డాడీ! వెళ్తున్నా!" చెప్పేసి, జ్వాలవైపు చురుక్కుమనేలా చూసి వెళ్ళిపోయాడు.

జ్వాల మౌనంగా చేతిలో ఫైల్స్ అందించింది.

"ఎలా వుందమ్మా ఉద్యోగం?!"

"బావుంది!" పొడిగా అన్నది.

"కూర్చో!" ఫైల్స్ తెరిచి చూడబోతూ అన్నారు.

జ్వాల కూర్చోకుండా, తెరిచివుంచిన కిటికీలోనుండి కన్పిస్తున్న గులాబీతోటవైపు చూస్తూ నిల్చుంది.

తర్వాత ఎక్కువసేపు వుండకుండానే వచ్చేసింది. ఆ రోజంతా గులాబీలే మనస్సులో తిరుగుతున్నాయి. వాటితోపాటు, వాడిగా వుండే ముల్లులా మనోజ్ ముఖమూ గుర్తుకొస్తూనే వుంది.

* * *

అప్పటికే ఐదు దాటింది. ఫైల్సన్నీ సర్దేసి, యింటికెళ్ళడానికి తయారవుతుండగా వర్మగారి పి. ఏ. వచ్చి చెప్పేడు.

"జ్వాల! బాస్ ఓ పదినిముషాల్లో ఏదో టైప్ చేయాల్సిన మేటరు పంపిస్తానన్నారు. ఆలస్యమయినా అంతా టైప్ చేసి వెళ్ళండి!"

"ఇప్పుడా?!"

"అవును. నాకూ యిప్పుడే ఫోన్ చేసి చెప్పేరు. నేను వెళ్తున్నాను." వెళ్తూ మరోసారి, అన్నీ టైప్ చేసి మరీ వెళ్ళమని చెప్పి వెళ్ళాడు.

పదినిముషాలు విసుగ్గా ఎదురుచూస్తూ కూర్చుంది. ఆఫీసులో ప్యూన్, తనూ తప్ప ఎవరూ లేరు. ఎంత మేటరు పంపిస్తారో? ఎప్పటికి అవుతుందో? ఆలోచిస్తూ కూర్చుంది.

అన్నట్లుగానే పదినిముషాల్లో మేటరు మనోజ్ చేత పంపించారు.

"రంగన్నా! టైపిస్టుగారున్నారా?" బైటనుండి మనోజ్ గొంతు గట్టిగా విన్పించింది.

"ఉన్నారండి!"

"అయితే యిద్దరికీ కాఫీ, టిఫిన్ తీసుకురా!"

జ్వాల అసహనంగా కదిలింది. ఖర్మ! ఇతనా వచ్చేది?

"నువ్వా?!" జ్వాలని చూస్తూనే షాక్ తిన్నట్లుగా అన్నాడు. ఆ రోజేదో రికమెండేషన్ కోసం వచ్చిందనుకున్నాడు. కాని ఆఫీస్ పనిమీద వచ్చిందనుకోలేదు. ఓహో! యిక్కడ టైపిస్టుగానా చేస్తుంది!

జ్వాల తలెత్తికూడా చూడలేదు.

మనోజ్ తను తెచ్చినవాటిని జ్వాల ముందు గట్టిగా శబ్దమయ్యేలా పెట్టాడు.

జ్వాల వెంటనే తీసుకుని చూసింది. అబ్బో! చాలా వుంది! తనేదో కొద్ది మేటరనుకుంది కాని, ఇంతుంటుం దనుకోలేదు. ఎంత స్పీడ్‌గా చేసినా రెండుగంటలకి తక్కువ పట్టదు.

"ఒన్ ప్లస్ టూ!" మనిషికి కాక, ఓ గోడకో, టేబుల్‌కో చెప్పినట్లు చెప్పాడు.

జ్వాల లేచి, షెల్ఫ్‌లో కార్బన్స్ కోసం చూసింది. ఒక్కటీ లేదు.

"కార్బన్ పేపర్స్ లేవు!" లోపలనుంచేది పైనే అన్నది.

మనోజ్ ఏం మాట్లాడలేదు.

జ్వాల మౌనంగా మేటర్ చూస్తూ కూర్చుంది.

పదినిముషాల తర్వాత ఫ్యాన్ కాఫీ, టిఫిన్ మనోజ్ కొరకు టేబుల్ మీద పెట్టాడు.

"రంగన్నా! ఓ డజను కార్బన్ పేపర్లు తీసుకురా!" తన దగ్గరవే ఐదు రూపాయలు నోటు తీసిచ్చింది.

తర్వాత, పెన్సిల్ తీసుకుని తనకి అర్థంకానివాటిల్లా అండర్ లైన్ చేస్తూ చూసింది.

"థ్యాంక్స్!" చేతులు కడుక్కుని, ప్యాకెట్స్ విప్పి రెండు ప్లేట్లలోనూ పెట్టి అన్నాడు.

"వద్దు!" తలెత్తకుండానే అన్నది.

"కాఫీ?"

"వద్దు!"

రంగన్న వచ్చిం తర్వాత, తను రాసిన పేపర్ని మనోజ్‌కి పంపింది. మనోజ్ కాఫీ సిప్ చేస్తూ అండర్ లైన్ చేసిన దగ్గర పెన్సిల్‌తో అర్థమయ్యేలా వ్రాసిచ్చాడు.

అప్పటికే కార్బన్స్, వైట్ పేపర్స్ సెట్ చేసి పెట్టింది.

"హాయ్! మనూ!" ఝంఝామారుతంలా ప్రవేశించారు మనోజ్ ఫ్రెండ్స్.

"హాయ్!" పది నిముషాలకే పరమ బోర్‌గా వుంది అలా మౌనంగా కూర్చోవడం. ఫ్రెండ్స్ రాగానే సంతోషంగా లేచాడు.

"ఏంటిలా కూర్చున్నావ్?!" రవి అడిగాడు.

చిన్నగా నుదిటిమీద చేత్తో కొట్టుకుని "ఖర్మ" అన్నాడు.

"మాకేనా టిఫిన్! నువ్వెంత మంచాడివి! మేము వస్తామని తెలిసి అన్నీ రెడీగా వుంచావ్!" ఉమ మెచ్చుకోలుగా చూసి ప్లేటు చేతిలోకి తీసుకుంది.

"ఎంత సేపుండాలి?!" కిరణ్ అడిగాడు.

"ఆవిడ ఆ మేటర్ చేసిచ్చేదాకా!" నెమ్మదిగా, విసుగ్గా అన్నాడు.

"హతోస్మి! అయితే పిక్చర్ ప్రోగ్రాం కాన్సిలేనా?" నిరుత్సాహంగా అడిగింది ఉమ.

"అహా!" రవి వెక్కిరిస్తూ అన్నాడు.

"పోన్లే! హాయిగా యిక్కడే కబుర్లు చెప్పుకుందాం!" రాధిక అన్నది.

అయిదుగురు, అక్కడ యింకో మనిషి లేనట్లే కబుర్లలో పడ్డారు. ఓ పక్క వెస్టర్న్ మ్యూజిక్, మరోపక్క సిగరెట్ల వాసనా, పేటకి తోడు కప్పెగిరి పోయేలా నవ్వులూ, కబుర్లూ! చాలా సేపు ఏమీ అనకుండానే టైప్ చేసింది. ఆ తర్వాత అంతకంతకీ వాళ్ళ గొడవ ఎక్కువైంది. కబుర్లలో నుండి, సండే ప్రోగ్రామ్ గోల్కొండ అని ఒకళ్ళూ, 'కిద్వాయ్ గార్డెన్స్' అని ఒకళ్ళూ అనడంతో అసలయిన గొడవ మొదలయింది. ఒకళ్ళు చెప్పేది ఒకళ్ళు విన్పించుకోకుండా అంతా గందరగోళంగా అరుస్తున్నారు.

"స్టాప్!" జ్వాల గట్టిగా, అసహనంగా అరిచింది.

దాంతో అందరూ ఒక్కసారిగా జ్వాలని కోపంగా, తినేసేలా చూసారు.

"ఇది ఆఫీస్!" నెమ్మదిగా, స్పష్టంగా అన్నది.

"కాని యిది ఆఫీస్ టైమ్ కాదు!" ఉమ కోపంగా అన్నది.

"కావచ్చు. కాని, నేను చేసేది ఆఫీస్ పనే!"

"మిస్! అసలు ఉమ ఎవరో తెల్సా?" రవి అడిగాడు.



యు

"ఎవరయినా నాకనవసరం. ఆఫీసులో ఇలా ప్రవర్తించడం సక్సౌర్ కాదు!" తీవ్రంగా అన్నది.

మనోక్ టేబుల్ మీద కూర్చుని, సిగరెట్ తాగుతూ, ఆసక్తిగా వింటున్నాను.

ఉమ కా మాటలకి బాగా కోపం వచ్చింది. ఈ అమ్మాయి ఎంత? యీవిడ చేసే వుద్యోగం ఎంత? తమ ఆఫీసులో జీతానికి పని చేస్తూ తననే ఎదిరిస్తుందా? ఎంత అహంకారం? ఉమ కోపంగా విసవిసా నడిచి, జ్వాల దగ్గర కెళ్ళింది.

"మిస్! నేనెవరో తెల్సా?" టైప్ రైటర్ మీద చేయివేసి విలాసంగా అడిగింది.

"తెలుసుకోవాల్సిన అవసరం లేదని యిందాకే చెప్పాను!" నెమ్మదిగా అన్నది.

"నీకు లేకపోయినా నేను చెప్తాను విను. నేను వర్మగారి చిన్నమ్మాయిని. నువ్వు పని చేస్తుంది మా ఆఫీసులో, అర్థమైం దనుకుంటా!"

జ్వాల ఆశ్చర్యంగా ఉమకేసి చూసింది. ఓ క్షణం గుండెల్లో జలదరించింది. మరుక్షణంలో సంబాళించుకుని,

"అయితే?!" అంటూ ప్రశ్నార్థకంగా చూసింది.

మిగతా అందరూ ఆసక్తిగా జ్వాల ముఖంలో కలిగిన మార్పుల్ని చూస్తున్నారు. జ్వాల అలా ఎదురు ప్రశ్నించడంతో, ఉమ తికమకపడింది. తనెవరో చెప్పగానే ఆ పిల్ల భయపడుతుం దని, యింతకుముందు అన్న దానికి 'సారీ' చెప్తుందని యెదురు చూసింది. కాని తను వూహించిన దానికి వ్యతిరేకంగా జరగడంతో ఉమ కేం చెయ్యాలో తోచలేదు.

"ప్లీజ్! చెయ్యి తియ్యండి! అర్జంటుగా చెయ్యాల్సిన మేటరిది!" సౌమ్యంగా అన్నది.

"ఇందాక మీరు అన్నదానికి 'సారీ' చెప్పండి. తీసేస్తాను!" జ్వాల తగ్గడంతో, తనూ తగ్గింది.

"నేనేం తప్పుగా అన్లేదు!"

"మా ఆఫీసులో, మేం మాట్లాడుకుంటుంటే 'స్టాప్' అనడం

తప్పకాదూ?!'' పోయిన కోపం తిరిగి తెచ్చుకుంటూ అన్నది.

''ఇది మీ ఆఫీసు కావచ్చు. కాని, నేను చేసేది మీ ఆఫీస్ పనే. అలాటప్పుడు మీరు నాకు డిస్టర్బెన్స్‌గా పోట్లాడుకోవడం......''

జ్వాలని మధ్యలో ఆపింది. ''వ్హాట్! మేము పోట్లాడుకుంటున్నామా? అసలు మీరు విన్నారా?!''

జ్వాల విన్నానన్నట్లుగా తలూపింది.

''అయితే ఆఫీస్ పని మానేసి మా మాటలు వినడం తప్పుకాదా?!''

జ్వాల నిర్ఘాంతపోయింది. విన్నానంటే, వినడం తప్పుకాదా అంటారు. విన్లేదు అంటే వినకుండానే పోట్లాట అని ఎలా అన్నారు అని అడుగుతారు. ముందుచూస్తే నుయ్యి, వెనుక చూస్తే గొయ్యిలా వుంది పరిస్థితి. చాలా నేర్పుగా యిరికించారు. మిగతా అందరూ కొత్తగా కట్టిన వాళ్ళ సంభాషణనే వింటున్నారు.

జ్వాలకి వాళ్ళముందు మాట్లాడలేనన్పించింది. అందుకే,

''మాడండి! తప్పొప్పుల పట్టిక తర్వాత చూద్దాం. ముందు యిది చెయ్యనివ్వండి!'' అన్నది.

మనోజ్ అప్పటివరకూ శ్రోతగా వున్నవాడల్లా, లేచి ఇద్దరి దగ్గిరకీ వచ్చాడు.

కిరణ్, రవి, యీ అమ్మాయిని ఎక్కడో చూచినట్లుంది. ఎక్కడ చూసామా అని గుర్తుకు తెచ్చుకుంటున్నారు జాయింటుగా.

''ఆ! ఆ స్వాగత్ ప్రక్కన బజ్జీలకొట్లో చూసాం!'' రవి హుషారుగా అన్నాడు.

''ఏయ్! నువ్వా బజ్జీల కొట్లో పిల్లవే కదూ?!'' రవి హేళనగా అడిగాడు.

జ్వాల ఆ మాటలకి కస్సుమన్నది. ''అవునోయ్! బజ్జీలమ్ముతున్నాం, కాని నీ జేబులో డబ్బులేం కొట్టెయ్యడం లేదే!'' వికారంగా ముఖం పెట్టి అన్నది.

లేకపోతే వీళ్ళ కెందుకంత చులకన. తను బజ్జీలమ్ముతుంది. ఇంకేమైనా చేస్తుంది. అదేం తప్పుపని కాదే! అయినా వీళ్ళ

కెందుకు? బజ్జీలమ్ముకున్నారు అంటే యింత హేళనగా అపహాస్యం చెయ్యాలి కాబోలు! తనకి, వాళ్ళ తాతల్లా సంపాదించిన ఆస్తులుంటే దర్జాగా, ఎవర్నీ లెక్క చెయ్యదు. ఇప్పుడు మాత్రం? వీళ్ళని 'కేర్' చెయ్యాల్సిన పనేం లేదు. తను చేస్తున్నది నీతిగా వున్నప్పుడు, ఎవరు హేళన చేసినా పట్టించుకోనవసరం లేదు.

రవి అడిగినదానికే మిగతా నలుగురూ విస్తుబోయి చూస్తుంటే, జ్వాల 'అవునోయ్' అనడంతో అందరూ ముందు తెల్లబోయినా, తర్వాత కోపంగా చూసారు.

"ఎంత ధైర్యం! ఎంత పొగరు! అవునోయ్ అంటావా?!" రవి తినేసేలా చూస్తూ ముందుకొచ్చాడు.

తన ఫ్రెండ్సు ముందర, ఓ ఆడపిల్ల, అదీ ఉమ వాళ్ళ ఆఫీసులో చేసే పిల్ల తనని అవునోయ్, అంటుందా? రవి కోపంగా మండిపోయాడు.

"నువ్వన్నేనూ? 'ఏయ్' అని. ఎంత అహంకారం, ఎంత గర్వం లేకపోతే అలా అంటావ్?!" జ్వాల, రవి మాటల కేమాత్రం బెదరలేదు. పైగా అతి నిర్లక్ష్యంగా, విసురుగా జడ వెనక్కి ఒక్క తల విసురుతో వేసుకుంది.

అందరూ జ్వాల ధైర్యానికి అచేతనంగా చూస్తున్నారు. జ్వాల యిదేం పట్టించుకోకుండా, లేచి లైట్ వేసింది. తర్వాత, పేపర్లు ఎగిరిపోకుండా షెల్ఫ్‌లోనుండి పెద్ద బైండింగ్ బుక్ తీసుకుని సీట్లో కూర్చుంది.

మేటర్ చూడ్డానికి తల పక్కకి తిప్పబోయిందల్లా, భుజం మీద బలమైన చెయ్యి పడ్డంతో విసురుగా తల తిప్పి చూసింది.

"ఉమకి, రవికి సారీ చెప్పు!" మనోజ్ తీక్షణంగా అన్నాడు.

జ్వాల ముఖం కోపంతోనూ, అవమానంతోనూ ఎర్రబడింది. టేబుల్ మీదున్న పెద్ద బైండింగ్ పుస్తకంతో బలంగా మనోజ్ చేతిమీద ఒక్క వేసింది.

"అబ్బా!" మనోజ్ బాధగా అరిచాడు, చేతిని పట్టుకుని.

జ్వాల అందరివైపూ ఓ నిర్లక్ష్యపు చూపు విసిరి, టకటక టైపు చేసింది.

అప్పటివరకూ చూస్తున్న కిరణ్, "మాకు 'సారీ' చెప్పందే మీ రీ రూమ్ నుండి బైట కెళ్ళలేరు!" దగ్గరకొచ్చి, స్పేస్ బార్ని గట్టిగా కదలకుండా పట్టుకున్నాడు.

"ముందు చెయ్యి తియ్యండి!"

"ముందు 'సారీ' చెప్పండి!" పట్టుదలగా అన్నాడు కిరణ్.

"ఇందాక మీ ఫ్రెండ్కి జరిగిన మర్యాదే మీకూ కావాలంటే అలాగే వుంచండి. నాకేం అభ్యంతరం లేదు!" జ్వాల మొండిగా అన్నది.

"కిరణ్! ఏడు దాటింది. మేటర్ చాలా వుంది. త్వరగా చెయ్యనీ! నువ్విలా రా!" మనోజ్ బుద్ధిమంతుడిలా అన్నాడు.

అందరూ నమ్మలేనట్లుగా చూసారు. మనోజ్ జ్వాల వాడకుండా కన్నుగీటాడు. కిరణ్ అర్థమయిన వాడిలా చేయి తీసేసి, జ్వాలని కోపంగా చూసి, వెనక్కి తిరిగి వెళ్ళాడు.

జ్వాల యిదేం పట్టించుకోకుండా మళ్ళీ మొదలు పెట్టింది. కాని జ్వాల 'మూడ్' అంతా చెడిపోయింది. తప్పులు రావడంతో ఓ క్షణం చెయ్యాల్సిన మేటర్ వైపు దిగులుగా, భయంగా చూసింది. జ్వాల అవస్థకి ఓ క్షణం మనోజ్కి జాలి లాటిది కలిగినా, ఆ ఫ్లాస్క్ పగిలిన గర్వం గుర్తుకొచ్చి కోపం వచ్చింది. హేళనతో కూడిన నవ్వు అందరి పెదవుల మీద లాస్యం చేసింది. జ్వాల పది నిముషాలు, కళ్ళు మూసుకుని, మౌనంగా కూర్చుంది. తర్వాత సింక్ దగ్గరకెళ్ళి, చల్లటి నీళ్ళతో ముఖం కడుక్కుని, కర్చీఫ్తో తుడుచుకుని వచ్చి కూర్చుంది. అంతే! ఒక్క క్షణం ఆపకుండా ఎనిమిదిన్నర దాకా అలాగే చేసింది. చేసిన పేపర్స్ వైపు తృప్తిగా చూసుకుని, అన్నీ వరసగా పెట్టి కవర్లో పెట్టింది. అన్నీ ఎక్కడివక్కడ సర్దేసింది. మనోజ్ దగ్గరకెళ్ళి కవర్ని గట్టిగా శబ్దమయ్యేలా పెట్టింది. మనోజ్ ఒక్కొక్క పేపరే తీసి జాగ్రత్తగా చూస్తున్నాడు. ఫోన్ రింగవడంతో, ఎవరయినా ఎత్తుతారని చూసి, ఎవరూ ఆ ప్రయత్నం చెయ్యక పోవడంతో, తనే రిసీవరందుకుంది.

"హల్లో!"

"హల్లో! జ్వాల! యింకా అవలేదూ? బ్రెయిన్ తొమ్మిదికి.

ఇప్పుడు ఎనిమిదిన్నర దాటింది. త్వరగా చెయ్యమని చెప్పి పంపించాను. ఏం చేస్తున్నావ్? అందించగలవా? లేదా?" వర్మగారు ఆదుర్దాగా అడిగారు.

"అయిందండి!"

"గుడ్! అవి తీసుకుని, మనోజ్‌తో స్టేషనుకి రా. మనోజ్ వున్నాడు కదూ?!"

"ఆ! వున్నారు."

"అయితే త్వరగా రండి. అవి అందించగలనో లేదో నని ఖంగారుపడుతున్నాను!"

"........."

"ఏం మనోజ్ లేడా? యిలా పిలు!"

జ్వాల పని యిరకాటంలో పడింది. రిసీవర్ పట్టుకుని, మనోజ్ వైపు చూసింది. అప్పటిదాకా యిటే చూస్తున్న మనోజ్, జ్వాల యిటువైపు చూడగానే టక్కున తల దించి, అతి శ్రద్ధగా పేపర్స్ చూస్తున్నట్లు నటించాడు.

"పిలుస్తున్నారు!" సంబోధన లేకుండా అన్నది.

అందరూ, తమని కాదన్నట్లుగా కూర్చున్నారు. ఎవరూ లేచే ప్రయత్నం లేదు.

జ్వాల తప్పదన్నట్లుగా, "మనోజ్ గారిని!" మనోజ్ అని, గారు అనేటప్పుడు ఎంత వికారంగా అనాలో అంత వికారంగానూ అన్నది.

మనోజ్ తీరిగ్గా లేచి రిసీవర్ అందుకున్నాడు.

"మనూ! జ్వాల, నువ్వు స్టేషన్‌కి రండి. వెంటనే బైల్దేరండి. ఎక్కువ టైమ్ లేదు!"

"అలాగేనండి!" వినయంగా అన్నాడు.

"రంగన్నా! త్వరగా తాళాలు వేసేయ్! ఉమా! రండి. వెళ్దాం" మనోజ్ వెనకే అందరూ వచ్చారు. జ్వాల ఆఖరున వచ్చింది.

"ఇవిగోండి బాబూ! తాళం చేతులు!"

మనోజ్ వాటిని జేబులో వేసుకుని కారుదగ్గరకి వెళ్ళాడు.

జ్వాలకి కావాలనే ముందుసీటు ఖాళీ వుంచి, నలుగురూ వెనక కూర్చున్నారు.

జ్వాల చేసేదిలేక వెళ్ళి కూర్చుంది.

మనోజ్ వెంటనే స్టార్ట్ చేసాడు. మరో పదినిముషాల్లో స్టేషన్లో వున్నారు.

"ఓ! ఏంటందరూ యిలా వచ్చారు?!" అందరినీ చూసి, నవ్వుతూ అడిగారు పార్థసారథిగారు.

"జ్వాలగారు ఒక్కరే వున్నారని కంపెనీ యిచ్చాం!" ఉమ నవ్వుతూ అన్నది.

"జ్వాల! అన్నీ కరెక్ట్‌గా చేసావ్ కదూ? నేను సైన్ చేస్తే చాలుగా? మళ్ళీ చూడకపోయినా ఫర్వాలేదు కదూ?!" వర్మగారు అడిగారు.

"కరెక్ట్‌గానే చేసానండి!"

"మనోజ్! జ్వాలని వాళ్ళింటిదగ్గర డ్రాప్ చెయ్యి! జ్వాల! ఆ పదో నెంబర్ ఫైలు, యివేళ ఉదయం చూసామే, దాన్ని మరో సారి, పి. ఏ. కి చూపెట్టి టైప్ చెయ్యాల్సినవి చేసివుంచు. అప్పుడు మర్చిపోయ్యాను. రేపుదయం శర్మ (పి. ఏ.) గారు రానన్నారు. నువ్వు చూడు. తెలుస్తుందిలే!"

"అలాగేనండి!"

"ఓ. కె. గుడ్‌బై!" ట్రైన్ నెమ్మదిగా కదిలింది. ఇద్దరూ చేతులూపుతూ బైటే నిల్చున్నారు.

జ్వాల తప్ప అందరూ చేతులూపుతూనే వున్నారు.

"రండి!" జ్వాల సందేహించడం చూసి అన్నాడు మనోజ్.

"నేను బస్‌లో వెళ్ళగలను" నిలబడకుండా, ముందుకు నడిచింది.

"డ్రాప్ చేస్తాం. రండి!" మరోసారి అడిగాడు.

కాని జ్వాల అప్పటికే కారు దాటి వెళ్ళిపోయింది.

"ఎందుకు ఆవిడని బ్రతిమాలడం?!" విసుగ్గా అడిగింది ఉమ.

మనోజ్ చిన్నగా తన ప్లాను వివరించాడు. అందరూ ఆమోదించారు. ఆ ప్లాన్ చెప్పినందుకు మనోజ్‌ని అభినందించారు.

బస్ స్టాప్‌లో నిలబడిన జ్వాల ముందు కారు ఆపి, "రండి! బస్సు యిప్పుడు వచ్చేలా లేదు!" అన్నాడు.

జ్వాల మాట్లాడలేదు.

"రండి!" డోర్ తెరిచిపట్టుకుని అన్నాడు.

మరోక్షణంలో తను ఎక్కకపోతే, అతనే ఎక్కించేలా వున్నాడు. అందుకే, యింకేమనకుండా వెళ్ళి కూర్చుంది.

మనోజ్ కారుని, అతి ఖరీదయిన హోటల్ ముందు ఆపేడు.

"జ్వాల! ఇవేళ మీరు మాకు పార్టీ యిస్తున్నారు. ఎందుకో తెల్సా? మీకు జాబ్ వచ్చిన సందర్భంగా!" తెచ్చిపెట్టుకున్న నవ్వుతో అన్నాడు మనోజ్.

"నేనా? ఇప్పుడా?" ఖంగారుగా, భయంగా అడిగింది. పర్సులో వున్న మూడురూపాయిల చిల్లర కళ్ళముందు కదిలింది. వీళ్ళ వాలకం చూస్తుంటే బలవంతంగా యిప్పించుకునేలా వున్నారు.

"రండి. లోపలికెళ్దాం!" మనోజ్, కిరణ్ యిద్దరూ జ్వాల కిరువైపులా నిలబడ్డారు. వెనకగా ఉమ, రాధిక, రవి వున్నారు.

జ్వాల గాఢంగా నిట్టూర్చి ముందుకు నడిచింది.

అందరూ ఏర్‌కండిషన్డ్ ఫ్యామిలీ రూమ్‌లో కూర్చున్నారు.

ఈసారి జ్వాల కావాలనే మనోజ్ పక్కగా కూర్చుంది.

మనోజ్ రెండు స్వీట్స్, రెండు హాట్స్, ఐస్‌క్రీమ్‌కి ఆర్డరిచ్చాడు. చాలా సరదాగా, మాటిమాటికీ జ్వాలనికూడా తమలో కలుపుకుంటూ మాట్లాడుతూ కూర్చున్నారు. జ్వాల భయాన్ని లోపలికి నెట్టేసి, ముఖం నిండా నవ్వు పులుముకుని, అంతకు ముందేమీ జరగనట్లుగా, వాళ్ళే తన బెస్ట్ ఫ్రెండ్సన్నట్లుగా మాట్లాడింది.

అందరూ చాలా సద్దాగా మాట్లాడుతూ తింటున్నారు.

మనోజ్‌కి కాని, మిగతా వాళ్ళకి గాని జ్వాల తీరు అర్థం కాలేదు. ఎంత నిర్భయంగా కూర్చుంది! ఆ అమ్మాయి పర్సులో మూడురూపాయలు మించి లేవని, తను చూసానని గట్టిగా చెప్పేడే మనోజ్. మరి పిల్ల నిమ్మకి నీరెత్తినట్లు, తనకేం పట్టనట్లు కూర్చుం

దేంటి? ఓ వేళ తమెవరైనా బిల్ చెల్లిస్తారనుకుంటుందేమో?

"ఈ చేత్తోనే వెట్ పార్టీకూడా యిస్తారా?" మనోజ్ కొంటెగా అడిగాడు.

"ఓ! ఎస్! మీకు కావాలంటే తీసుకోండి!" నిర్భయంగా నవ్వుతూ అన్నది.

మనోజ్ బీర్ బాటిల్ తెప్పించాడు.

అందరికీ గ్లాసుల్లో పోసి, ఐస్ వాటర్ కలిపి తనే యిచ్చాడు.

"జ్వాలగారు యిలాగే ఎప్పుడూ మనకి పార్టీలు యిస్తుండాలి!" అందరూ టోస్ట్ చేశారు.

జ్వాల తన గ్లాసుని మనోజ్ ముందుకి నెట్టింది.

"అలవాటు లేదా?!" రవి అడిగాడు, కంఠంలో ఏ మాత్రం హేళన లేకుండా జాగ్రత్తపడ్డాడు.

"ఊహుఁ."

"అయితే యింకో ఐస్ క్రీము తీసుకోండి!" జ్వాల సమాధానం చెప్పకుండానే, బేరర్ కి తీసుకురమ్మని చెప్పాడు.

జ్వాల మౌనంగా తల వంచుకుని, నెమ్మదిగా తింటూంది.

అందరూ ఒకళ్ళకొకళ్ళు సైగలు చేసుకుని ఒక్కసారిగా లేచారు.

"మేం బైట వెయిట్ చేస్తుంటాం! త్వరగా రండి!" మనోజ్ నవ్వుతూ, అతి మర్యాదగా చెప్పాడు.

జ్వాల తలూపింది.

వెళ్తూ, మనోజ్ ఆగలేక, తల వెనక్కి త్రిప్పి జ్వాల వైపు చూసాడు. జ్వాల ముఖంలో తనాశించిన భయంగాని, ఆందోళనగాని ఏవీ లేవు. నిదానంగా తింటూంది. మనోజ్ జ్వాలని మరోసారి పరిశీలించి చూసాడు. జ్వాల వంటిమీద చిన్న పొత్తు బంగారం లేదు. అలా అనుకుంటే గిల్టువి కాని, మట్టిగాజులూ, పూసలూ లాటివికూడా లేవు. ఏంటీ పిల్ల ధైర్యం? ఏం చూసుకుని యింత ధైర్యం. దాదాపు ఎనభైరూపాయల బిల్లు ఎలా యిస్తుంది? చూడాలని యమ ఆసక్తిగా వున్నా, ఉమ చేయిపట్టుకు లాగడంతో తప్పనిసరిగా బైటికెళ్ళాడు.

"బిల్ తీసుకురా?" జ్వాల ఐస్‌క్రీము తిని చెప్పింది.

వందరూపాయల నోటు ప్లేట్లో వేసి, "ఛమీటా పాన్! ఏక్ విల్స్ సిగరెట్ ప్యాకెట్!" చెప్పింది.

దాదాపు పదిహేను రూపాయలు ప్లేట్లో అలాగే వదిలెయ్యడంతో, బేరర్ విస్తుపోయి నిల్చున్నాడు.

"తీసుకో!" జ్వాల నవ్వుతూ చెప్పింది.

బైట అందరూ ఆత్రంగా, హోటల్లో జరగబోయే గల్లంతుని ఎదురుచూస్తూ నిల్చున్నారు. తిక్క తిక్కగా వదులుతుంది. పోకపోతే ఎంత పొగరు? ఎంత బిడిసిపాటు? కసిగా ఎవరికి వాళ్ళే మనస్సుల్లో అనుకున్నారు.

జ్వాల ఠీవిగా, మహారాణిలా నడిచి వచ్చింది.

"తీసుకోండి. ఇది వుంటే కాని మీ పార్టీ పూర్తి కాదేమో?" అందరి ముఖాల్లోకి పరిశీలనగా చూస్తూ, చేయి చాపి, కర్చీఫ్‌లో వున్న మీటాపాన్ని, సిగరెట్ ప్యాకెట్‌ని వాళ్ళముందు పెట్టింది.

అందరూ అలా తెల్లబోయి చూస్తుంటే జ్వాలకి విరగబడి నవ్వాలనిపించింది. బలవంతాన వచ్చే నవ్వు ఆపుకుంది. అప్పటికే నవ్వుతున్నట్లున్న జ్వాలని చూసి, ఘోరమైన అవమానం జరిగిన వాడిలా ఫీలయ్యాడు మనోజ్.

"అలాగేంటలా చూస్తున్నారు? తీసుకోండి!" మరోసారి నవ్వుతూ హెచ్చరించడంతో, తీసుకున్నారు. థాంక్స్ చెప్పాలని కూడా ఆ సమయంలో ఒక్కళ్ళకీ గుర్తులేదు. వున్నా చెప్పేవాళ్ళు కాదేమో?

జ్వాల ఆపమన్నట్లుగా యాం తికంగా, హోటల్ స్వాగత్ పక్కనే ఆపి, జ్వాల దిగగానే స్టార్ట్ చేసాడు.

జ్వాల నవ్వుతూ 'టాటా' చెప్పింది.

"ఎందుకింత లేటయింది?!" శాంతి అడిగింది.

"ఇవాళెంత పెద్ద వండర్ జరిగిందో తెల్సా?" నవ్వుతూ అన్నది.

"ఏంటది?!" కుతూహలంగా అడిగాడు సుధీర్.

జ్వాల జరిగిందంతా, ఒక్క అక్షరం పోకుండా చెప్పింది.

"ఇడియట్స్! నన్నే ఫూల్ని చేద్దామనుకున్నారు!" కసిగా అన్నది.

నలుగురూ చాలాసేపు మాట్లాడలేదు.

"ఇంతకీ ఆ డబ్బు లెక్కడివి?!" ప్రసాద్ సందేహంగా అడిగాడు.

"మనోజ్ జేబులోవి!" నిదానంగా అన్నది.

"మైగాడ్!" ప్రసాద్, శాంతి ఆశ్చర్యంగా నోళ్ళు తెరిచారు.

"ఏం? వాళ్ళు చేసిన పని బావుందా? నా దగ్గర డబ్బు లేవని తెల్సికూడా వాళ్ళలా చెయ్యడం ఎలా వుంది? అందుకని, మనోజ్ జేబులోంచి ఒడుపుగా కాజేసి,బిల్ చెల్లించాను"అన్నది నిర్లక్ష్యంగా జ్వాల.

అంతలో "హాయ్! జ్వాల! శాంతి!" అన్న మాటలు వినిపించాయి.

"హాయ్! డాక్టర్! రండి!" నవ్వుతూ ఆహ్వానించారు ధీరజ్ ని.

"జ్వాల! మీరు చెప్పిందంతా విన్నాను. వినాలని కాకపోయినా చెవులబడింది. ఇక్కడో పేషెంటుని చూసొస్తూ, ఇలా వెళుంటే మీరు కన్పించారు. ఆగాను. కాని మీ రెవరూ చూడకపోతే, ఏం చెయ్యాను? అలాగే నిల్చున్నాను. ఐ కంగ్రాచ్యులేట్ యూ జ్వాల!"

జ్వాల తెల్లబోయింది. ధీరజ్ అంత చనువుగా, ఫ్రెండ్లీగా, చెప్తుంటే. ఆ రోజు ఒక్కమాట కూడా సరిగ్గా మాట్లాడని ధీరజ్ గుర్తుకొచ్చి చిన్నగా నవ్వింది.

"మీ తాతగారి కెలా వుంది?!" శాంతివైపు తిరిగి అడిగాడు.

"బాగానే వున్నారు."

"డాక్టర్ ధీరజ్! వీళ్ళు మా ఫ్రెండ్స్ ప్లస్ మా బిజినెస్ పార్ట్నర్స్. సుధీర్, ప్రసాద్" ముగ్గురికీ పరిచయం చేసింది జ్వాల.

తర్వాత అందరూ బస్ స్టాప్ లో కొచ్చి నిలబడ్డారు. ముందుగా ప్రసాద్, సుధీర్ వాళ్ళ బస్ రావడంతో వాళ్ళు వెళ్ళిపోయారు.

"మీరీ బిజినెస్ ఎందుకు పెట్టారో అడగొచ్చా?"సందేహంగా

చూస్తూ అన్నాడు.

"అందరూ ఎందుకు పెడతారు? డబ్బు సంపాదించాలని. మేమూ అందుకే!" శాంతి చెప్పింది.

"కాని యిలాటిది, మీలా చదువుకున్న వాళ్ళెవరూ పెట్టరు. ఇంట్లో పనిచేయడానికీ కొందరికి చదువుకున్నామనే అహం అడ్డొస్తుంది..."

ఫిరోజ్ వి మధ్యలోనే ఆపి, "మీ డాడీ బిజినెస్ బావుందన్నారు కదా? హాస్పిటల్ ఓపెన్ జెయ్యాక ఇంత చిన్న క్లినిక్ ఎందుకు పెట్టారు?!" అడిగింది.

"డాడీ డబ్బుతో హాస్పిటల్ ఓపెన్ చేస్తే, డాడీ, పది రూపాయల ఫీజంటే పది, ఇరవయ్యంటే ఇరవై తీసుకోవాలి. అలా కాకుండా నా డబ్బుతో ఎంత చిన్నది పెట్టినా నాకు తృప్తి. నా ఇష్టమైనట్లుగా ఫీజు తీసుకోవచ్చు" వివరంగా చెప్పాడు.

"మీ దగ్గరున్న డబ్బుతో చిన్న క్లినిక్ వస్తే, మా నలుగురి దగ్గరున్న డబ్బుల్లో యిది పెట్టగలిగాం. వుద్యోగాలు మాలాటి వాళ్ళకి ఎప్పుడో కాని రావు. ఈ లోపల అమ్మా, అయ్యా చేత దీవెనలు!" నవ్వుతూ వివరించింది శాంతి.

ఫిరోజ్ శాంతి చెప్తుంటే శ్రద్ధగా వింటూ నిల్చున్నాడు.

"అదుగో. మా బస్ వస్తూంది!" జ్వాల అన్నది.

"గుడ్ నైట్!"

*   *   *

ఆ రోజు ఆదివారం...

శాంతికి టైప్ పరీక్షలింకా పదిహేను రోజులే వుండడంతో, ఆదివారం కూడా ఇన్స్టిట్యూట్ కెళ్ళింది. ప్రతాప్ బైటికెళ్ళాడు. బామ్మగారు ప్రక్కింటి కెళ్ళారు. జ్వాల తీరిగ్గా, యీ వారం రోజుల బట్టలు వాష్ చేస్తుంది.

"సాకి రేవు బాన ఏమంది...?"

దగ్గరగా పాట విన్పించడంతో, బట్టలకు సోప్ పెడుతున్నదల్లా, తలెత్తి చూసింది. వంటింటి గడపలో నుంచుని రాగయుక్తంగా, చప్పట్లు కొడ్తూ పాడుతున్నాడు మనోజ్.

"మీరా!?" ఆశ్చర్యంతో, నిటారుగా నిల్చుంటూ అన్నది.

మనోజ్ అవునన్నట్లుగా తలూపి, మళ్ళీ పాటందుకున్నాడు.

"ఏం చేయమన్నదా? వీపు సాఫు చేయమన్నది!" గుర్రుగా చూసి కోపంగా అన్నది.

"ఎందుకొచ్చారు?" సూటిగా అడిగింది.

అసలు మనోజ్ కి తమ ఇల్లెలా తెలుసు? అయినా యింటికి రావడం ఎందుకో అర్థం కాలేదు.

"పనుండి!" నవ్వుతూ, జ్వాల వెళ్ళడానికన్నట్లు దారి యిచ్చాడు.

"ఏం పని?!"

"మా ఫ్రెండ్స్ పిక్నిక్ ఏర్పాటు చేశారు. మీరు కూడా వస్తే బావుంటుందని తీసికెళ్ళడానికి వచ్చాను. వస్తారా?!" మర్యాదగా, జ్వాల వెనకే నడిచి ముందు గదిలో కొచ్చి అన్నాడు.

"రాను. నాకు చాలా పనుంది!"

"రావాలి. మా ఫ్రెండ్స్ తప్పకుండా రమ్మన్నారు!"

"......" మాటలు అనవసరం అన్నట్లుగా చూసింది.

"నే నింకో రెణ్నిముషాలు యిక్కడే వుంటే. మా ఫ్రెండ్సంతా మీ యింటిమీదకు దండెత్తుతారు. అప్పుడెలాగా రాకతప్పదు!"

"అయితే త్వరగా వెళ్ళండి!" నిర్మొహమాటంగా అన్నది.

"మీరు రాందే వెళ్ళను!"

"చూడండి! మీరు వున్నవాళ్ళు. పని లేనివాళ్ళు. కాని మాకు ఆదివారాలు కూడా, మిగతా రోజుల్లాగే పనుంటుంది. మీలా షికార్లు కొట్టడానికి మాకు తీరికా వుండదు. డబ్బూ వుండదు!"

"ఉన్న వాళ్ళమే కాని పని లేనివాళ్ళం అంటే ఒప్పుకోను. పిక్నిక్కు వెళ్ళడం ఓ పని కాదంటారా?" తనలాటివాడు యింటి కొచ్చినా, ఏమాత్రం సంతోషించకుండా, నిర్లక్ష్యంగా వుంది! కనీసం కాఫీ ప్రయత్నాలు కూడా చెయ్యకుండా, ఎప్పుడు వెళ్తాడా అన్నట్లు చూస్తూంది పైగా.

"మీ ఆహ్వానికో నమస్కారం! మీకో నమస్కారం! ఇంక

దయ చేస్తారా?" విసుగ్గా, రెండు చేతులూ చప్పుడయ్యేలా నొడించి అన్నది.

మనోజ్ ఏదో మాట్లాడే లోపలే, తుపానులా వచ్చిపడ్డారంతా.

"ఏంటింకా అలాగే వున్నారు? త్వరగా రండి!" ఉమ చనువుగా అన్నది.

వాళ్ళెంతగా తననెందుకు పిలుస్తున్నారో అర్థం చేసుకోలేనంత అమాయకురాలేం కాదు. ఏదో గట్టి అవమానమే చెయ్యడానికి ప్లాన్ వేసుంటారు. వీళ్ళని నమ్మి వాళ్ళతో వెళ్ళేంత తెలివి తక్కువది కాదు తను.

"సారీ! నేను రావడం లేదు. మీ టైము వేస్టెందుకు చేసుకుంటారు ఇక్కడుండి!" వ్యంగ్యంగా అన్నది.

అందరూ మనస్సులోనే పళ్ళు నూరుకున్నారు. చేసేదిలేక వెళ్ళిపోయ్యారు.

"ఆవిడనేదో అవమానించాలనుకుంటాం. కాని మనమే ప్రతిసారీ బోల్తా పడుతున్నాం!" మనోజ్ సాలోచనగా అన్నాడు.

"ఎప్పుడో ఓసారి ఛాన్స్ దొరక్కపోతుందా?!" రవి, ఉమ ఆశగా అన్నారు.

ఎప్పుడు ఛాన్సు దొరుకుతుందా అని వేయికళ్ళతో ఎదురు చూస్తూనే వున్నారంతా.

* * *

"హాయ్! డాక్టర్ సాబ్! మీరోసారి మా ఇంటికి రావాలి!" శాంతి లోపలి కొస్తూ అన్నది

"ఎందుకండీ?"

"మా తాతగారికి మళ్ళీ డాక్టర్ అవసరం వచ్చింది!"

"ఓ పదినిముషాలు కూర్చుంటారా? ఇప్పుడే వస్తాను. ఇక్కడే దగ్గర్లో ఓ పేషంటుని చూసి రావాలి!"

"అలాగే. కాని త్వరగా రావాలి!"

అన్నట్లుగానే పదినిముషాల్లో వచ్చాడు. తాళం వేసేసి, "పదండి. వెళ్దాం" అన్నాడు.

"ఎలా వుంది మీ బిజినెస్?!"

"నా ముఖంలానే వుంది!" నిరాశగా అన్నది.

"మీ ముఖానికేం చాలా బావుంది!" నవ్వుతూ ఆమె నాలుక్కరుచుకున్నాడు.

"సారీ! నా చెయ్యి మటుకు పట్టుకోకండి!" మెల్లంగా అన్నాడు.

శాంతి విస్తుబోయినట్లు చూసింది. తర్వాత ప్రశాంతమైన దానిలా నవ్వింది.

"మా జ్వాలకీ ఆ అలవాటు వుంది. నాకు లేదు. జ్వాల చేతిని గట్టిగా పట్టుకుంటే గిలగిలా తన్నుకునేదాకా వదల్దు" నవ్వుతూ అన్నది.

"అబ్బ ఎంత గట్టిగా పట్టుకున్నారంటే, ఎముకలు విరిగిపోతాయేమో ననుకున్నాను."

"అంతే! అది మామూలుగా పట్టుకున్నా ఓర్చుకోలేరు."

"ఇంతకీ మీ బిజినెస్సెలా వుంది!"

"ఊళ్ళో కలరా ఎక్కువగా వుందిగా! ఇలాటివన్నీ బలవంతంగా మూసేసారు. ఖర్మ! మేమేది పెట్టినా కలిసిరావడంలేదు" నిరుత్సాహంగా అన్నది.

"మరేం చేస్తున్నారు?"

"ఏం చేస్తాం! తిని తిరుగుతున్నాం. నిజంగా యింట్లో వుండడం ఎంత బోర్‌గా వుందో చెప్పలేను. మొదటినుండీ ఇంట్లో వుంటే యింత బోర్ కొట్టదు. మొన్నటిదాకా కాలేజిలో చదువుకుని, యిప్పుడు ఏ పనీ లేకుండా యింట్లో వుండాలంటే కాళ్ళు విరగ్గొట్టినట్టుంది."

"జ్వాల ఏం చేస్తున్నారు?"

"జ్వాలకి టెంపరరీ జాబ్ వుందిగా? అదే చేస్తుంది!"

"మరి ప్రసాద్, సుధీర్‌లు?!"

"వాళ్లు సర్వే చేస్తున్నారు!"

"ఎలా వుండండి తాతగారూ?! కులాసాగా వున్నారా?!" నవ్వుతూ పరామర్శించాడు.

నిజానికి తాతగారు పైకి ఆరోగ్యంగానే వున్నాడు. అసలీ వయస్సులో వుండతగ్గ జబ్బులేవీ లేనేలేవు. అయినా ఆయనకదో అనుమానం. తుమ్మితే, దగ్గితే, జ్వరం వస్తే యిలా ఎంత చిన్న దొచ్చినా అదేదో పెద్ద జబ్బయినట్లు వూహించుకుని తను భయపడి, నానా హంగామా చేసి ఎదటివాళ్ళని కూడా భయపెట్టేసుంటాడు.

శాంతి "నీకేం రోగంలేదు తాతయ్యా! వూరికే ఖంగారు పెట్టక" పొరపాటున అన్నదో యింకా పిల్లని రఘాడించిగాని వదిలి పెట్టడు.

"మీ అయ్యా పెట్టే బలమయిన తిండికి, మీ అయ్యా ఇప్పించే మందులకీ ఆరోగ్యంగా ఎందుకుండనూ?!" అంటూ అర్ధగంటదాకా సణుగుతూనే వుంటాడు.

అందుకే అతగాడు డాక్టర్‌ని తీసుకురమ్మనగానే తీసుక వస్తుంటారు. డబ్బున్న రోజుల్లో జరిగినట్లుగానే యిప్పుడూ జరగా లంటాడు. ఎలా జరుగుతుందో మాత్రం ఆలోచించడు. తను చెప్పింది చేసి తీరాల్సిందే! అనుకున్నది జరిగి తీరాల్సిందే. విసుక్కుంటూనే అతను చెప్పింది చెయ్యడం అలవాటయింది, ఆ ఇంట్లో అందరికీ.

"ఆఁ! ఏం కులాసా నాయనా! వంట్లో అరడజను జబ్బుల్తో, మా అబ్బాయి యిప్పించే డజను మందుల్తో కులాసాగా వుండక ఛస్తానా?!" వెటకారంగా అన్నాడు.

ధీరజ్ అర్థం కానట్లు శాంతివైపు చూసాడు.

'తర్వాత చెప్తాను. ముందు చూడండి!' అంటూ సైగచేసి లోపలికెళ్ళింది.

పావుగంట తర్వాత ధీరజ్‌ని పంపడానికంటూ తనూ బైల్దేరింది.

"మా తాతగారి ఆరోగ్యం బాగుందికదూ?!"

"ఆఁ! బానే వున్నారు. నిజానికా వయస్సులో అంత ఆరో గ్యంగా వుండటం అరుదు. కాని..." తటపటాయిస్తూ ఆగేడు.

"మీరు చెప్పేది నిజమని మాకూ తెలుసు. కాని మీరేకాదు, ఏ డాక్టరొచ్చే ముందయినా, లేదా ఎవరయినా తెలిసిన వాళ్ళు పరామర్శించడానికొచ్చినా, మంచంలో పడుకుని, తను అనా

రహస్యంగా వున్నాడని, చూడ్డానికొచ్చిన వాళ్ళు అనుకోవాలని రాని మూలుగు మూలుగుతూ యిలా చేస్తుంటాడు. ఏం చేస్తాం? ఒక్కొక్కళ్ళకి ఒక్కో పిచ్చి!'' నిర్వేదంగా అన్నది.

"అవును. కొందరా వయస్సులో అలానే చేస్తుంటారు!''

"వెరీమచ్ థేంక్ యూ డాక్టర్! గుడ్‌నైట్!''

"గుడ్ నైట్! గుడ్ బై!''

* * *

ఉద్యోగంలో చేరి రెండు నెలలు దాటింది. ఇంతవరకూ ఒక్క పైస కూడా జీతంగా యివ్వలేదు. జ్వాల అడగనూ లేదు. ఇప్పటివరకూ అంతకుముందున్న డబ్బుతో ఎలాగో గడిచింది కాని, ఇంక ఒక్క రోజు కూడా గడిచేలా లేదు. ముందు ఇంట్లో ఇబ్బందిలా వున్నా, బస్సు ఖర్చులు మాత్రం పెట్టుకోక తప్పడం లేదు. ఏదయినా ఈ రోజు అడగాల్సిందే. తను భయపడకుండా, సూటిగా అడగాల్సిందే. హఠాత్తుగా గుర్తొచ్చింది, వర్మగారు నాలుగు రోజులుగా వూళ్ళో లేరని. వచ్చే సూచనలు కూడా ఏం లేవు. తనేమో ఆఫీసు కెళ్ళాలని నాలుగు మెతుకులు తినొస్తుందిగాని, యింట్లో వుండే వాళ్ళే కదా అని 'టీ'లతో ఎన్ని రోజులని కాలక్షేపం చేస్తారు? పేదరికాన్ని మించిన ఘోర నరకం యింకెక్కడా వుండదు. వెధవ జీవితం! హాయిగా ఒక్కపూట బాగా తిని సుఖంగా నిద్రపోలేని జీవితం? ఛ! ఛ! తనలాంటి వాళ్ళ నెందుకు పుట్టిస్తాడో ఆ దేవుడు. తన స్నేహితులు కూడా తనకి తగినవాళ్ళే! హు! స్నేహం పట్టేది ఒకే స్థాయిలో వుండే వాళ్ళకేకదా? తనకో లక్షాధికారి ఫ్రెండెందుకుంటుంది?

"జ్వాల! జ్వాల!'' టేబుల్ దగ్గర నిల్చుని గట్టిగా పిలుస్తున్నాడు మనోజ్.

జ్వాల ఆలోచనల్లో నుండి తేరుకుని, ఎదురుగా వున్న మనోజ్ వైపు అర్థం కానట్టు చూసింది.

"ఏంటలా వున్నారు? ఎంత పిల్చినా పలకరేం?!'' ఆశ్చర్యంగా అడుగుతున్నాడు.

ముద్దుగా చూసింది. మహానుభావుడు! ఒక్కడే వచ్చినట్లుంది. వెంట స్నేహితులూ లేరు, వచ్చే సూచనలూ లేవు. ఎందుకొచ్చాడో! ఇప్పుడుగాని టైప్ చెయ్యమనడు కదా? ఊహుఁ! చేతి వ్రేళ్ళు సమ్మె చేసినట్లుగా, కదిలేట్లు లేవు.

"ఏంటింకా వున్నారు?"

జ్వాల విస్తుపోయినట్లుగా చూసింది.

"అదేంటండి! అలా చూస్తారు? ఆఫీస్ టైమయిపోయి పావుగంటయింది. అందరూ వెళ్ళిపోయారు. మీకేదయినా పనుందా?!"

'లేద'న్నట్లుగా తలూపింది.

"మరెందుకున్నారు?!"

జ్వాల మౌనంగా ఫైల్సు తీసేసి, టైప్ రైటర్‌కి కవర్ వేసి లేచింది.

"డ్రాప్ చేస్తాను. రండి!" వినయంగా డోర్ తీసి పట్టుకుని అన్నాడు.

అనుమానంగా చూసిందతని వైపు. అయినా తనిప్పుడు రెండు బస్సుల కోసం ఎదురు చూసి, గంటన్నర నిల్చుని, పది నిముషాలు నడిచి ఇల్లు చేరుకునే ఓపిక లేదు. హాయిగా కళ్ళు మూసుకుని కూర్చుంటే పదినిముషాల్లో తనింట్లో వుంటుంది. యాంత్రికంగా వెళ్ళి కూర్చుంది.

తన స్థితిని తల్చుకుంటే నవ్వొస్తుంది. పైసా, ఠికానా లేదు కాని దర్జాగా యింపోర్టెడ్ కార్లో వెళ్తుంది. మనోజ్‌తో మాట్లాడితే గొప్ప, సినిమా కెళ్తే గొప్ప. షికారెళ్తే గొప్ప. ఇలాగనుకునే వాళ్ళు చాలామందే వున్నారు. పార్థసారథిగారి లాంటి ఇండస్ట్రియలిస్ట్ గారి ఏకైక పుత్రుడు, వర్మగారికి కాబోయే అల్లుడు! మరి గొప్ప కాక ఏంటిది? అయినా తనేంటిలా ఆలోచిస్తుంది. ఈ మనోజ్ తనకి కన్పించినప్పుడల్లా, ఏదో ఒక అవమానం చెయ్యడానికి ఎదురుచూడ్డం తనకి తెలియందా! ఇప్పుడూ ఏదో ప్లాన్ వేసుకునే వుంటాడు. ఇప్పుడా అవమానాన్ని తనెదుర్కొనేంత ఓపిక తన్లో లేదు.

“దిగండి!”

జ్వాల ఆలోచనల్లో నుండి ఒక్కసారిగా తేరుకుని చూసింది. తననుకున్నట్లుగా యిది తనిల్లు కాదు. హోటల్ తాజ్. హోటల్ని చూడగానే ఆకలి గుర్తొచ్చింది. లోపల ఆత్మారాముడు ఆనందంతో గంతులేస్తున్నాడు. ఏదవుతే అదే అవుతుంది. ముందీ ఆకలిని తీర్చాలి. మరేం మాట్లాడకుండా దిగి అతని వెనకే నడిచింది.

మనోజ్‌కి తను చెప్పబోయేది ఎలా చెప్పాలా అని తికమక పడుతున్నాడు. తను చెప్పింతర్వాత యీవిడ ఎంతెత్తున ఎగురుతుందో? ఎన్ని మాటలంటుందో?

“దో కాఫీ!” బేరర్‌కి పరధ్యానంగానే చెప్పాడు.

“ఊహుఁ. నాకు రెండు దోసెలు, ఓ ఉప్మా!” జ్వాల తటపటాయిస్తూనే అన్నది.

బేరర్ వెళ్ళిపోయాడు.

జ్వాల మౌనంగా రెండు దోసెలు, ఉప్మా తిన్నది. అయినా ఆకలేం తీరలేదు. వెధవ టిఫిన్లు! ఎన్ని తిన్నా కడుపు నిండదు. మరీ ఆ దోసెలు, ఈ కలవారి పిల్లల్లాగే అతి నాజూగ్గా వున్నాయ్! ఛ ఛ! ఏం బావున్నాయ్! మరో రెండు దోసెలు తిని, రెండు స్వీట్స్ చెప్పింది. మనోజ్ కళ్ళప్పగించి చూడ్డం తప్ప ఏం మాట్లాడలేదు. కాఫీ త్రాగింతర్వాత కాని కాస్త హుషారు వచ్చినట్లు లేదు. ఆ బిల్ తనకే యిస్తాడేమోనని చూసింది. మనోజ్ అదేం పట్టించుకోకుండా బిల్లు చెల్లించి లేచాడు. జ్వాల ఆశ్చర్యంగా చూసింది. ఇవాళేం టిలా వున్నాడు! ఏమీ అనకుండా అంత పరధ్యానంగా వున్నాడేం? కలవారబ్బాయికి కూడా కష్టాలా? ఏదయినా, తృప్తిగా టిఫిను తినిపించిన మనోజ్‌కి మనసులోనే థాంక్స్ చెప్పకోకుండా వుండలేకపోయింది.

“జ్వాల!” చాలా మృదువుగా పిల్చాడు.

కాని జ్వాలకి మాత్రం గట్టిగా పిల్చినట్లుంది.

పబ్లిక్ గార్డెన్స్‌లోని చల్లగాలిని ఆస్వాదిస్తూ, పరధ్యానంగా నడుస్తున్నదల్లా, ‘ఏంటన్నట్లుగా’ చూసింది.

“జ్వాల! మీ కిప్పుడు డబ్బేదయినా అవసరమా?!” అన్నగా

అడిగాడు.

నమ్మలేనట్లుగా చూసింది. ఇదంతా దేనికి నాంది? ఎందు కింత మర్యాద చూపిస్తున్నాడు. ఏదో గట్టి ప్లానే వేసుంటాడు. జ్వాల చురుగ్గా ఆలోచించింది.

"ఎందుకూ?!" అనుమానంగా చూసింది.

"వర్మగారు, మీ కివ్వమని మీ 'సాలరీ మనీ' నాకిచ్చారు!"

"నిజంగానా? ఏదీ?!" ఆ క్షణంలో మనోజ్ కన్పించినంత మంచిగా మరెప్పుడూ కన్పించడనుకుంది. అబ్బ! ఎంత మంచివాడు. సరిగ్గా తనకి అత్యంత అవసర సమయంలో యిస్తున్నాడు.

"ఖర్చయిపోయింది!" సిగరెట్ వెలిగించుకోడానికి ప్రయత్నించు కుంటూ అన్నాడు.

జ్వాలకి వెంటనే అర్థం కాలేదు.

"మీరు పోయిన్నెల '30'న రాలేదు కదూ ఆఫీసుకి. ఆరోజే జీతాలు యిచ్చారు. మీ కివ్వమని నాకిచ్చారు. ఈ నెలది కూడా నాకే యిచ్చారు. చేతిలో డబ్బుంటే అయిపోయేదాకా నాకింకో పని చెయ్య బుద్ధికాదు. అలా క్లబ్బుకెళ్ళాను. ఇలా పేకాట ఆడాను. అలా అయిపోయింది!" నవ్వుతూ తమాషాగా చెప్పాడు.

"........."

"అయిపోయిన తర్వాతగాని మీరు గుర్తు రాలేదు. సారీ. మీ కిప్పుడు అవసరం లేదుగా! వుంటే ఎప్పుడో అడిగేవారు కదూ?!"

జ్వాల కోపంతో మండిపోయింది. ఈ మాట చెప్పడానికా యింత మర్యాద చేసాడు.

"మీ దగ్గర కాదు నేను పనిచేస్తుంది. వర్మగారి దగ్గర. వర్మ గారు రాగానే అడిగి తీసుకోగలను!" వెటకారంగా అన్నది.

మనోజ్ ఖంగారుగా చూసాడు. జ్వాల నిర్లక్ష్యంగా తల త్రిప్పుకుంది. కొద్ది నిముషాలు, ఏదో తీవ్రంగా ఆలోచిస్తూ నిల్చు న్నాడు. తర్వాతేదో స్ఫురించిన వాడిలా, సిగరెట్ క్రింద పడేసి, బూటు కాలితో నలిపి, చిన్నగా అన్నాడు:

"మీకు జీతం యిచ్చానని వర్మగారితో చెప్తే?!"

జ్వాల దెబ్బతిన్నట్లు చూసింది. ఇంత మోసం చేస్తాడని తను కల్లో కూడా అనుకోలేదు. అన్ని లక్షలుంచుకుని, తన జీతం డబ్బులు కావాల్సి వచ్చాయా? ఎందరి పొట్టలు కొట్టి యిలా సంపాదిస్తున్నారో! ఎంతకయినా తగుదురు? వాళ్ళకి డబ్బు సంపాదన తప్ప, అవతలి వాళ్ళ కష్టా లెందుకు? జ్వాల తిరస్కారంగా తల తిప్పేసింది.

"చెప్పండి! అప్పుడేం చేస్తారు మీరు?!" సవాల్ చేస్తున్నట్లుగా చూసాడు.

జ్వాలకి ఏమనిపొచ్చినంత పనయింది. తనేం చెయ్యలేదు. శర్మగారు కాబోయే అల్లుడి మాట వినక, తన మాట వింటాడనుకునే మూర్ఖురాలు కాదు. తనేం చెయ్యలేదని తెలిసే, అలా ఖర్చు పెట్టి వుంటాడు. జ్వాల నడవలేని దాన్లా అక్కడే కూలబడింది. ఇందాకెంతో ఆప్యాయంగా, ఆకలిగా తిన్న టిఫిన్ వాంతయ్యేలా వుంది. తను లేమితో వుండొచ్చుగాని, ఇలాంటి ఘోరమైన మోసం తన కెప్పుడూ ఎదురుకాలేదు. ఇలాంటి మోసగాళ్ళుంటారని తనెప్పుడూ అనుకోలేదు.

"జ్వాల!" ఖంగారుగా పిల్చాడు. నవ్వుతున్నదల్లా, ఒక్కసారిగా అలా నిస్సత్తువగా కూర్చోడంతో భయంగా పిల్చాడు.

"జ్వాల!" మరోసారి పిల్చాడు. పలక్కపోవడంతో జ్వాల భుజంమీద చేయివేసి కదిపాడు.

ఖస్సుమన్నట్లు, చేయి విదిలించి దెబ్బతిన్న త్రాచులా తలెత్తింది. జ్వాల ముఖం ఎర్రగా కందిపోయింది.

"ఛీ! నన్ను ముట్టుకోకు. నీలాంటి మోసగాళ్ళతో మాట్లాడ్డం బుద్ధితక్కువ. నేనేం చేసానని యింత మోసం చేస్తున్నావు? ఏడిపించడాని కింకెవరూ దొరకలేదా? ఖర్చు పెట్టడానికి మీ లక్షలు పనికిరాలేదా? బోడి నా ఆరువందల జీతం కావాలా?!" కోపంగా, విసురుగా అన్నది.

"జ్వాల! ఐ యామ్ వెరీ సారీ. మీరింతగా బాధపడతారనుకోలేదు!" నెమ్మదిగా అన్నాడు.

"బాధా? బాధంటే ఏంటో మీకు తెల్సా? ఈ జీతంమీద

మా యింట్లోవాళ్ళు ఆధారపడ్డారని తెల్సా? ఇంట్లోవాళ్లు ఆకలితో మాడుతుంటే చూస్తూ ఊరుకోవడం ఎంత బాధో మీకెలా తెలుస్తుంది? అలా క్లబ్బుకెళ్ళి యిలా పేకాట్లో తగలేసిన ఆ డబ్బులు, మాలాంటివాళ్ళకి రెండు నెలలు యీజీగా కుటుంబం గడుస్తుంది''
జ్వాల గాలి పీల్చుకోడానికో నిముషం ఆగింది.

మనోజ్ చిత్తరువులా కూర్చుని వింటున్నాడు. మనోజ్ ముఖంలో పశ్చాత్తాపం, బాధ కొట్టొచ్చినట్లుగా కనిపిస్తున్నాయి.

జ్వాల మళ్ళీ అందుకోబోయింది.

''ప్లీజ్! మీరింకేం చెప్పొద్దు. మీ కిప్పుడే యిస్తాను. రండి వెళ్దాం!'' మనోజ్ లేచి, బ్రతిమాలుతున్నట్లుగా అని దాటేసాడు.

అప్పటికప్పుడు తన వాచి, ఉంగరం అమ్మేసి జ్వాల చేతిలో ఏడువందలు పెట్టాడు.

''మీ రనుకున్నట్లుగా మీ జీతం మూడువందలు కాదు. మూడువందల యాభై. తీసుకోండి!''

జ్వాల సంకోచించింది.

''మీ రిప్పుడవి అమ్మకుండా, రేపిచ్చినా సర్దుకోగలను!''

''ఊహుఁ! కాదు. తీసుకోండి!''

జ్వాల మాట్లాడకుండా తీసుకుంది.

''ఓ విషయం చెప్పాలి. మీతో! ఆ రోజు, అంటే నేను జాయినయిన క్రొత్తలో, మీరు పార్టీయిస్తానని హోటల్ కి తీసుకెళ్ళారు కదూ! అప్పుడు బిల్ యిచ్చింది మీ డబ్బులే. తీసుకోండి!'' వందరూపాయల నోటు అందించింది.

మనోజ్ విచిత్రంగా, నమ్మలేనట్లుగా చూసాడు.

''నేను చెప్పింది నిజం! నా దగ్గర అప్పుడు డబ్బులు లేవని మీకు తెల్సు. మీ పాకెట్ లోవి కొట్టేసాను. 'సాకీ' చెప్పాల్సిన అవసరం లేదు. మీరలా బలవంతంగా తీసుకెళ్ళకపోతే, నేను పాకెట్ మార్ చేసేదాన్ని కాను. ఆ అవసరం నా కెప్పుడూ లేదు. అలవాటూ లేదు!'' ఎలాటి సందేహం, ముఖమాటం లేకుండా చెప్పింది.

జ్వాల ధైర్యానికి విస్తుబోయాడు. డబ్బు కొట్టేయడాని

కెంత ధైర్యం వుండాలో, కొట్టేసానని ఒప్పుకోడానికూడా అంతే ధైర్యం కావాలి మరి!

“ఇక్కడాపండి!” హఠాత్తుగా అన్నది.

సడెన్‌గా ఆపేసి, ప్రశ్నార్థకంగా చూసాడు.

జ్వాల మాట్లాడకుండా దిగి డోర్ వేసింది.

“మీ ఫ్రెండ్స్ అరుగో.” జనతా బజార్‌లోకి వెళ్తున్న వాళ్ళవైపు చూపెడ్తూ అన్నది.

మనోజ్ చూసాడు కాని, వాళ్ళదగ్గరకి వెళ్ళలేదు. సరాసరి యింటికే వెళ్ళాడు.

జ్వాల, వాళ్ళని దాటివెళ్తున్న మనోజ్ వైపు చిత్రంగా చూసి, గబగబ యింటిదోవ పట్టింది.

“జ్వాల! జీతం సంగతి అడిగావా? యిచ్చారా?” ఆదుర్దాగా, జ్వాలకోసం ఎదురు చూస్తున్న కాంతి చేతిలో పర్సు పెట్టి, మంచాని కడ్డంగా పడుకుంది.

“జ్వాల! ఏమయింది? ఎందుకలా పడుకున్నావ్?!” ఒంటి మీద చెయివేసి చూస్తూ అడిగింది.

“.........”

“చెప్పవే! ఏమైంది?!”

“ఏం లేదు” సాధ్యమయినంత మామూలుగా అనేసి కళ్ళు మూసుకుంది.

తనలా అన్నదని మనోజ్‌కి కోపం రాలేదుకదా? వస్తే తన ఉద్యోగం గోవిందార్పణం. అసలయినా యీ ఒక్క నెలే తను చేసేది. కాని, నెమ్మదిగా వర్మగారినో, పార్థసారథిగారినో అడిగి, తన పరిస్థితులు వివరించి యింకేదయినా జాబ్‌కోసం అడుగుదామనుకుంది. ఇప్పుడలా అడగడానికి వీలు కాదు. కాబోయే అల్లుడిగారి కోపానికి కారణం తనని తెలిస్తే, ఛస్తే యింకొక్క రోజు కూడా ఆ ఉద్యోగంలో ఉండనివ్వరు. పోనీ! వెధవ ఉద్యోగం! వెధవ బ్రతుకు! ఎంతసేపని ఒకళ్ళకి లొంగి వుండడం. ఓటమి అనేది ఎంత భయంకరమయిందో? లొంగివుండడంకూడా అలాటిదే! తను ఓటమిని సహించలేదు. లొంగివుండనూ లేదు. విసుగ్గా అను

కుంది. ఏదయితే అదే అవుతుంది. తను చేయగలిగిందేమీ లేదు. అయినా తను మాత్రం తప్పుగా ఏంవన్నది? వెధవ ఆలోచనల్తో తలనొప్పి బాగా వచ్చింది. అలా ఎంతసేపు పడుకునేదో గాని, శాంతి లేపడంతో బధకంగా కళ్ళు తెరిచింది.

"జ్వాల! ఎలా వుంది? డాక్టర్ గారొచ్చారు? ఇలా చూడు!"

"ఎప్పుడొచ్చావ్ నువ్వు? ఓ! మీరా!" శాంతిని, ధీరజ్ ని ఒక్కసారే పరామర్శించింది.

"ఎలా వుందండి?" ధీరజ్ అడిగాడు.

"నాకేంవైంది! ఏంవిటే శాంతి! డాక్టర్ గార్ని తీసుకొచ్చా వేం?"

"శాంతి తీసుకురాలేదు. ధీరజ్ తాతయ్యని చూడ్డానికని వచ్చారు. మీ యింటికే బైల్దేరాం. శాంతి వీధిలోనే, నీకు బాగ లేదని, పడుకున్నావని చెప్పింది!"

"ఎలా వుంది మీ జాబ్?"

"ఉంటానా, ఊడతానా అన్నట్లుంది!" నీరసంగా అన్నది.

"నీరసంగా వున్నారేంటి?"

"ఏం లేదు. మీరు డాక్టరు కదా? మీ కంటికి, ప్రతివాళ్లూ ఏదో రోగంతో బాధపడుతున్నట్లే వుంటారు" నవ్వుతూ అన్నది.

"అదేం కాదు. మీరు చెప్పండి శాంతీ. జ్వాల యివాళ నీర సంగా లేదూ?" సపోర్ట్ కోసం చూసాడు శాంతివైపు.

"నిజమే!" శాంతి, కాంతి ఒక్కసారే అన్నారు.

"సరే. ఒప్పుకుంటున్నాను. ఏం చేస్తారు? ఇంజక్షన్ చేస్తారా?"

"అబ్బే! ముందు చూడనివ్వండి. తర్వాత ఏం చెయ్యాలో చెప్తాను" జ్వాల మౌనంగా వుండిపోయింది.

కాంతి కాఫీ కలపడానికి లోపలికెళ్తే, శాంతి అసలు విషయ మేంటో తెలుసుకుందామని కాంతి వెనకే వెళ్ళింది.

జ్వాల! చెయ్యిలా యివ్వండి చూస్తాను!

జ్వాల విసుగ్గా చేతిని ముందుకు చాచింది.

"మీరు మాత్రం నా చేతిని పట్టుకోవద్దు. అలా అయితే నేనే చూస్తాను" నవ్వుతూ షరతు పెట్టాడు.

"ఓ అమ్మాయి చేతిని పట్టుకుంటే, ఓర్చుకోలేని కూరేం డాక్టర్లా?" నవ్వుతూ ధీరజ్ చేతిని గట్టిగా పట్టుకుని నొక్కింది.

"అసలు మీకీ అలవాటెలా వచ్చిందండి?" చేతిని బలవంతంగా వదిలించుకుని, కందిపోయిన చేతిని చూసుకుంటూ అడిగాడు.

"నాకు గుర్తులేదు. చిన్నప్పటినుండీ ఈ అలవాటుంది మరి" సన్నగా, పొడుగ్గా, బలంగా వున్న తన వేళ్ళవైపు ఆప్యాయంగా చూసుకుంటూ అన్నది.

"ఆ వచ్చేవాళ్ళు ఎవరో కాని, వాళ్ళ చేతులు జాగ్రత్త చేసుకోమని సలహా యివ్వాలి!" జ్వాల నవ్వుతూ చూసింది.

"నిజం చెప్పండి. ఇవాళేందుకలా వున్నారు? ఆఫీసులో ఏమైనా జరిగిందా?" ఆసక్తిగా అడిగాడు.

"........."

"జ్వాల! రేపు మీ అందర్నీ మా యింటికి తీసికెళ్తాను. వస్తారా?"

"రేపు ఆఫీసు వుంది."

"అయితే ఆదివారం వస్తారా?" ఉత్సాహంగా అడిగాడు.

"ఎందుకూ? మీ యింట్లో ఏదయినా పార్టీనా?" కుతూహలంగా అడిగింది.

"అఁ! అలాంటిదే వుంది. తప్పకుండా రావాలి! శాంతి! మీరు కూడా!" అప్పుడే వస్తున్న యిద్దరికీ చెప్పాడు.

"ఎక్కడికీ? ఎందుకూ?"

ధీరజ్ చెప్పేడు. ముగ్గురూ వస్తానన్న తర్వాతే వెళ్ళాడు.

ఎప్పుడూ ఆఫీసుకి రెగ్యులర్‌గా రాని మనోజ్ ఆ నాలుగు రోజులూ, పదికే ఠంచన్‌గా రావడం, ఐదుకి వెళ్ళడం, యీ మధ్యలో ఎవరు ఫోన్ చేసినా కదలడం లేదు. ఇలా ఎప్పుడూ జరగలేదేమో అందరూ ఆశ్చర్యపోయారు. ఆఫీసు పనిలోకూడా చాలా కరెక్ట్‌గా వుంటున్నాడు.

అయిదోరోజు...

ఆ రోజు శనివారం. మామూలుగా పదికే వచ్చాడు. జ్వాల దురదృష్టమో, అదృష్టమో గాని అర్ధగంట లేటుగా వెళ్ళింది. అప్పటికే రిజిస్టర్ మనోజ్ దగ్గరి కెళ్ళింది.

"ఎందుకింత లేటుగా వచ్చారు?!" వెళ్ళగానే అడిగాడు.

"........."

"మర్చిపోయ్యాను చెప్పడం. రేపటినుండి, అంటే సోమవారం నుండి మా స్టెనో వస్తారు."

జ్వాల చప్పున తలెత్తి చూసింది. మనోజ్ ముఖం మామూలుగానే వుంది.

"సాయంకాలం వెళ్ళేముందు రండి. జీతం ఎంత రావాలో యిస్తాను."

జ్వాల ముఖంలో నిరాశ స్పష్టంగా కన్పించింది.

"వెళ్ళండి. ఎంత సేపలా నిల్చుంటారు!" ఎంతకీ జ్వాలలో చలనం లేకపోవడంతో అన్నాడు.

జ్వాల మౌనంగా వెళ్ళింది. ఆ రోజంతా అన్యమనస్కంగానే గడిపింది. దాదాపు అయిదు కావస్తుండగా ప్యూన్ వచ్చి చెప్పాడు, 'అయ్యగారు పిలుస్తున్నారని'.

"ఇదుగో తీసుకోండి" ఇరవై రోజులకి వచ్చే జీతం లెక్క చూసి యిచ్చాడు.

"జ్వాల! రేపు మా యింటికి రండి. ఫేర్‌వెల్ పార్టీ యిస్తాను!"

"........."

"మా ఇంటికొస్తే మీకో 'మంచివార్త' చెబుతాను!" నవ్వుతూ అన్నాడు.

"........."

"వస్తారా? పనుందంటారా?"

"సారీ. పనుంది!" ముభావంగా చెప్పింది.

"మీ యిష్టం. 'మంచివార్త' వినాలంటే రండి."

"గుడీవినింగ్. గుడ్ బై" పొడిపొడిగా చెప్పి బైటికొచ్చింది.

ఏంటీయనగారు చెప్పే గుడ్ న్యూస్. ఏదోవిధంగా,

ఇంటికి రప్పించుమని, ఎప్పటికీ మర్చిపోలేనంత గాఢం — అవమానించడం తప్ప యింకేముంటుంది? ఎలాగా వాళ్ళ ఆశీస్సులనుండి వెళ్ళుందిగా, యింక ఛాన్సు రాదేమోనని యింకో ఎత్తు! వాళ్ళ సంగతెవరికి తెలీదు?

* * *

"జ్వాల! ఏంటింకా తయారవలేదూ? యివేళ ఆ వారమని గుర్తుందా?!" వస్తూనే అడిగాడు ధీరజ్.

"రావాలంటావా?!" బద్ధకంగా లేస్తూ అడిగింది.

"అనేగా నేను చెప్పింది."

"ఎందుకో రావాలని లేదు. మీ యింటికని కాదు. అసలెక్కడికీ వెళ్ళాలని లేదు!" విసుగ్గా అన్నది.

"మా యింటిని చూస్తే, నీ బద్ధకం, విసుగు, దిగులు ఎక్కడి వక్కడ పారిపోతాయి. తెల్సా?!"

"మీ ఇల్లంత బావుంటుందా?"

"నేను చెప్తే ఏం బావుంటుంది. వచ్చి చూస్తే నీకే తెలుస్తుంది."

"సరే వస్తానుగాని, ఏం వాహనం తెచ్చావ్?"

"వాహనమా? అబ్బే. రెండు కాళ్ళమీదే. లేకపోతే గవర్నమెంటువారి పుణ్యమా అని నాలుగు చక్రాల బస్సు మీద!"

"అంతేనా? ఏ కారో తెచ్చావనుకున్నాను!" నవ్వుతూ అన్నది.

"తెచ్చేవాడినే కాని, నీ కిష్టమవునో, కాదోనని!" తనూ నవ్వుతూ అన్నాడు.

"నిజంగా నడిచే ఓపిక లేదు!"

"ఇంకా తయారవలేదూ? నన్ను తొమ్మిదికే రమ్మన్నారు. నువ్వేమో తీరిగ్గా హస్కు కొడుతున్నావ్!" శాంతి వస్తూనే అన్నది.

"తల్లీ! ఇంకేమనకు! ఒక్క పదినిముషాల్లో తయారై వస్తాను." అప్పటివరకు తను కూర్చున్న మంచం ఎత్తేస్తూ అన్నది.

ధీరజ్ కా మంచాన్నెప్పుడు చూసినా భలే నవ్వొస్తుంది. అవడానికి నవారుమంచమే గాని. పడుకుంటే క్రిందే వుంటుంది. ఆ మంచంలో జ్వాల ఎలా పడుకుంటుందో అర్థం కాదు. తనెప్పుడూ దానిమీద యెవరూ కూర్చోగా చూళ్ళేదు. బహుశ జ్వాలకి స్పెషలేమో!

"ఏంటి నవ్వుతున్నావ్?"

"మంచం!" ఇంకా నవ్వుతూ అన్నాడు.

"ఆ మంచంలో పడుకుంటే ఎంత మంచి వూహాలొస్తాయో తెలిస్తే అలా నవ్వవు. ఎంత నిద్ర రాకపోయినా సరే దాన్లో పడుకోగానే ఇట్టే నిద్రొస్తుంది!"

"ఇంకా నయం! నడుం నొప్పులొస్తాయన్లేదు!"

"ఏం రావు!" మంచం వైపు అభిమానంగా చూస్తూ అన్నది.

మరో పావుగంటలో సంగరూర్ బస్టాపులో వున్నారు. మూడు బస్సులు మార్చి దాదాపు గంటన్నర ప్రయాణం చేసారు.

"ఇంకా యెక్కడ బాబూ! మీ యిల్లు!" విసుగ్గా అడిగింది జ్వాల.

కనుచూపు మేరలో ఎక్కడా ఇళ్లేమీ లేవు. అక్కడొకటి, ఇక్కడొకటి విసిరేసినట్టుగా పాకలు మాత్రం కన్పిస్తున్నాయి.

"వస్తుంది!"

"మీ డాడీకి ముద్దుల కొడుకువా ఏం?" పరిసరాల్ని పరీక్షగా చూస్తూ అడిగింది జ్వాల.

"ఎందుకు?"

"షూరవతేల ఒంటి స్తంభం మేడలాగ నీకోసం ప్రత్యేకంగా కట్టించారేమోనని!" నవ్వుతూ అన్నది.

"ఒంటి స్తంభం మాటేమోగాని నేను మాత్రం మా డాడీకి ముద్దుల కొడుకునే!" తనూ నవ్వుతూ అన్నాడు.

"జ్వాల! ఇదిగో ఇదే మా ఇల్లు!"

"నిజంగానా?!" అందంగా అధునాతనంగా వున్న ఖరీదయిన బంగళా వైపు వేలెట్టి చూపుతున్న ధీరజ్‌ని అడిగింది.

"నిజమే!" నవ్వుతూ లోపలికి దారి తీసాడు.

"బాప్ రే! ఇంత పెద్ద బంగళానే!" లోపల కనుకునేదే శాంతి పెద్దగా అనేసింది.

శాంతిలా పెద్దగా అనకపోయినా అందరూ ఆశ్చర్య పోయారు. అంత పెద్ద బంగళాలో ధీరజ్ ఒక్కడే ఉంటున్నం దుకు. ఇల్లంతా చాలా అందంగా వుంది. ఫర్నిచరే దాదాపు లక్ష విలువ చేసేట్లుంది. ఇంటి చుట్టూ పూలతోట. తోట మధ్యమధ్యలో సిమెంటు బెంచీలు. తోట మధ్యలో స్విమ్మింగ్ పూల్. మధ్యలో అందమైన ఏనుగు బొమ్మలు రెండు. చూడగానే అందరిని ఆకర్షించింది.

"నా రూమ్ పైనుంది. చూద్దురుగాని రండి." పైకి దారి తీస్తూ అన్నాడు.

"ఇదంతా మీ ఇల్లేకదా? ఇంకా వేరుగా మీ రూం ఏమిటి?" ప్రతాప్ అడిగాడు.

"నా ఇల్లేననుకోండి. కాని నేను ఎక్కువగా వుండేది ఆ రూమ్ లోనే. క్రిందంతా ఎక్కువ తాళం వేసే వుంచుతాను." వ్రేలికి వున్న తాళం చేతుల గుత్తిని గిర్రున త్రిప్పుతూ అన్నాడు.

క్రిందనున్న దానికంటే ఆశ్చర్యంగా చూశారు పైనున్న రూమ్ని. ఎంటర్ అవగానే సెంటు పరిమళం, ఎయిర్ కూలర్ చల్ల గాలితో పాటు వెదజల్లుతుంది. మధ్యలో బంగారు జలతారు తివాచి. దానిమీద నాలుగు సోఫాలు, మధ్యలో ఖరీదైన టీపాయ్ వున్నాయి. గోడలు, కర్టెన్లు అంతా నీలం రంగే. ఒక ప్రక్కగా డబుల్ కాట్, దానిమీద బెడ్ సీట్సుని అందరూ ఆశ్చర్యంగా అలానే చూస్తుండిపోయారు. ఏదో కొంచెం డబ్బుగలవాడను కున్నారు గాని, మరీ ఇంతని మాత్రం వాళ్ళలో ఎవరూ అనుకో లేదు. జ్వాల, ప్రతాప్ లోపలెంత ఆశ్చర్యపోయినా పైకి మాత్రం మామూలుగానే వున్నారు. కాని శాంతి పొందిన ఆశ్చర్యమంతా కళ్ళల్లో ప్రతిఫలిస్తున్నట్లుగా వుంది. శాంతినే గమనిస్తున్న ధీరజ్ "ఏమిటీ? అలానే నిల్చున్నారు. కూర్చోండి." నవ్వుతూ పలక రించాడు.

ఆసలే చలికాలం. అందులో ఇంకా ఎయిర్ కూలర్. శాంతి

సోఫాలో ఒక మూలగా ముడుచుకు కూర్చుంది.

"చలేస్తుందా?" ధీరజ్ శాంతిని అడిగాడు.

"అబ్బే! అదేం లేదు" తడబాటుగా అని సరిగ్గా కూర్చుంది.

ధీరజ్ బెడ్ మీద కూర్చుంటూ దాని క్రిందనే ఎటాచ్ చేసిన బటన్ నొక్కాడు. ఫాన్ గాలి రివ్వున గదంతా వ్యాపించింది.

"అరే! స్విచ్ ఎప్పుడు ఆన్ చేసారు." ప్రతాప్ ఆశ్చర్యంగా అడిగాడు.

అంతకు ముందే ధీరజ్‌ను గమనిస్తున్న జ్వాల బెడ్ దగ్గర కొచ్చి అడుగున ఎటాచ్ చేసిన స్విచ్‌లను చూసింది.

"మీ గొప్పోళ్ళంతా అందుకనే అంతంత లావై పోతారు. కూర్చున్న చోటునుండి కదలరు. అన్ని సౌకర్యాలు చేతికందే దూరంలోనే వుంచుకుంటారు." జ్వాల నవ్వుతూ చూసింది.

"అన్యాయం జ్వాలగారు! నేనంత లావుగా వున్నానా! మీరు చెప్పండి ప్రతాప్‌గారు నేనెంత లావున్నానో?!" నవ్వుతూ ప్రతాప్ వంక చూస్తూ అన్నాడు.

శాంతి మటుకు ఈ లోకంలో లేదు. తనకి ఇరవై రోజుల క్రితం జరిగిన సంఘటనే గుర్తొస్తుంది.

* * *

ఆ రోజు......

తాతగారి కోసం ధీరజ్ క్లినిక్‌కు వెళ్ళింది.

"నేను పట్టుకు వస్తానులెండి." ధీరజ్ చేతిలోని మెడికల్ బ్యాగ్ అందుకుంటూ అంది.

"అదేంటి? ఫర్వాలేదు. ఇక్కడేకదా?" అంటున్న ధీరజ్ చేతిలో నుండి బలవంతంగా తీసుకోబోయింది. కాని ధీరజ్ గట్టిగా పట్టుకోవడంతో వదిలేసింది. ఆ సమయంలోనే ధీరజ్ కూడా వదిలేశాడు. దాన్ని తీయడానికి ఇద్దరూ వంగారు. ఇద్దరి తలలు కొట్టుకొన్నాయి.

"సారీ!" ఇద్దరూ తలలు తడుముకుంటూ ఒకేసారన్నారు.

ధీరజ్ నవ్వుతూ చూశాడు శాంతి వైపు. చూపుల ధాటికి తట్టుకోలేని శాంతి నవ్వుని పెదాలతో బిగపట్టి తలవంచుకుంది.

"శాంతీ! మీ యింట్లో స్వెటరేమైనా వుందా?" వొణికిగా వణుకుతున్న కంఠంతో, తాతగారని చూసి వస్తుండగా అడిగాడు.

అప్పటికి రాత్రి తొమ్మిదయింది. చలిగాలి రివ్వున వీస్తుంది. ప్రొద్దునే కొంచెం టెంపరేచరు వచ్చిందిగాని మందేం వేసుకోలేదు అదే పోతుందని. ఇప్పుడు బహుశ చలిజ్వరం వచ్చేలా వుంది. చలికి తట్టుకోలేకపోయాడు.

"ఏమైంది?" శాంతి ఆదుర్దాగా అడిగింది.

"చలిగా వుంది. బహుశా జ్వరం రావొచ్చు. త్వరగా రిక్షా పిలుస్తేనే వెళ్ళిపోతాను" వణికిపోతూ అన్నాడు.

శాంతి లోపలికి పోయి పాతకాలంనాటి రగ్గు తెచ్చి యిచ్చింది. అటుగా పోతున్న రిక్షాని పిల్చింది.

"ధీరజ్ గారూ! నేనుకూడా రానా?"

ధీరజ్ ఏమీ మాట్లాడలేదు. శాంతి ఒకచేయి పట్టుకుంటే అతి కష్టంమీద రిక్షా ఎక్కాడు.

"మీరుకూడా రండమ్మా! బాబుగారికి బాగా జ్వరం ఉన్నట్టుంది" రిక్షావాడనడంతో శాంతి లోపలికి వెళ్ళి యిప్పుడే వస్తానని చెప్పి పటపటాయిస్తూనే ఆ రిక్షాలోనే ఎక్కింది.

రిక్షావాడు, తనూ యిద్దరూ కలిసి ధీరజ్‌ని అక్కడే వున్న బల్లపై పడుకోబెట్టి దుప్పటి కప్పారు.

"నేను జ్వాల యింట్లో వున్నాను. వస్తే రాత్రికి వస్తాను. లేకపోతే ప్రొద్దునే వస్తాను శాంతి."

ఓ చీటీమీద వ్రాసి రిక్షా అబ్బాయికిచ్చి యింట్లో యిమ్మని చెప్పింది. దాంతోపాటే ధీరజ్ జేబులోనుండి రెండురూపాయల నోటుకూడా అందించింది.

రిక్షావాడెళ్ళాక ధీరజ్ వైపు తిరిగింది. ఇంకా వణుకుతూనే వున్నాడు. ఆ గది తలుపులన్నీ అంతకుముందే వేసి వుండడంవలన వెచ్చగానే వుంది. ఐనా శరీరంలో పుట్టుకొచ్చే చలికి ఆపుకోలేకపోతున్నాడు.

"ధీరజ్ గారూ... ధీరజ్ గారూ!" చేత్తో తడుతూ పిల్చింది.

కొంచెం కళ్ళు తెరిచి శాంతివైపు చూశాడు.

"మందు పేరు చెప్పండి. చూసిస్తాను."

నీరసంతో ఏదో చిన్నగా చెప్పి మళ్ళీ కళ్ళు మూసుకుని పడుకున్నాడు.

"నాకేం అర్థం కాలేదు. కొంచెం పెద్దగా చెప్పండి" శాంతి మళ్ళీ దగ్గిరగా అడిగింది.

ఈసారి ఒకో పలుకు కూడదీసుకుని చెప్పాడు అర్థమయ్యేలా. షెల్ఫ్‌లోవున్న కాప్స్యూల్ తీసి దాన్ని ధీరజ్ నోట్లో వేసి మంచి నీళ్ళు త్రాగించింది. దాదాపు గంటన్నర వరకూ అలా వణుకుతూనే వున్నాడు. తర్వాత మెత్తగా కదలకుండా పడుకున్నాడు. బహుశా చలి పోయివుండవచ్చు. ఒంటిమీద చేయివేసి చూసింది. చాలా హై టెంపరేచరున్నట్లుంది. ఉడుకులాం వేస్తూ అలానే చాలా సేపు కూర్చుంది. తర్వాత తనుకూడా ప్రక్కనేవున్న కుర్చీలో కూర్చుని నిద్రపోయింది.

దాదాపు తెలవారుతుండగా ధీరజ్‌కు మెలుకువ వచ్చింది. తనమీద కప్పుకున్న రగ్గునూ, ప్రక్కనే కుర్చీలో కూర్చునే నిద్రపోతున్న శాంతిని కొంతసేపు ఆశ్చర్యంగా చూశాడు. తర్వాత రాత్రి జరిగిన సంఘటన లొక్కొక్కటే గుర్తుకొచ్చి నవ్వుకున్నాడు.

కొంచెం చలిగా వున్నప్పుడే వద్దామనుకున్నాడు. కాని శాంతివాళ్ళ తాతగారు కదలనివ్వలేదు ఆ సంగతి ఈ సంగతీ చెప్తూ. ఆఖరికి చలికింక ఓర్చుకోలేక లేచాడు.

"ముందు కాఫీ తీసుకురా. తర్వాత ఊడుద్దువుగాని" అప్పుడే వచ్చిన పనబ్బాయికి ఫ్లాస్కు యిస్తూ చెప్పాడు.

స్నానం చేసి, తల దువ్వుకుని శాంతిని లేపాడు.

కళ్ళు నులుముకుంటూ లేచిన శాంతిని నవ్వుతూ 'విష్' చేశాడు.

"చాలా థాంక్స్ శాంతీ! పాపం రాత్రంతా నాకోసం మేలుకున్నావు."

"ఫర్వాలేదు! నే నింక వెళ్తాను" కుర్చీలోనుండి లేస్తూ అంది.

"కాఫీ తీసుకువెళ్ళరు గాని, ముఖం కడుక్కొని రండి" బాత్ రూమ్ చూపిస్తూ అన్నాడు.

"రాత్రి నాకు చాలా భయమేసింది [illegible] పంపకు [illegible] వచ్చే సరికి" కాఫీ సిప్ చేస్తూ నవ్వుతూ అంది.

నవ్వుతూన్న శాంతివైపు క్షణంసేపలానే చూశాడు. శకీమని తల దించుకుంది. జ్వాలలా ఎక్కువగా మాట్లాడదు. [illegible] నిదానంగా, వినీ విన్పించనంతగా మాట్లాడుతుంది. ఎక్కువగా తల దించుకునే మాట్లాడుతుంది, ఎదుటి మనుషులను చూడకుండా.

"రాత్రి మీరుకూడా నాతోపాటే వచ్చారా!" కావాలనే అడిగాడు.

"ఆఁ!"

"ఏమిటీ? నేనున్న రిక్షాలోనే ఎక్కారా?" నవ్వు పెదాల చాటున బిగపట్టి ఆశ్చర్యంగా అడిగాడు.

నవ్వుతూన్న ధీరజ్ ని చిరుకోపంగా చూసి వెళ్ళబోయింది.

"శాంతీ."

"ఏంవిటి" వెనక్కి తిరక్కుండానే అడిగింది.

"నీతో ఒక ముఖ్యవిషయం మాట్లాడాలి. కొం[illegible] సేపలా కూర్చుంటావా?"

"ఏమిటా విషయం?" కుర్చీలో కూర్చుంటూ అడిగిం[illegible].

"నీవు చాలా బాగుంటావు" మాట మారుస్తూ అన్నా[illegible].

"ఏదో ముఖ్యవిషయం చెప్తానన్నారు!" ఎటో గాస్తూ గుర్తుచేసింది.

"నామీద నీ అభిప్రాయం ఏమిటి?" హఠాత్తుగా అ[illegible]గాడు.

"మీరా! చాలా మంచివాళ్ళు. మాలాంటి [illegible] మరీ మంచిగా కన్పిస్తారు. బహుశా తక్కువ ఫీజు తీసుకోవడమే [illegible] కారణం అయివుండవచ్చు."

"నీమీద నా అభిప్రాయం చెప్పనా?"

"నే నడగలేదుగా!"

"అయినా చెప్తాను. నీలా నెమ్మదిగా వుండేవాళ్ళంటే నాకు చాలా యిష్టం. బహుశా యిష్టం ప్రేమగా మారివుండవచ్చు"



[illegible]య

కొంటెగా అన్నాడు.

"అంటే!" అర్థం కానట్లు చూచింది.

"నీ కిష్టమైతే నిన్ను పెళ్ళి చేసుకోవాలను కుంటున్నాను. చెప్పు! ఇష్టమే కదూ!" కళ్ళు చికిలించి అడిగాడు.

శాంతి తలొంచుకుని కాలి బొటన వ్రేలితో నేలని రాస్తూ వుండిపోయింది.

"చెప్పు శాంతీ! యిష్టమే కదూ!" దగ్గరకొచ్చి శాంతి ముఖాన్ని మూపుడు వ్రేలితో ఎత్తి అడిగాడు.

ఇష్టమే నన్నట్లుగా తలూపింది.

"అలా కాదు! నా కళ్ళల్లోకి చూస్తూ, "నీవంటే నా కిష్టమే! పెళ్ళిచేసుకుంటాను అని చెప్పాలి" ధీరజ్ చెవిలో గొణిగాడు.

"నిన్ను పెళ్ళిచేసుకోవడం నా కిష్టమే!" ధీరజ్ రెండు భుజాలమీద చేతులువేసి కళ్ళల్లో కళ్ళుపెట్టి గబుసుగా అని గబగబా పెటికి నడిచింది.

ధీరజ్ నవ్వుతూ చూసాడు, వెళ్తున్న శాంతిని.

తర్వాత చాలాసార్లు జ్వాల వాళ్ళింటికని ఇంట్లో చెప్పి, నాలుగైదుసార్లు పిక్చర్లకి, బీచ్ కి, హోటల్స్ కి తిరిగారు. తన సంగతి జ్వాలతో చెస్తామనుకుంది గాని జ్వాలకి ఎక్కువసేపు తీరిక వుండడం లేదు.

ఒకరోజు సాయంత్రం...

ఆ సిటీలోని పెద్ద హోటల్ కి తీసుకు వెళ్ళాడు, చాలా బాగుం టుందంటూ. అప్పుడే చిన్న, చిన్నగా మొదలైన వర్షం పెద్ద తుపా నుగా మారింది. రాత్రి దాదాపు పది గంటలవరకూ చూసారు తగ్గి పోతుందని. అంతకంతకూ వుధృతమైంది గాని ఒక్కరవ్వ కూడ తగ్గ లేదు.

"ధీరజ్! ఇంటికి వెళ్ళకపోతే ఎలా?" శాంతి దిగులుగా అడిగింది.

"జ్వాల వాళ్ళింటికి ఫోన్ చేద్దాము. వాళ్ళ ఇళ్ళదగ్గరెవరికైనా ఫోనుందా?"

"ఏమో నాకు తెలియదు. ఒక వేళ వున్నా నెంబరు తెలియదు"

తల ప్రక్కకు త్రిప్పుకుంది.

"పోనీ! నీవే చెప్పు ఎలా వెళ్ళాలో! రిక్షాకాదు కదా! కనీసం ఆటోలు కూడా లేవు. ఇంత పెద్ద వర్షం వస్తుందని తెలిస్తే యింత దూరం తీసుకు వచ్చేవాడ్ని కాదు" చిన్నగా అన్నాడు.

"రూమ్ బుక్ చేయమంటారా!", కౌంటర్లో వున్న వ్యక్తి అడిగాడు.

"కొంచెం సేపు చూసి..." అనబోతున్న ధీరజ్‌ని మధ్యలోనే ఆపి "ఈ రోజు తుఫానట. ఇంకా రెండు రోజులవరకూ తీవ్రమైన గాలులతో ఇలానే పడుతుందని ఇందాక రేడియోలో చెప్పారు" కౌంటర్‌లోని వ్యక్తి చెప్పాడు.

"శాంతీ! ఏమంటావు? రూమ్ బుక్ చేయించనా?"

"నీ ఇష్టం."

ధీరజ్ తన పేరుమీద సింగిల్ రూమ్ బుక్ చేయించాడు. ఈ మధ్యలో కట్టిన హోటలవడం మూలాన చాలా అందంగా మరెంతో 'నీట్'గా వుంది. 'రూమ్' చుట్టూ 'గ్లాస్ డోర్ విండోస్' వాటికి కర్టెన్స్, మధ్యలో 'డబల్ కాట్' వుంది.

"శాంతి! నీవు పడుకో! నేను ఛెయిర్‌లో కూర్చుని కాసేపలా చదువుకుంటాను" బెడ్ మీది దుప్పటిని సరిచేస్తూ అన్నాడు.

తలుపులన్నీ వేసి, కర్టెన్స్ లాగి లైట్ ఆర్పేశాడు. టేబుల్ లైటు దగ్గరగా ఛెయిర్ లాక్కుని కూర్చున్నాడు.

శాంతి ఏదో ఆలోచిస్తూనే నిద్రపోయింది. అర్ధరాత్రి మెలుకువ వచ్చింది. ప్రక్కనే ధీరజ్ పడుకున్నాడు. ధీరజ్ గుండెలమీద తన తల. తన చుట్టూ ధీరజ్ చేతులు పెనవేసుకున్నయ్. పడుకునే మెల్లిగా ధీరజ్ చేతుల్ని తొలగించబోయింది.

"శాంతీ!" తన చుట్టూవున్న చేతుల్ని ఏమాత్రం తియ్యకుండా ఇంకా దగ్గరగా తీసుకుంటూ మత్తుగా పిల్చాడు.

"ఊఁ" ధీరజ్ కౌగిలిలో గువ్వలా ఒదిగిపోతూ అంతకంటే మత్తుగా పలికింది.

* * *

మరుసటి రోజు మధ్యాహ్నం వర్షం తెరిపిచ్చింది. స్నానం, భోజనాలు ముగించి ఇద్దరూ ఇంటికి బయల్దేరారు.

ఫిరజ్ ఎంత మాట్లాడించినా ఆ, ఊఁలు తప్ప శాంతి ఏమీ మాట్లాడలేదు.

“ఏమిటీ, చెప్పవేం? మీ ఇంటికి వచ్చి మీ అమ్మగారితో మాట్లాడనా?”

“అహ! ఇప్పుడొద్దు!” కంగారుగా అంది.

ఇంటికి వెళ్ళగానే ముందర తనే చెప్పింది “జ్వాల వాళ్ళ ఇంట్లో వున్నప్పుడే పెద్ద వర్షం అయింది. అందుకని వాళ్ళ ఇంట్లోనే వుండిపోయానని. అప్పుడప్పుడూ శాంతి అలా వాళ్ళింట్లో వుంటుంది. అందుకని శాంతి వాళ్ళమ్మ త్వరగానే నమ్మేసింది.

* * *

“శాంతీ! శాంతీ!” అప్పటికే నాలుగైదుసార్లు పిల్చిన ఫిరజ్ యింకా గట్టిగా పిల్చాడు.

శాంతి ఒక్కసారిగా ఉలిక్కిపడి చుట్టూ చూసింది. జ్వాల, ప్రతాప్, ఫిరజ్ ఒకళ్ళని చూసి ఒకళ్ళు నవ్వుకున్నారు.

“ఏమిటి శాంతి! మెత్తని సోఫాలో కూర్చుని మస్తుగా కలలు కంటున్నావు.” ప్రతాప్ హాస్యంగా అడిగాడు.

ప్రతాప్ మాటలకి శాంతితో సహా అందరూ నవ్వుకున్నారు.

“నే నిప్పుడే క్రిందకు వెళ్ళొస్తాను” ఫిరజ్.

ఫిరజ్ వచ్చే లోపలే జ్వాల, ప్రతాప్‌లు గదిలో ఫర్నిచర్ అంతా అణువణువు పరీక్ష చేసారు.

“ఈ కార్పెట్ దాదాపు పదివేలు చేస్తుంది.” ప్రతాప్ వంగి చేత్తో దాని నాణ్యతను పరిశీలిస్తూ అన్నాడు.

“ఆ పదివేలే మనకుంటే బిజినెస్ చేయొచ్చు చక్కగా” జ్వాల నిస్పృహగా అంది.

“పది వేలే!” శాంతి ఆశ్చర్యంతో గుండెల మీద చేయి వేసుకుంది. ఒక్కొక్కటి చూస్తున్న కొద్దీ శాంతికి ఆశ్చర్యంతో పాటు,

భయం కూడా తోడైంది. బహుశా కోటీశ్వరులై వుంటారు. అలాంటి ఫీరజ్ ఏమీ లేని తన్ను పెళ్ళి చేసుకుంటాడంటే నమ్మ బుద్ధి వేయలేదు. తను పిచ్చిగా నమ్మి అతనికి సర్వస్వం అర్పించింది. ఫీరజ్ మోసం చేయడుగదా? తనలో రేగుతున్న లక్ష అనుమానాలను బలవంతంగా జోకొట్టింది. అప్పుడే లోనికి వస్తున్న ఫీరజ్‌ని క్రొత్తవాడిని చూస్తున్నట్లుగా అలానే చూస్తుండిపోయింది. ఫీరజ్ వెనకనే వచ్చిన పనిమనిషి రకరకాల స్వీట్సు, పళ్లు వాళ్ళ ముందర పెట్టి వెళ్ళిపోయాడు.

"తీసుకోండి" ఒక ప్లేటులో పెట్టి అందరి ముందూ పెడ్తూ అన్నాడు.

"తినవేం" అన్నట్లుగా కళ్ళతోనే ప్రశ్నించాడు తన వైపే చూస్తున్న శాంతిని.

"ఫీరజ్ గారూ! ఇంత పెద్ద బంగళాకు ఒక్కళ్లే ఎక్కువైంది. ఒక కారుంటే బాగుండేది" ప్రతాప్ అన్నాడు.

"నాన్నగారు పంపిస్తానన్నారు. నేనే వద్దన్నాను. కార్లో తిరగాలంటే నాకు యిష్టం వుండదు" నవ్వుతూ చెప్పాడు.

"ఇంక వెళ్తామండి! అప్పుడే పన్నెండయింది." గడియారం వైపు చూసి లేస్తూ అన్నాడు.

"మీ ఆతిధ్యానికి చాలా థ్యాంక్సండీ. వెళ్ళొస్తాను." జ్వాల ప్రతాప్ చెప్పారు.

"శాంతీ! పదిరోజుల్లో బొంబే వెళ్తున్నాను. అమ్మవాళ్ళతో మన సంగతి చెప్పి ఒకేసారి ముహూర్తం పెట్టించుకొస్తాను." ముందరగా వెళ్తున్న జ్వాల, ప్రతాప్‌లకు వినిపించకుండా చెప్పాడు.

తర్వాత రోడ్డుమీదవరకూ వాళ్ళని దిగబెట్టి యింట్లోకి దారి తీశాడు ఫీరజ్.

* * *

బస్‌స్టాపు దగ్గర కొచ్చిన ముగ్గురూ బస్సుకోసం చాలాసేపు 'వెయిట్' చేశారు. అరగంటకో బస్సుందిగాని, ఒక్కటీ ఖాళీగా

లేదు. గంటసేపు వెయిట్ చేసినా ఒక్కదాన్లోనూ ఎక్కించుకో లేదు.

"ఈసారి ఏదయినా ఖాళీ కారు వెళ్తుంటే ఆపేద్దాం. ఎంత సేపని వుంటాం?" ప్రతాప్ విసుగ్గా అటూ యిటూ చూస్తూ అన్నాడు.

ప్రతాప్ అన్నాడే కాని, రెండు, మూడు ఖాళీ కార్లు వెళుతున్నా ఒక్కదాన్నీ ఆపలేకపోయాడు. ఈసారి ప్రతాప్ రోడ్డు కడ్డంగా నిల్చున్నాడు. అప్పటికే ఒంటిగంట దాటింది.

"అదుగో! ఏదో కారు వస్తూంది! ఖాళీగానే వుంది" ప్రతాప్ అన్నాడు. ఆపమనగానే ఆపేశాడు.

"జ్వాల! త్వరగా రండి!"

"సార్! ప్లీజ్ సిటీదాకా లిఫ్టిస్తారా?"

"రండి" డ్రైవరు ప్రక్కనున్నతను ముందుకు వంగి చెప్పాడు.

"ఓ! మీరా?" ప్రతాప్ దగ్గరికొచ్చి యెక్కబోతూ అన్నాడు.

"జ్వాల! మీ ఆఫీసర్ గారే!" సంతోషంగా కేక పెట్టాడు.

అప్పటికే వాళ్ళు కారు దగ్గర కొచ్చారు.

ప్రతాప్ మనోజ్ ప్రక్కనే కూర్చుని, తాము ఎంతసేపుగా అక్కడ నిలబడ్డదీ, ఎంత విసుగేసిందీ, ఎన్ని కార్ల నాపిందీ వివరంగా చెప్పి బోరు కొట్టిస్తున్నాడు. వాళ్ళ ఫ్రెండ్ బంగళాలో వున్న సంతోషమంతా, ఈ వెయిట్ చెయ్యడంలో ఎలాపోయిందీ, ఆపకుండా చెప్తూనే వున్నాడు. కొద్దిసేపట్లోనే మనోజ్ కి ప్రతాప్ బాగా నచ్చాడు. మధ్య, మధ్యలో జోక్స్ వేస్తూ అందరినీ నవ్విస్తూ, ఎవరినీ మాట్లాడే శ్రమ పెట్టకుండా తనే వాగేశాడు.

"మీరు చాలా బాగా మాట్లాడ్తారే!" నవ్వుతూ అన్నాడు మనోజ్.

"హమ్మయ్య! ఇందాకటి నుండి మిమ్మల్ని బోర్ కొట్టిస్తున్నానని, మా జ్వాల నా మెడంతా గీరేస్తుంది!" మెడ తడుముకుంటూ అన్నాడు. నాలుగైదు సార్లు, నీ వాగుడాపు అంటూ మెడమీద గీరి

సైగ చేసింది. అబ్బే! ఆపుతాడా? వినేవాళ్ళుండాలిగాని, ఫుల్ స్టాపులు, కామాలు లేకుండా మాట్లాడేస్తాడు."

"కొందరంతేనండి! వాళ్ళు మాట్లాడరు! అదేదో రిక్వెస్ట్ గా వుండడం ఫ్యాషనైనట్లు! ఇవతలి వాళ్ళనీ మాట్లాడనివ్వరు!" మనోజ్ సూటిగా రోడ్డువైపు చూస్తూ, జనాంతికంగా అన్నట్లు అన్నాడు.

"అబ్బ వాళ్ళు మాట్లాడకుండా అలా మూతి బిగించుకుని ఎలా వుంటారోనండి! నేనయితే క్షణంసేపు మాట్లాడకుండా వుండలేను! ఈ మధ్య యెవరో సైంటిస్టు చెప్పారండి! హాయిగా మాట్లాడ్డం, గొంతెత్తి తనకొచ్చిన పాటలు, లేదా కూనిరాగాలైనా సరే ఫ్రీగా పాడేయడం ఒంటి కారోగ్యమట! అందుకే కాబోలు! మన పల్లీయులు పని చేస్తూ, కూనలమ్మ పదాలో, జానపదాలో పాడు కుంటూ వుంటారు!"

"చాలా థ్యేక్సండీ! సార్! రండి యింట్లోకి!" మర్యాదగా ఆహ్వానించాడు ప్రతాప్.

"ముందు! నోరు మూసుకుని లోపలికి రా. థ్యాంక్స్ చెప్పావుగా చాల్లే!" జ్వాల చిన్నగా మనోజ్ కి వినిపించకుండా కసిరింది. ఇప్పటికే అందరూ దిగారు.

"వద్దులెండి. మీ జ్వాలగారి కిష్టంలేదులా వుంది!" కారుని బ్యాక్ చేసుకుంటూ అన్నాడు.

మరోసారి అందరూ థ్యాంక్స్ చెప్పారు.

"ఎందుకే? వద్దంటావు? పాపం! ఇంత దూరం తీస్కొస్తే?" ప్రతాప్ ఇంట్లోకి వస్తూ అన్నాడు.

"లేకపోతే రమ్మందామా? ఇంత ఆలస్యమైనందుకు, మనం వెళ్ళగానే బామ్మ తిడ్తుంటే అతను వినాలా?" విసుగ్గా అని లోపలి కెళ్ళింది.

"ఏంటిటిరా? ఇంత ఆలస్యంగా వచ్చారేం? ముగ్గురూ కలిసి, ముసలిముండ నింట్లో పెట్టి ఎంత సేపా షికార్లు?"

"కాదు బామ్మా! బస్సు దొరకలేదు. మేమెప్పుడో బయలు దేరాం!" ప్రక్కనే కూర్చుని చెప్పాడు.

పది నిముషాలు కూర్చుని బామ్మని ప్రసన్నం చేసుకుని ఇంటి కెళ్ళాను.

* * *

మరుసటి రోజు పబ్లిక్ హాలిడే. నీరజ్ శాంతి వాళ్ళ ఇంటి కొచ్చాడు.

“శాంతీ! కాసేపలా వెళ్ళొద్దామా!”

ఎంబ్రాయిడరీ చేస్తున్న చీరని ప్రక్కన పెట్టి లేచింది.

“శాంతీ! ఇంట్లో ఏమీ పని చేయవా? నేనెప్పుడు చూసినా ఏదో కుడుతూనో, అల్లుకుంటూనో కనిపిస్తావు.” పబ్లిక్ గార్డెన్స్ వైపు దారి తీస్తూ అన్నాడు.

“మేము ముగ్గురమేనుగా! ఏదో కొంచెం పని వుంటుంది. అదైనా అమ్మ చేసుకుంటుంది. నన్నేం చేయనివ్వరు.”

“మీ యింట్లో మీ నాన్న లేరు కదా! ఎలా గడుస్తుంది మరి. తాతగారు కూడా ఏమీ సంపాదించడ్లేదే.”

“నాన్న లక్షలతో వ్యాపారం చేసేటప్పుడు ఏ లోటూ లేకుండా, అవసరానికంటే అధికంగానే ఇంట్లో అందరికీ ఇచ్చేవారు. అందుకే తాతయ్యా కన్నీ ఖరీదయిన అలవాట్లే. డాక్టర్ కూడా ఫారిన్ రిటర్న్డ్ అయితేగాని చూపించుకోడానికి ఇష్టపడడు. ఒక్కసారిగా కంపెనీలో నష్టాలు రావటమే కాకుండా, అప్పులు కూడా మిగిలినయ్. తర్వాత నాన్న ఆ దిగులుతోనే రెండు మూడు నెళ్ళలో చనిపోయారు. పరిస్థితి తారుమారయినా, తాతయ్యకు మాత్రం అన్నీ ఎప్పటిలాగే జరగాలంటాడు. ఈ ముసలాళ్ళతో ఇదో పెద్ద బాధ! ఓ విధంగా అదృష్టవంతులమే. నాకు ముందుగాని, వెనగ్గాని అమ్మకి పిల్లలు లేకపోవడం! వున్నదాంతోనే అమ్మ యిప్పటివరకు గడుపుకొస్తుంది. ఇంకో ఏడెనిమిది నెలల వరకూ, ఫరవాలేదను కుంటాను. అదీ కాకుండా అమ్మ ఏ విషయాలు నాకు చెప్పదు. అనవసరంగా నన్ను బాధ పెట్టడ మెందుకని!” చాలా మామూలుగా చెప్పింది.

“మీ విషయం చెప్పండి.”

"మా నాన్న కోటీశ్వరుడని అందరూ చెప్పుకుంటుంటారు. నాలుగో, ఐదో పెద్ద హోటల్స్, రెండో మూడో సినిమా హాల్స్, ఫ్యాక్టరీస్ యింకా ఏమేమి వున్నయో నాకు తెలియదు. నాన్నకి డబ్బుతో బాటుగా ఖరీదయిన అలవాట్లుకూడా వున్నాయని అంటుంటారు. నేను పన్నెండో ఏటనుండి యిక్కడ పెరగడంతో నాకెక్కువగా అక్కడి సంగతులు తెలియవు."

"అదేంవిటి? అంత ఆస్థి నుంచుకుని ఎక్కడ్నో అమ్మా, నాన్నలకి దూరంగా వుండడం" శాంతి ఆశ్చర్యంగా అడిగింది.

"నాన్నకి ఎంత చెడ్డలవాట్లున్నా నన్ను మాత్రం మంచి వాడిగా తీర్చిదిద్దాలని చాలా తాపత్రయ పడేవారు. నాచేత ఎన్ని వేలకి, వేలు దానా లిప్పించారో లెక్క లేదు. కాని నేనుమాత్రం నాన్నకి ఏమాత్రం తీసిపోకుండా నాన్నడుగుజాడలలో నడవడం ఆరంభించాను. చుట్టూ ఎప్పుడూ ఫ్రెండ్స్, సిగిరెట్లు పెగలెయ్యడంతో నాన్న చాలా బాధపడ్డారు. చిన్నప్పటినుండే తనమాట వినకుండా జులాయిగా తిరగడంతో నాన్న నన్ను అక్కడే హాస్టల్లో జాయిన్ చేశారు. హాస్టల్లోకూడా నా జీవితంలో మార్పు లేదు. అక్కడ ప్రిన్స్‌పాల్‌తోసహా అందరూ నన్ను ఎంతో గొప్పగా చూసేవాళ్ళు. నన్నేమైనా అంటే నాన్నకు కోపం వస్తుందన్న భయంతో నేను చదివినా, చదవకపోయినా ఏమీ అనేవాళ్ళు కారు. దాంతో నా గొడవ యింకా రెట్టింపయింది. ఇంక నాన్న లాభం లేదనుకుని, మా వాళ్ళకి దూరంగా యిక్కడ హాస్టల్లో 'జాయిన్' చేశారు. చేతికి డబ్బులివ్వడం మానేశారు. కాన్వెంట్ సిస్టర్స్‌కూడా ఎంతో శ్రద్ధతీసుకుని చదువు చెప్పే వాళ్ళు. నాన్న రెండు రోజులకోసారి ఏవేవో నీతులు చెప్తూ లెటరు వ్రాసేవారు. బహుశా నాన్న పట్టుదలవలనే యింత చదువు చదివాను. ఎం. బి. పూర్తయినపుడు నాన్న పొందిన సంతోషం అంతా, యింతా కాదు. ఎప్పుడూ, యెవ్వరూ యివ్వనంత గొప్పగా పార్టీ యిచ్చారు బొంబేలో. ఇప్పుడు నేనెంత డబ్బడిగితే అంతే! మరు క్షణంలో పంపిస్తారు. ఆ డబ్బుతో నేనేం చేశానో అన్నీ వివరిస్తూ లెటర్ వ్రాస్తాను. ఆయన వద్దన్నా వినకుండా, అమ్మ మాత్రం

నన్నుకూడా బిజినెస్‌లో యిరికించాలని చూసింది. కాని నాన్న మాత్రం "నళినీ! ఈ విషయంలో మాత్రం నా కభ్యంతరం చెప్పడానికి వీల్లేదు" అని శాసించినట్లే అనడంతో అమ్మ మాట్లాడలేదు. బహుశా నాన్నకుకూడా ప్రజాసేవ చేయడం యిష్టమేనట్లుంది. నేనిలా క్లినిక్ పెడ్తానని చెప్పగానే సంతోషంగా ఒప్పుకున్నారు" అంతా చెప్పి దీర్ఘంగా నిట్టూర్చాడు.

"ఐతే మీరు చాలా గొప్పవాళ్ళన్నమాట."

"గొప్పో మోగాని. మా నాన్న తరచుగా ఎందుకో బాధపడుతున్నట్లుగా, చాలా దిగులుగా వుంటుంటారు. నాకదే బాధగా వుంటుం దొకొకసారి."

"నీమీద ఎంత రేటు ఫిక్స్ చేశారో మీవాళ్లు?" కొంటెగా అడిగింది.

"ఎంతా! ఓ నాలుగో, ఐదో లక్షలు. అంతే."

"బాప్ రే! నాలుగులక్షలే నీ వెల! నేను కొనలేను బాబూ" భయంగా అన్నది.

"కొనలేవూ? అయితే అది నీ దురదృష్టం!" నవ్వుతూ అన్నాడు.

"నిజంగానా!" ఇందాకేదో భయం నటించింది గాని, యిప్పుడు మాత్రం నిజంగానే భయపడ్డది.

"భయపడకోయ్! ఏదో నీకని ఓ యాభైవేలు తగ్గిస్తున్నాను!" హాస్యంగా అన్నాడు.

"అబ్బె! అంతకూడా యిచ్చుకోలేం!"

"ఓ లక్ష!"

"ఊహూ!"

"ఛ ఛ! అయితే డాడీ నిన్ను చేసుకోవడాని కొప్పుకోరు. నా మీద ఖర్చు పెట్టిన డబ్బన్నా రావద్దూ?"

"నిజంగా మీ డాడీ ఒప్పుకోకపోతే చేసుకోవా?" అనుమానంగా చూసింది.

"డాడీ అంటే నాకు భయం!" నవ్వుని పెదవులమధ్య బిగపట్టి సీరియస్‌గా అన్నాడు.

"ఛ! హాస్యం కాదు. నిజం చెప్పు!"

"నిజంగా..." ఓరగా చూస్తూ ఆపేసాడు.

"ఊ. చెప్పు. త్వరగా!" భయ, సందేహాలతో అడిగింది.

"డాడీకి..."

"ఊ. చెప్పు!" ఆదుర్దాగా చెయ్యిపట్టుకుని అడిగింది.

"ఇష్టం..."

"ఊ!" నడవడం మానేసి ధీరజ్ ఎదురుగా నిల్చుంది.

"లేకపోయినా చేసుకుంటాను" నవ్వుతూ అని దగ్గరకి తీసుకున్నాడు.

"ఛీ! వెధవ. ఎంత భయపెట్టేశావ్!" ముద్దుగా కసురుకుంటూ అన్నది.

"ఇంతకీ డాడీ కిష్టం లేకపోయినా చేసుకుంటానన్నాను. కాని, నిన్నని చెప్పలేదుగా?" కొంటెగా కళ్లు చికిలించి అడిగాడు.

"ఛా! అసలు నీవు చేసుకుంటానన్నా, నేనేం చేసుకోను" కినుకగా అన్నది.

"అందుకే కదూ? రోజూ సాయంకాలం ఐదు కాగానే, నా దగ్గరకు పరుగెత్తుకొస్తావ్?" నవ్వుతూ అడిగాడు.

"రోజూ వస్తున్నానా? నీ కోసమేనా నేనొచ్చేది? తాతయ్యకి బాగుండడంలేదు కాబట్టి, డాక్టర్ కావాలి కాబట్టి వస్తున్నాను!" ముఖం గంభీరంగా పెట్టి చెప్పింది.

"ఊహూం. మరి నేను తప్ప మరో డాక్టర్ లేడు కాబోలు!"

"ఏదో కేవలం! నీ దగ్గర తక్కువ ఫీజు కనుక వస్తున్నాం. ఇలాగే పదికాలాలపాటు మాలాంటి పేదలపట్ల దయ చూపండి స్వామీ!" నమస్కారం పెట్టి నవ్వుతూ అన్నది.

* * *

జ్వాల ఆరోజు పదింటికల్లా బయటకి వెళ్ళిపోయింది.

జ్వాలలా వెళ్ళగానే యిలా వచ్చింది ఉమ.

"జ్వాల! నీకోసం 'ఉమ' ట! ఎవరో మరి. ఇదిగో కార్డు యిచ్చి వెళ్ళారు!" కాంతి రాగానే చెప్పింది.

కవర్ తీసి చూసింది. ఖరీదైన బ్లాక్ కలర్ కార్డుమీద,

గోల్డ్ కలర్‌లో వున్నాయి అక్షరాలు. ఉమ పుట్టినరోజు సందర్భంగా ఆ రోజు పార్టీ వుంది. వెళ్ళాలా, వద్దా అనే మీమాంసలో పడింది. వెళ్ళి, వీలయితే ఒకసారి పార్థసారధిగారిని కల్సుకుని, జాబ్ సంగతి అడిగితే మంచిది. అదే ఉద్దేశ్యంతో వెళ్ళింది. వర్మగారింటికి అంతకుముందెప్పుడూ వెళ్ళలేదు. బెరుగ్గా లోపల కడుగు పెట్టింది. దాదాపు రెండు వందలమంది దాకా వున్నారు. వాళ్ళల్లో తనకి తెలిసినవాళ్ళెవరూ లేరు. ఆఫీసు స్టాఫ్ కూడా ఎవరూ కన్పించలేదు. అలాగే నిల్చుంది. ఎవరూ పలకరించలేదు. అందరూ అతి ఖరీదయిన మనుష్యుల్లా వున్నారు. అందరూ సంతోషంగా, సరదాగా కబుర్లు చెప్పుకుంటున్నారు. ఒక్కోసారి వికారంగా, విరగబడి నవ్వుతున్నారు. కిరణ్, రవి తనని చూసికూడా పలకరించలేదు. ఉమ ఎక్కడుందో కన్పించనేలేదు. అంతమంది మధ్యలో తనే ఒంటరిగా వుంది. అప్పటినుండి కొంతమంది తననే చూస్తున్నారు. ఆ చూపుల్లో చులకన, పిలవని పేరంటానికొచ్చినట్లు హేళన వున్నాయి. ఎంత సేపని అలా నిలబడ్డం? ఛ! ఇక్కడికి రావడమంత బుద్ధితక్కువ యింకోటి లేదు. నిల్చుని, నిల్చుని కాళ్ళు పీక్కుపోతున్నాయి. ఏం చెయ్యాలో అర్థం కాలేదు. తనున్న స్థితికి తన మీద తనే జాలి వేసింది. ఈ ప్రపంచంలో డబ్బుకున్న విలువ మరి దేనికీ లేదు. అందంచే కాదు, తెలివితో సింహాసనం ఎక్కినట్లు, మిగతావాళ్ళు తమ కాళ్ళదగ్గరున్నట్లు ఫీలవుతారేమో! ఒక్కరయి లేకపోతే ఒక్కరు కూడా తనవైపు సరిగ్గా చూడలేదు. విసుగొచ్చి, వెళ్ళిపోదామని వెనక్కి తిరిగింది. భుజంమీద చెయ్యి పడ్డంతో, విసురుగా వెనక్కి తిరిగింది. ఎదురుగా మనోజ్! నవ్వుతూ నిల్చున్నాడు.

“సారీ! మీరనుకోలేదు!” చెయ్యి తీసేసి మామూలుగా అన్నాడు.

“అదేంటక్కడ నిల్చున్నారు? లోపలికి రండి! ఉమ కన్పించలేదా?” స్నేహంగా పలకరించాడు.

జ్వాల తల అడ్డంగా వూపింది.

“రండి! వెళ్దాం!”

వెంట పెట్టుకుని ఉమ దగ్గరకు తీసుకెళ్ళాడు.

"హాయ్! ఎప్పుడొచ్చారు? యింత లేటుగా వచ్చారేం?" ఉమ అన్నది.

"హాయ్! విష్ యు హాపీ మెనీ రిటర్న్స్ ఆఫ్ ది డే!" నవ్వుతూ గ్రీట్ చేసింది.

మనోజ్ అక్కడున్న వాళ్ళకి పరిచయం చేశాడు. 'అందరూ నవ్వుతూ, 'హాయ్ అనో, హల్లో! హౌ డు యు డూ!" ఇలా పలకరించారు. అంతకుముందు తనని చూసి పలకరించని వాళ్ళు కూడా, మనోజ్ పరిచయం చెయ్యగానే ప్రతి ఒక్కరూ నవ్వుతూ పలకరించారు. వాళ్ళ నవ్వులు తెచ్చిపెట్టుకున్నవని గూఢగానే తెలుస్తూనే వున్నాయి. తనకి డబ్బు లేకపోయినా, ధనవంతుడయిన మనోజ్ పక్కనుండడంతో తనకీ గుర్తింపు వచ్చింది మరి!

"జ్వాల! అక్కడ కూర్చుందాం!" దూరంగా వున్న టేబిల్ వైపు దారితీస్తూ అన్నాడు.

మౌనంగా అనుసరించింది.

"నిన్నెక్కడికి కెళ్ళారు?"

"ధీరజ్ వాళ్ళ బంగళాకి తీసికెళ్ళాడు!"

"ధీరజ్ అంటే ఆ ఎర్రగా వున్న బ్బాయా?"

"అవును."

"ఏం చేస్తుంటాడు?"

"ఎమ్. డి. చేస్తున్నాడు. ఈవెనింగ్స్, ఓ రెండు గంటలు క్లినిక్‌లో వుంటాడు!"

"ఎక్కడ?"

చెప్పింది. "ఒక్క రూపాయి ఫీజు తీసుకుంటాడు కదూ?"

"అవును!"

"హాయ్! మీరూ వచ్చారే?" అంతకుముందు చూడనట్లు, అప్పుడే చూస్తున్నట్లు ముఖం పెట్టారు కిరణ్, రవి.

జ్వాల మాట్లాడలేదు.

"తీసుకోండి!" జ్వాల ముందుకి ప్లేటు నెట్టి అన్నాడు మనోజ్.

మనోజ్ సుతారంగా బాదుస్తా తింటూ జ్వాల వైపే చూస్తున్నాడు. జ్వాలకా వాతావరణంలో వూపిరాడనట్లుగా, ఎప్పుడింటికి వెళ్దామా అనుంది.

"ఏంటివిటి? మీరంతా ఇక్కడున్నారా? ఏంటి జ్వాల గారసలు ఏం తినటంలేదు" ప్లేటులోని అటూ, ఇటూ కదపడం తప్ప ఏం తినని జ్వాలని చూస్తూ అన్నది ఉమ.

"ఇదుగో! మనో ప్రెజంటేషన్!" గర్వంగా ఎడంచేతి వేలికున్న డైమండ్ రింగ్ ని చూపెడ్తూ అన్నది.

"చాలా బావుంది!" పరీక్షగా చూస్తూ అన్నది.

"చూడండి!" తీసి చేతిలో బలవంతంగా పెట్టి అన్నది.

"ఇప్పుడే వస్తాను" మనోజ్, ఎవరో పిలవడంతో లేచి వెళ్ళాడు.

"మనో! నేనూ వస్తానుండు!" ఉమ, ఉంగరాన్ని తీసుకోకుండానే వెళ్ళింది.

"ఉమ! ఇది తీసుకుని వెళ్ళండి!" వెళ్తున్న ఉమని పిలుస్తూ అన్నది.

"ఫరవాలేదు. ఉంచండి. తర్వాత తీసుకుంటాను!" ఓసారి వెనక్కి తిరిగి చెప్పి వెళ్ళిపోయింది.

తొమ్మిదవుతుండగా జ్వాల వెళ్ళడానికని లేచింది. ఉమతో చెప్పి వెళ్దామని చూసింది. ఉమ దూరంగా ఎవరితోనో మాట్లాడుతుంది. పక్కనే మనోజ్ వున్నాడు.

"ఉమ! వెళ్ళొస్తాను!" దగ్గరగా వెళ్ళి చెప్పింది.

"రింగేది?" ఉమ తటపటాయిస్తూనే అడిగింది.

"అదేంటి? ఇందాక ఇచ్చాను కదూ?" తెల్లబోయి అడిగింది.

"జ్వాల! హాస్యం కాదు. ఇంకేదయినా అయితే వూరుకుంటాను గాని, మా మనో ఇచ్చింది మాత్రం నే నివ్వను!" నవ్వుతూ అన్నది.

"ఉ...మా!" కూడ బలుక్కుంటూ అన్నది.

"ఏమైంది!" కిరణ్, రవి, రాధిక వస్తూ అన్నారు.

"కిరణ్! యిందాక మీ ముందే కదూ, జ్వాలకి నేను రింగ్

ఇచ్చింది."

"అవును!"

"తర్వాత తను యిస్తుంటే తీసుకోకుండా వెళ్ళాను కదూ!"

"అవును!"

"ఇప్పుడు చూడు! ఇవ్వనంటోంది!"

"అదేంటి? ఎందుకనివ్వదూ!" తీక్షణంగా అడిగాడు రవి.

"తీసుకున్నవి యిచ్చే అలవాటు లేదేమో?" వ్యంగ్యంగా అన్నాడు కిరణ్.

జ్వాల కోపంగా తలెత్తి చూసింది.

"అసలే చేతివాటం కూడా వున్నది!" రాధిక విసురుగా అన్నది.

"జ్వాల! ఇంకో వుంగరం కావాలంటే దానం చేస్తాను. కాని ఇది మాత్రం ఇవ్వను!" కోపంగా, విసురుగా, ఖచ్చితంగా అన్నది.

జ్వాల నిస్సహాయంగా, నిరుత్తరంగా నిలబడిపోయింది. చుట్టూ చాలామంది మూగారు. ఒక్కొక్కళ్ళు అడుగుతుంటే వివరంగా చెప్తుంది ఉమ.

"అలా చేతివాటం వున్న పిల్ల నెందుకు పిలవడం?"

"పిలిస్తే మాత్రం వుంగరాన్ని చేతికివ్వటమా?"

"లేనోళ్ళ బుద్ధులు లేకిగానే వుంటాయి!"

అందరూ అనేవాళ్ళు! జ్వాల వాళ్ళ తిట్లకి కేంద్రంగా వుండిపోయింది. తను గొంతెత్తి నిజం చెప్పినా ఇక్కడెవరూ వినరు. వాళ్ళందరూ ఒకటి, తనే వేరు.

"ఆ వేషం చూడండి! డాబుగా ఎలా వుందో?"

తను డాబుగా వేషమేసుకుందా? చీర, జాకెట్ తప్ప వంటిమీద చిన్న యెత్తు బంగారం లేని తను డాబుగా వుందా! వీళ్ళందరికి కళ్ళు లేవూ? ఒక్కరయినా తనవైపు మాట్లాడరేం! నిజానికి జరిగింది వీళ్ళెవరూ చూడలేదు. అయినా అందరూ ఒక్కటిగా ఉమవైపు తనని హేళనగా, ఛీదరగా చూసి హేళనగా నవ్వారే?!

"అందులోనూ అది, వాళ్ళ కాబోయే శ్రీవారు ప్రెజంట్

చేసారట!"

"ఛా! ఏం బుద్ధమ్మా! పాడు బుద్ధి! మనమేదో వాళ్ళమీద సానుభూతిగా వుండి, వాళ్ళని మన పార్టీలకి పిలవడమేగాని, వాళ్ళకేమాత్రం కృతజ్ఞత కూడా వుండదు. ఎంతసేపూ ఏది కొట్టేద్దామా అనే ఆలోచనే!"

"చూడబోతే చదువుకున్నదాన్లా వుంది!"

"ఆఁ! ఎందుకూ చదువు! ఇలాటివి ఇంకా నేర్పుగా చెయ్యడానికా?"

"పోలీసు రిపోర్టివ్వండి! వాళ్ళే తేలుస్తారు!"

ఉచితంగా సలహా ఇచ్చారెవరో? జ్వాల తలొంచుకుని నిల్చుంది. అందరి మాటలూ నిస్సబ్దంగా వింటూంది. ఒక్కొక్క మాట ఒక్కొక్క బాణంగా సూటిగా గుండెల్ని తాకుతుంటే, మనస్సు గిలగిల కొట్టుకుంటూంది. బలవంతంగా వచ్చే ఏడుపుని నిగ్రహించుకుని నిల్చుంది.

"పోలీసుల్దాకా ఎందుకూ? మనమే చెప్పిద్దాం!" అని, కిరణ్ ముందుకొచ్చాడు.

"జ్వాల మర్యాదగా అడుగుతున్నాం! ఇచ్చెయ్యి! అనవసరంగా పోలీసుల్దాకా ఎందుకు వెళ్ళడం?" రవి జాలి చూపెట్టినట్లు ముఖంపెట్టాడు.

జ్వాల కన్నెత్తి చూడలేదు. మాట్లాడలేదు.

"జ్వాల!" కఠినంగా పిల్చి, భుజంమీద చెయ్యివేసి పట్టుకున్నాడు కిరణ్.

"జ్వాల! ఇంకో నిముషంలో ఇవ్వకపోయావంటే, ఇక్కడే వీళ్ళందరిముందే సెర్చ్ చేస్తాను!" అని తీక్షణంగా అన్నాడు.

జ్వాల అప్పుడు తలెత్తి చూసింది. ముఖమంతా కందిపోయి, కళ్ళలో ఎర్ర జీరలతో అదిరే అధరాలతో తీక్షణంగా చూసింది.

"ఆ చూపు చూడు ఎలా చూస్తుందో? దొంగతనం చేసినప్పుడా అభిమానం ఏమైంది? మేము అంటే అభిమానం పొడుచుకొచ్చింది!" హేళనగా అన్నాడు రవి.

"ఛీ! వదులు!" విసురుగా విదిలించింది.

మరింత గట్టిగా పట్టుకోవడంతో, జ్వాల మడిచేసి కోపంగా చేతిని లాగి, బలంగా, అలవాటుగా నొక్కేసింది. ఆ బాధతో 'కెవ్' మన్నాడు.

"రాక్షసి! దెయ్యం!" రవి బాధగా కోపంగా — చాడు.

అక్కడున్న వాళ్ళంతా, జ్వాల ధైర్యానికి, కి సుకుమారంగా కన్పిస్తున్నా, ఇంత బలంగా ఎలా నొక్కిందా అన్న అనుమానానికి లోనయ్యారు.

"జ్వాలని నేను పోలీస్ స్టేషన్‌కి తీసుకెళ్తాను!" ఎలాంటి వ్యాఖ్యానం చెయ్యకుండా అప్పటిదాకా, మౌనంగా పానమపానం చేస్తున్న మనోజ్, గట్టిగా అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు.

"జ్వాల!" కఠినంగా పిలిచి, బరబరా యీడ్చుకుపోతున్నట్లే, అందర్నీ తప్పించుకుంటూ, తీసికెళ్ళి కార్లో కూర్చోపెట్టాడు.

జ్వాల విడిపించుకునే ప్రయత్నం చేసిన కొద్దీ, మనోజ్ మరింత గట్టిగా పట్టుకుని తీసికెళ్ళాడు. జ్వాల ఏం చేయలేనిదాన్లా, వెంట నడిచింది.

సరాసరి ఫైవ్ స్టార్ క్లబ్‌కి తీసికెళ్ళాడు.

"జ్వాల! విశ్రాంతిగా ఆలోచించుకొని చెప్పు. - ఉంగరం ఇస్తావో లేక పోలీస్ రిపోర్టివ్వమంటావో!" రూమ్‌లో కూర్చోబెట్టి, లాక్ చేసి వెళ్ళిపోయాడు.

జ్వాల ఏదో సమాధానం చెప్తున్నా విన్పించుకోకుండా వెళ్ళిపోయాడు. ఇవాళెంత చెడ్డరోజు! అనవసరంగా అపనిందల పాలయ్యింది. తను చేసిన తప్పు లేకపోయినా అవమానాల పాలయ్యింది. తను చేసిన తప్పంటూ వుంటే, ఉమ వాళ్ళందరి ముందు ఉంగరం చూడమనిస్తే, తను ఉమ ఒక్కతే వున్నప్పుడు యిచ్చింది. ఇంతే! ఇంత ఘోరమయిన అబద్ధం ఆడుతుందనుకోలేదు. ఉమే కాదు, అక్కడున్న అందరూ అంతే! నిజానిజాలు తెల్సుకోకుండానే నిందించేవాళ్ళే. చెయ్యని తప్పుకి శిక్ష! తనలాటివాళ్ళు నేరాలు చెయ్యకుండానే శిక్ష ననుభవిస్తుంటారు. ధనవంతులేం చేసినా చెల్లుతుంది. ఎలాటివాళ్ళనయినా ధనాశ చూపెట్టి లొంగదీసుకో

గలదు. వీళ్ళందరూ కలిసి ఆలోచించుకునే యిలా చెయ్యలేదు గదా! నిజమంతే అయ్యుంటుంది! అందరూ కలిసి [illegible]ంది ఎదుట అవమానించారు! ఎప్పుడో వీళ్ళందర్ని కలిపి తనవమానించే ఛాన్సు రాదా! అవమానంతోనూ, కోపంతోనూ దహించుకుపోయింది. ఈ మనగారేంటి? గదిలో పెట్టి లాక్ చేసాడు? ఏం చెయ్యడానికో?

దాదాపు గంట తర్వాత వచ్చాడు మనోజ్. వెనకే మీల్స్ కూడా తీసుకొచ్చాడు వెయిటర్.

"జ్వాల! మీల్స్ చేద్దాం రా!" మామూలుగా అన్నాడు.

అబ్బ! ఎంత మామూలుగా పిలుస్తున్నాడు. ఇంతకు ముందేమీ జరగనట్లు, జరిగినా అదేదో మర్చిపోయినట్లు నటిస్తున్నాడు. పైగా తమిద్దరి మధ్యలో సఖ్యతేడ్చినట్లు పిలుస్తున్నాడు.

"నేను తినను" మంచంమీదనుండి లేవకుండా అన్నది.

"ఎందుకని? ఇందాక కూడా ఏం తిన్లేదుగా?" చేతులు కడుక్కుంటూ అడిగాడు.

"........."

"అయితే నేనూ తినను!"

"నేను తినకపోతే, మీరు నాకోసం మానేసేటంత సఖ్యత మనిద్దరమధ్య ఏడవలేదుగా? తినండి తినకపొండి. అది మీ ఇష్టం!" సూటిగా అన్నది.

మనోజ్ మాట్లాడకుండా కూర్చున్నాడు.

"అసలు నన్నిక్కడికెందుకు తీసుకొచ్చారు? పోలీసుస్టేషన్ కన్నారుగా? ఇక్కడికి తీసుకురావడమేంటి? గంటసేపు గదిలో బంధించగానే, అబద్ధాన్ని, నిజంచేసి చెప్తాననుకున్నారా?" తీక్షణంగా అడిగింది.

"నిజమో, అబద్ధమో తర్వాత చెప్పుదుగాని, ముందు తినండి!" జ్వాల మాటలు పట్టించుకోనట్లుగా అన్నాడు.

"నేను తిననని ముందే చెప్పాను!"

మనోజ్ కోపంగా ప్లేటు తీసి వాష్ బేసిన్ వైపు వెళ్ళాడు.

"ఆగండి! అలా పారేస్తారేం?"

"ఏం చెయ్యమంటావ్?" ఒక అడుగు వెనక్కివేసి అడిగాడు.

"అదుగో. క్రిందికి చూడండి. అన్నంకోసం అలమటించేవాళ్ళ కివ్వండి. మీ పేరు చెప్పుకుని సంతోషంగా తింటారు!" వెటకారంగా అన్నది.

ఛ! జ్వాలలాంటి మొండిపిల్లని తనెక్కడా చూడలేదు. అసలు తనకి ఎదురు ఎవరూ చెప్పరు. ఇంట్లోనే కాదు, బైటకూడా తనన్నదానికి యింతవరకూ కాదనేవాళ్ళు లేరు. ఈ రోజుకి జ్వాల తయారైంది.

"వాళ్ళకీ అన్నం యిచ్చేద్దాం. మనం మళ్ళీ తెప్పించుకుందామా?"

"నాకొద్దు. ముందు నన్నిక్కడనుండి పంపండి. మా బామ్మ ఖంగారు పడుతుంది, యింత టైమయినా రాలేదని."

"కారికే పంపేటందుకు తీసుకొచ్చానా యిక్కడికి?"

"మరి?" ఆశ్చర్యంగా అడిగింది.

"తర్వాత చెప్తాను. ముందు తిను!" బెల్ నొక్కుతూ అన్నాడు.

వెయిటర్ రాగానే రెండు ప్లేట్లు తీసికెళ్ళి, అడుక్కునేవాళ్ళ కివ్వమని, వేరే ప్లేట్లలో తీసుకురమ్మన్నాడు.

వెయిటర్, అర్థం కానట్లు చూసాడు. మనోజ్ ఏమీ మాట్లాడక పోవడంతో వెళ్ళిపోయాడు.

"నేను వెళ్తాను!"

"ఓ నిముషం వెయిట్ చేస్తే, ఎస్. ఐ. రామకృష్ణ వస్తానన్నాడు. అతనడిగే ప్రశ్నలకి జవాబిచ్చి వెళ్ళొచ్చు" క్లుప్తంగా అన్నాడు.

"జ్వాల! అనవసరంగా ఎందు కాకలితో మాడుతావ్? తినరాదా?"

"........."

"నాకు చాలా ఆకలిగా వుంది. కాని నిన్నలా యెదురుగా వుంచుకుని యెలా తిన్ను?"

"బైటికెళ్ళి కూర్చుంటాను. తినండి మీరు!"

"ప్లీజ్! జ్వాల! పోనీ నాకు కంపెనీ యివ్వు!"

"........."

"నిజంగా నాకు కంపెనీ లేకపోతే తిన బుద్ధికాదు!"

మనోజ్ మాటలకి సమాధానం యివ్వకుండా, కిటికీలోనుండి శ్రద్ధగా క్రిందికి చూస్తూ నిల్చుంది.

"జ్వాల!"

దగ్గరగా వినిపించడంతో వెనక్కి తిరిగి చూసింది. దాదాపు ఒకరికొకరు తగిలేంత దగ్గరలో నిల్చున్నాడు. జ్వాల తీక్షణంగా చూసింది. మనోజ్ నవ్వుతూ చూసాడు.

"కరెక్ట్‌గా వుంది మనిద్దరి హైటు!"

ఇంకేదో అంటాడనుకుని ఎదురుచూసిన జ్వాల, మనోజ్ ఆలా అనడంతో అర్థంకానిదాన్లా చూసింది.

"నీకు తెలీదా?"

"ఏంటది?" అనుమానంగా చూసింది.

"మగవాడి 'చిన్ హైట్'లో వుండాలి అమ్మాయి. అప్పుడు జంట సరిగ్గా వుంటుందట!"

జ్వాల విస్తుబోయి చూసింది.

"ఇంకా అర్థం కాలేదా?"

తల అడ్డంగా ఊపింది.

"మనిద్దరం పెళ్ళి చేసుకుంటే, యిద్దరి జంట..." కొంటెగా కళ్ళు చికిలించాడు.

ఛ త్రుసుమన్నట్లు చూసింది.

"ఛ! చేసుకుంటానని కాదు. నా కాబోయే భార్య నీ అంత హైటులో వుంటే బావుంటుంది అని అంటున్నాను!" జ్వాల కోపం చూసి, వెనక్కి తగ్గుతూ అన్నాడు.

విసురుగా వెళ్ళి, బుద్ధిగా మంచంమీద కూర్చుంది. కాళ్ళు రెండూ మడిచి పైన పెట్టుకుని, మోకాళ్ళచుట్టూ చేతులు వేసుకుని, గడ్డం మోకాలిమీద ఆన్చి బుద్ధిగా కూర్చుంది.

"జ్వాలా! ఉమ నా హైటుకు సరిపోతూందంటావా?" యధాలాపంగా అడిగినట్లు అడిగాడు.

"........."

"అబ్బ! నేను వాగడం తప్పితే నువ్వసలు మాట్లాడవేం? మీ తమ్ముడు నయం! శ్రోత్రియునా ఎంచక్కా మాట్లాడుతాడు!"

"జ్వాల! నిజంగా నీకలాంటి డైమండ్ రింగ్ కావాలంటే నేను కొనిపెట్టేవాడినే! అనవసరంగా ఉమదగ్గర తీసుకుని, అందరి చేతా అన్నిమాట లన్పించుకోవడం ఎందుకూ?"

వచ్చిన దగ్గర్నుంచీ చూస్తుంది. ఏమిటీ మాట? ఇంత మంచిగా మాట్లాడుతున్నాడంటే ఏదో పెద్ద అవమానం చెయ్యడానికి నాంది పలకడం! ఇంకా తనకి జరగాల్సిన అవమానం ఏముంది కనుక? ఈ మహానుభావుడు కొనిపెట్టగానే తను ఆశగా తీసుకుంటుం దనుకున్నాడా? హు! అయాచితంగా, ఉచితంగా తనెప్పుడూ, ఎవరిదగ్గరా తీసుకోదనే సంగతి యితగాడి కెలా తెలుస్తుంది?

"ఎస్! కమిన్!" తలుపుమీద చప్పుడవడంతో, విసుగ్గా అన్నాడు.

"హాయ్! మనూ!"

"నువ్వా? ఏంటిలా వచ్చావ్? ఇంటికెళ్ళే వచ్చావా?" వర్మగారి ఆఖరబ్బాయి రాకేష్ని అడిగాడు.

"ఊహు. ఇంటికెళ్ళలేదు. నీకోసమే వచ్చాను. చిలక నైసుగా వుందే!" ఓరగా జ్వాలవైపు చూస్తూ అన్నాడు.

"గోరింక డబుల్ వరస్ట్‌గా వుంది!" జ్వాల ఛర్రున అన్నది.

"బాప్ రే! మంచి కోపంలో వుంది! ఏం చేసావ్?" బైటికెళ్ళి రహస్యంగా అడిగాడు.

"ఛ! నోర్మూసుకో! విన్నదంటే దేహశుద్ధి చేస్తుంది!"

"నిజంగానా? అంత కోపంలో వుందా?"

"ఎందుకొచ్చావ్?"

"ఊరికే! కాబరేడాన్స్ చూద్దామని వస్తే, నువ్వు హైనున్నావని ఓ ఫ్రెండ్ చెప్తే, చూద్దామని వచ్చాను!"

"ఊ! చూడమయిందిగా? వెళ్దూ?"

"నాక్కూడా ఓ ఛాన్స్!"

"నోర్మూసుకోమని చెప్పలేదూ? అయినా, నీకంత ఉబలా

టంగా వుంటే వెళ్ళి చూసిరా!" నవ్వుతూ అన్నాడు.

"వద్దులే! వెళ్తున్నాను! క్రిందే వుంటాను. త్వరగా రండి!"

"జ్వాల! యిప్పుడు చెప్పు. ఏం జరిగిందో?" నిదానంగా అడిగాడు.

"కొత్తగా నేను చెప్పేదేం లేదు. ఉమకే నేనే రింగు యిచ్చేసాను!"

"అయితే ఉమే అబద్ధం ఆడుతుందా?"

"అవును. మీ కవన్నీ అలవాటేగా? ఎదటివాళ్ళ నమ్మించి, వాళ్ళు బాధపెడ్తుంటే చూడ్డం మీ కిష్టమైన పనేగా?"

"నువ్వెప్పుడయినా అలాంటి సంఘటన చూశావా?"

"ఇంతకుముందు చూడకపోతే నేం? ఇప్పుడు చూసానుగా!"

"నువ్విచ్చేటప్పుడు, ఉమ పక్కన ఎవరున్నారు?"

"ఎవరూ లేరు. అదే నేను చేసిన పొరపాటు. వుంటే మాత్రం నీలాంటివాళ్ళు చెప్తారా? మీరూ మీరూ ఒక్కటే! ఇద్దరూ కలిసి అబద్ధం ఆడేస్తారు!" నిరసనగా అన్నది.

"నువ్వొక్కదానివే ప్యాకెట్ మార్ చెయ్యగా లేనిది, మేమిద్దరం కలిసి అబద్ధం ఆడ్డంలో ఆశ్చర్యమేముంది?"

"నేనలా చెయ్యడానికి కారణం మీరు కాదూ?"

"అయితే మాత్రం? అలా చేస్తారా?"

"ఊహు. చెయ్యకపోతే అక్కడ కూర్చుని పప్పురుబ్బనా, అంట్లు తోమనా?"

"ఛ. ఛ. అలా ఎందుకు చేయనిస్తాం!" వెంటనే అన్నాడు.

"ఛ ఛ! ఏంటి? అదేం తప్పుపనా? కాకపోతే మీరు తిన్న దానికి నేనెందుకు చేస్తాను?"

"పోనీ మర్యాదగా, మనోజ్ నా దగ్గరేవు. నువ్వివ్వు! అని అడిగినట్లయితే, తప్పకుండా ఇచ్చేవాడినే!"

"ఆహా! వుదారపురుషులు బైలుదేరారు!" వెక్కిరింతగా అన్నది.

"అవునో? కాదో? అడిగి చూడకూడదూ?"

"సరే! అయితే! నాకు జాబ్ చూపెట్టు!" వెంటనే అని,

నాలుక్కొరుచుకుంది.

క్షణం ఆగి, "ఓ. కే. చూపెడ్తాను. నాకేమిస్తావ్?" అన్నాడు.

"సార్రీ!" అప్రయత్నంగా అనేసింది.

"ఏంటది మళ్ళీ నా జేబులోవా?" నవ్వుతూ అడిగాడు.

జ్వాల తలొంచుకుంది.

"జ్వాల! నువ్వు చెప్పింది నిజమే కదూ? నువ్విచ్చేసావు కదూ ఉమకి?"

"నమ్మితే నమ్ము. లేకపోతే వూరుకో. ఎలాగా ఎస్. ఐ. వస్తారన్నావుగా? అతడే చూస్తాడు!"

"అనవసరంగా, పోలీసుల దృష్టిలోకి వెళ్ళడం ఎందుకూ? ఆ తర్వాత దీనివల్ల చాలా ఇబ్బందులుంటాయి తెల్సా?"

"ఉంటే మాత్రం? మాలాటి వాళ్ళు, మీ దయవల్ల ఎప్పుడో ఓసారన్నా వాళ్ళ దృష్టిలోకి వెళ్ళకుండా ఎలా వుండగలం?" హేళనగా అన్నది.

"అంతా మాదే తప్పు. మీరే తప్పులూ చెయ్యరు పాపం!" వెటకారంగా అన్నాడు.

"మనోజ్! నన్ను త్వరగా పంపించాలి! ఇంటివగ్గర ఖంగారు పడ్తొంటారు!" చిన్నగా అడిగింది.

"అలాగే. రామకృష్ణకి రావద్దని ఫోన్ చేస్తానుండు!"

ఫోన్ చేసి, ఇద్దరూ క్రిందికొచ్చారు.

"మనోజ్! మీ రందరూ కలిసి ముందే అనుకుని యిలా చేసారు కదూ?"

"వాట్!" ఆశ్చర్యంగా, తనాగి, జ్వాలనాపి అడిగాడు.

"......"

"నువ్వు భలేదానివి! నేనేదో నీమీది నమ్మకంతో యిలా చేస్తే, ముందే అనుకునిలా చేసారంటావా?"

"నామీదా? నీకా? నమ్మకం? ఛ! ఎందుకుంటుంది? పైగా నీ జేబులో డబ్బు కొట్టేసానని కూడా తెల్సు!" నిరసనగా అన్నది.

"అందుకే నాకా నమ్మకం! నిజానికి, నా జేబులో వంద

రూపాయల నోటు పోయినట్లు గుర్తుకూడా లేదు. నువ్వు చెప్పే దాకా, నా జేబులోంచి పోయిన సంగతి నాకు తెలీదు. నిజంగా నువ్వలా ధైర్యంగా చెప్తుంటే ముందు ఆశ్చర్యపోయినా, తర్వాత మెచ్చుకోకుండా వుండలేకపోయాను. మనస్సులోనే అనుకో."

"పైకి మెచ్చుకుంటే, మీ ప్రిస్టేజికి భంగం కాదూ?"

మనస్సులోనే నవ్వుకుని "సరే! నీ మీద నమ్మకంతోనే వదిలేశాను. అది నువ్వు నమ్మినా, నమ్మకపోయినా నిజం. రేపు పదికి మా యింటికొస్తావా?"

"ఎందుకూ? మరే దొంగతనమో అంటగట్టాలా?"

"ఛ! నువ్వేగా, యిందాక జాబ్ చూపెట్టమన్నావ్?"

"నిజంగా రానా?"

"నమ్మకేగా చెప్పడం!"

"వూహూ. రాను!" ఏదో ఆలోచిస్తున్నదానిలా అన్నది.

"ఏం?"

"......"

"పోనీ రావద్దులే. నేనే రెండు, మూడు రోజుల్లోగా, నీకీ విషయం చెప్పడానికొస్తాను!"

జ్వాల నమ్మలేకపోయింది. అయినా పైకి ఏమీ అనలేదు.

"గుడ్ నైట్!" దిగి డోర్ వేసి అన్నది.

"మీ ఇంటికి రానా?!"

"వద్దు. గుడ్ నైట్!" చెప్పేసి, వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది.

"ఎందుకింత లేటయింది?" రాగానే, ముగ్గురూ ఆత్రంగా అడిగారు.

"ఊరికే. డిన్నర్ కూడా వుంది!"

ప్రతాప్, కాంతి, జ్వాల ముఖంలోకి చూస్తూనే, ఏదో దాచిపెడుతుందని తెల్సుకున్నారు. అప్పటికి వూరుకుని, బామ్మగారు నిద్రపోగానే ఇద్దరూ జ్వాలదగ్గర కొచ్చి అడిగారు. జ్వాల జరిగిందంతా చెప్పింది.

"ఛీ! ఎలాంటి మనుషులు?" అంతా విన్న తర్వాత కాంతి

ఛీదరగా అన్నది.

"మనోజ్ మంచివాడు కదూ?" ప్రతాప్ అన్నాడు.

"ఆ! అందరూ ఒకటే! ఏదో పెద్ద హీరోలా పోజు వేసాడు ఆఖరికి. అంతే! అందరూ అనుకునే చేసారిదంతా!" నిరసనగా అన్నది.

జ్వాల ఆ రోజు చాలాసేపు నిద్రపోలేదు. ఎంత మర్చిపోదా మనుకున్నా, అవే కళ్ళలో మెదులుతున్నాయి.

* * *

అనుకోకుండా సుధీర్‌కి మెడ్రాసులో జాబ్ వచ్చింది. జ్వాల సంతోషం చెప్పనలవి కాదు. తన ఫ్రెండ్స్‌లో ఒకరికయినా ఉద్యోగం దొరికినందుకూ, జీవితంలో స్థిరపడుతున్నందుకూ చాలా ఆనందం కలిగింది. సుధీర్, కాంతిని తీసుకునే వెళ్ళాలనడంతో తప్పని సరిగా పెళ్ళి చెయ్యాల్సి వచ్చింది. ఎలాగూ మరో ఆరునెలల దాకా ఇక్కడికి రావడానికి వీలుండదనడంతో, వెంటనే ముహూర్తాలు కూడా వుండడంతో ఏర్పాట్లు చేసారు. ముఖ్యమయిన ఫ్రెండ్స్‌నే పిల్చారు.

ఆ రోజు రాత్రి పదకొండుకి లగ్నం వుంది. క్లుప్తంగా గుడిలో పెళ్ళి చెయ్యడానికని ఏర్పాటు చేసారు. దాదాపు అందరూ అక్కడికి చేరుకున్నారు. జ్వాల ముఖ్యమయిన కొద్ది సామానుతో, ఆఖరుగా బైల్దేరింది. సామాను బైటపెట్టి తాళం వేస్తుంది. పాత తాళం! సరిగ్గా పడదు. అదెప్పటిదో తాతలనాటి తాళం. ఇంటికి తాళం వెయ్యాల్సిన అవసరం ఇంతవరకూ కలగలేదు. అందరూ ఒక్కసారిగా బైటకెప్పుడూ వెళ్ళలేదు. ఎంత గట్టిగా వేస్తున్నా, పడి చావడంలేదు. విసుగ్గా అలాగే వేస్తుండగా, వెనకనుండెవరో ఆ పని పూర్తి చేసారు. జ్వాల ఆశ్చర్యంగా వెనక్కి తిరిగి చూసింది.

"మీరా?"

"ఇదుగో!" తాళంచెవి అందిస్తూ అన్నాడు.

జ్వాలకి, తాళం తీసి అతన్ని లోపలికి పిలవాలో, వద్దో అర్థం కాలేదు. అయినా తను అర్జంటుగా వెళ్ళాలి. ఎందుకొచ్చాడో యిప్పుడు? రెండు మూడు రోజుల్లో ఉద్యోగం సంగతి, స్వయంగా

[illegible]న్న పెద్దమనిషి, నెలరోజుల తర్వాత హఠా-
[illegible]. అదీ యీ సమయంలో మనోహర్‌కి, జ్వాల
[illegible]గా కొత్తగా వుంది. నల్లటి వెంకటగిరి చీరకి,
జరీపూలు, సన్నటి జరీ బోర్డరు. మేచింగ్ బ్లౌజు,
చిన్న నల్లటిపూసల దండ. చెవులకి నల్లపూసల
[illegible]గా, అందంగా, ఆకర్షణీయంగా వుంది. ఎప్పుడూ,
దాటనల్లుండే జడని, యిప్పుడు అల్లకుండా అలాగే
[illegible]కున్న నల్లటి జుట్టూ, ఎప్పుడూ బొట్టు పెట్టుకోనిది,
[illegible]మట చిన్న నల్లటిబొట్టుతో, ఫ్యాషన్‌గా వుంది.
[illegible] ఎవరి ఆలోచనల్లో వాళ్లు అలాగే, సదేం చేస్తున్నట్టుగా

[illegible]వెడుతున్నారు? ఏదయినా పనుందా?'' ఎప్పుడూ, విసుగ్గా,
[illegible]ండే జ్వాల ముఖంలో యిప్పుడు నవ్వు కొట్టొచ్చినట్టుగా

[illegible]ల నవ్వు యింత బాగుంటుందని ఎప్పుడూ అనుకోలేదు.
[illegible]డూ ఆ ముఖం కోపంతో ధుమధుమలాడ్డం తప్ప, నవ్వనేది
[illegible]నా కన్పించదు. అలాటిది రోజూ నవ్వుతుందంటే ఏదో
పెద్ద విశేషమే వుండివుంటుంది. ఏంటబ్బా ఆ విశేషం? అదీకాక
యీ సమయంలో తాళం వెయ్యడమేంటి? ఈ సామానేంటి?
మనోహర్ జ్వాల అడిగేందానికి సమాధానం చెప్పకుండా జ్వాల
పట్టుకొన్న సామానువైపు, తను వేసిన తాళంవైపు. జ్వాలవైపు
మార్చిమార్చి చూస్తున్నాడు.

జ్వాల అదేం పట్టించుకోకుండా, తాతలనాటి ట్రంకు పెట్టెని, కాస్త పెద్దగానే వున్నది, దాన్ని అవలీలగా ఓ చేత్తో పట్టుకొని, మరోచేత్తో పెద్ద [illegible]ని పట్టుకొని, ముందుకు దారితీస్తూ అన్నది.

''[illegible], మాట్లాడదాం. రండి!''

''ఎక్కడికి వెళ్తున్నారు? ఇల్లు ఖాళీ చేస్తున్నారా?'' అంత బరువయిన సామాను పట్టుకొనికూడా అతి తేలిగ్గా నడుస్తున్న జ్వాల వైపు ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు.

"కాదు. మా కాంతి పెళ్ళి!" నవ్వింది.

"కాంతా!" ఆశ్చర్యంగా అడిగాడు.

"అదే! మా అత్తయ్య కూతురు కాంతి.
మీ కారులో డ్రాప్ చేసారు!" గుర్తు చేస్తున్న
చప్పున ఆ పిల్లెవరో గుర్తుకు రాలేదు. జ్వా
లీలగా గుర్తొచ్చింది.

"ఎక్కడ?" జ్వాలతో పాటు నడుస్తూ అ
గుడి పేరు చెప్పింది కాని, అదెక్కడు
మనోజ్ కి.

"మరి మమ్మల్నెవర్నీ పిలవలేదేం?"

జ్వాల చురుగ్గా చూసింది. "తెలిసిన వాళ్ళ తెల్వ
ఆర్థిక స్తోమతు మాకు లేదు!"

మనోజ్ చిన్నబుచ్చుకున్నట్టుగా చూసాడు.

"పోనీ! ఇప్పుడు పిలుస్తున్నాను. వస్తారా?"
రమ్మని పిలుస్తూ అడిగింది.

మనోజ్ సమాధానంకోసం ఎదురు చూ
వాడికి ఎడ్రెస్ చెప్పి ఎంతిమ్మంటాడో అనుగుతున్నది.

"నిజంగా రమ్మంటారా?" మనోజ్ ఉత్సాహంగా అడి
గాడు.

"రెండు రూపాయలెందుకూ? రూపాయిన్నర యిస్తాను.
వస్తావా?"

"చెప్పండి? రమ్మంటారా?"

"రావూ? రాకపోతే వెళ్ళు. వెధవ రిక్షాలు. ఒక్కడే
వున్నాడని మహా గీర! కాస్సేపాగితే యింకోడు రాడా?" ఓవైపు
రిక్షాకోసం చూస్తూ అన్నది,

"డౌరీ ఎంత?" చిన్నగా అడిగాడు.

"ఏంటి? అంటున్నారు? ఓ రిక్షావాలా!" గట్టిగా కేక పెడ్తూ
అన్నది.

మనోజ్ మాట్లాడకుండా జ్వాల బేరంచేస్తున్న విధానాన్ని
చూస్తూ నిల్చున్నాడు.

వచ్చి ముగ్గురూ జేరం కదరకుండానే పోయారు. జ్వాల విసుగ్గా ట్రంకుపెట్టెమీద దర్జాగా కూర్చుంది. చలికాలమేమో రోడ్డుమీద జనం అంతగా లేరు. అదీకాక తొమ్మిది దాటింది. అదీ రద్దీగావుండే రోడ్డుకూడా కాదు. అప్పుడప్పుడూ ఒకటీ, అరా రిక్షాలు, ఒకరిద్దరు మనుష్యులు తప్ప మరే వాహనాలు లెవు.

"ఆ రిక్షా డబ్బులేవో నాకే యివ్వండి. డ్రాప్ చేస్తాను!"

"ఏంటీ మీరు కారులో వచ్చారా? ఏదీ?" ఆశ్చర్యంగా చుట్టూ చూస్తూ అడిగింది.

"వస్తుంది. రిక్షాకంటే ఎక్కువ ఛార్జి యివ్వాలి మరి?"

"అయితే వద్దులెండి!"

కొద్దిసేపట్లోనే. కారు వచ్చింది.

"డ్రాప్ చేస్తాను. వస్తారా ?"

"పదండి. వస్తాను!" ఏదో దయ తలిచినట్లుగా ముఖం పెట్టింది.

ఈసారి చనువుగా, మనోజ్ ట్రంకుపెట్టెని అందుకున్నాడు. బాప్ రే! ఎంత బరువుంది! ఈవిడెలా పట్టుకుందో! కారు బయలు దేరాక డ్రైవర్‌కి దారి ఎటో చెప్పింది.

"పెళ్ళికొడుకెవరు?" కుతూహలంగా అడిగాడు మనోజ్.

"సుధీర్!" విండోలోనుండి చల్లటిగాలి రివ్వున వస్తూంటే, చీరని తలమీదుగా కప్పుకుని అన్నది.

"గ్లాస్ డోర్ వెయ్యండి!" తనవైపుది వేస్తూ అన్నాడు.

"సుధీర్‌కి మద్రాస్‌లో జాబ్ వచ్చింది. పెళ్ళి కాగానే వెళ్ళిపోతారు!" తనే చెప్పింది.

"అలాగా? గవర్నమెంట్ జాబా?"

"అవును. అనుకోకుండా, రికమెండేషనేదీ లేకుండా వచ్చేసింది. పైగా సెంట్రల్ గవర్నమెంట్ జాబ్!" గర్వంగా అన్నది.

కొద్దిసేపు యిద్దరూ మౌనంగా వున్నారు. మనోజ్ హఠాత్తుగా జ్వాల చేతిని మృదువుగా తన చేతిలోకి తీసుకున్నాడు.

"ఇది మీ కారేనని వెధవ్వేషాలు వేస్తే వూరుకోను!" విసురుగా చెయ్యి తీసుకుని, కోపంగా అన్నది.

జ్వాల గొంతుకి మనోజ్ నిజంగానే భయపడ్డాడు. మరేం మాట్లాడకుండా బుద్ధిగా కూర్చున్నాడు.

"ఏమిటి జ్వాల! ఇంతాలశ్యం! నీ కోసం యిందాకటినుండి ఎదురుచూస్తున్నాను!" ధీరజ్ లోపలనుండి వస్తూ అన్నాడు.

"ఏం చెయ్యనూ? రిక్షాలు దొరికి ఛస్తేనా? దొరికినవాళ్ళు సవ్యంగా అడిగితేనా?" మనోజ్ సంగతే మర్చిపోయి, కారు దిగి ధీరజ్ దగ్గరకి వస్తూ అన్నది.

"అదేంటి? కారెవరిది? ఎవరున్నారు లోపల?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఓ! మర్చిపోయాను. మనోజ్ వున్నాడు. సామాను డిక్కీలో వుంది" వెనక్కి తిరిగి అన్నది.

"ఛ! మరీ అంత మతిమరుపా? పిలవాలనికూడా తెలీదా?" మందలింపుగా అన్నాడు.

మరీ బలవంతం చెయ్యడంతో, మనోజ్ లోపలకొచ్చాడు. తమ యిళ్ళలో ఎంత చిన్న పార్టీకూడా యింత తక్కువమంది జనం రారు. మొత్తం కలిపి ఓ యాభైమందికూడా లేరు. కళ్యాణ మండపం లేదు. ఏం లేదు.

ధీరజ్, మనోజ్ ని లోపలికి తీసికెళ్ళి, కాఫీ యిచ్చాడు. ఒక్కచోటే గదేమో, జ్వాల అక్కడే కూర్చుని, కాంతికి పూలజడ కడ్తూంది. కొంతమంది ఆడవాళ్ళు పెళ్ళిదగ్గరకి కావాల్సిన సామాన్లు తీసి యివతల పెడ్తున్నారు. వచ్చిందగ్గర్నుండీ చూస్తున్నాడు. జ్వాల ఒక్క క్షణంకూడా తీరిగ్గా లేదు. గిలకలా అటూ, యిటూ తిరుగుతూనే వుంది. జ్వాల ఓ క్షణం విశ్రాంతిగా నిల్చున్నా, ఎవరో ఒకరు 'జ్వాల!' అనగానే, ఛెంగున వెళ్ళి, ఆ పనేదో చూసి వస్తుంది. జ్వాల అలా క్షణం తీరికలేకుండా వుంటే మహా ముచ్చటగా, చూడ బుద్ధవుతూంది.

"ఏంటలాగే కూర్చున్నారు? భోజనానికి రారా? అందరూ వెళ్ళేరు. మీరలాగే వున్నారేం?" ఒంటరిగా, ఓ మూలగా, వచ్చినప్పుడు ధీరజ్ ఏ కుర్చీలో కూర్చోనున్నాడో, యింకా అలాగే బుద్ధిగా, కదలకుండా కూర్చున్న మనోజ్ దగ్గరకొచ్చి అన్నది.

ఇంతలో "జ్వాల! విడిదింటి కెళ్తావా? పురోహితులవారు వెళ్ళమంటున్నారు!" ధీరజ్ లోపలికొస్తూ అన్నాడు.

జ్వాల, ధీరజ్ యిద్దరూ బైటికెళ్ళారు.

"జ్వాల! పెళ్ళికొడుకుని తీసుకురావడానికి కారు తీసికెళ్దాం. నడిపించడం ఏం బావుంటుంది?" ప్రతాప్ సందిగ్ధంగా అన్నాడు.

"ఏం? ఎందుకు బావుండదూ?" విసుగ్గా అన్నది.

"అతన్నడిగితే ఏం? కాదంటాడా?" ధీరజ్ అడిగాడు.

జ్వాల అయిష్టంగానే తలూపి, మనోజ్ దగ్గర కెళ్ళింది.

"మీ కారు కావాలి! పెళ్ళికొడుకును తీసుకు రావడానికి!"

"ఓ.! అలాగే! తీసికెళ్ళండి!" నవ్వుతూ అంగీకరించాడు.

విడిదికి కొందరిని పంపింతర్వాత, ధీరజ్, తనూ తినబోతూ, మనోజ్ గుర్తుకొచ్చి గదిలోకొచ్చింది.

"రండి. మనమే వున్నాం. అందరూ తినేసారు."

మనోజ్ మాట్లాడకుండా, జ్వాల వెనకే నడిచాడు. కాళ్ళకి నీళ్ళందించి, టవల్ యిచ్చి, అక్కడే నిల్చుంది. మనోజ్ చెయ్యి తుడుచుకుని, జ్వాల భుజంమీద వేసాడు. వేసింతర్వాత ఏమంటుందో నని జంకాడు. కాని జ్వాల అదేం పట్టించుకోలేదు. ఎప్పుడూ క్రింద కూర్చుని తినలేదేమో, యిబ్బందిగా, అటూ, యిటూ, కదిలాడు.

"మీ కెంత యిబ్బందిగా వున్నా, యిప్పుడు టేబుల్ మీల్స్ ఎరేంజ్ చెయ్యలేను!" మనోజ్ యిబ్బందిపడ్డం చూసి అన్నది. ధీరజ్ అప్పటికే పెరుగు కలుపుకుంటున్నాడు.

"జ్వాల యిలా తినటం బావుంది కదూ?" ధీరజ్ వెళ్ళిం తర్వాత, పక్కనే కూర్చున్న జ్వాలతో చిన్నగా అన్నాడు.

"అంతేగాక జ్వాల విస్తట్లో వున్న బజ్జీ అమాంతం తీసుకున్నాడు. జ్వాల అప్పటికే పెరుగు వేసుకుంది. మనోజ్ అలా తీసుకోగానే, వెంటనే విస్తరాకు మడిచి లేచింది.

"జ్వాలా!" తెల్లబోయి చూసాడు.

వెంటనే తనూ విస్తరాకు మడిచి జ్వాల వెనకే నడిచాడు. అనవసరంగా జ్వాలని తిన్నివ్వకుండా చేసాననే బాధ! తను మరీ

త్వరపడ్డానేమో అనే అనుమానం! వీటితో సతమతమవుతూ, పరాకుగా కూర్చున్నాడు. జ్వాల కాఫీ కప్పుతో వచ్చి, చిన్నగా నవ్వుతూ, "పాపం భోజనం సరిగా చేయనట్టుంది. కాఫీ త్రాగు," అంటూ కప్పు అందించింది.

ఆ తర్వాత పెళ్ళివాళ్ళు రావడంతో, జ్వాల కసలు తీరికే లేదు. ప్రతాప్, కెమెరా తెచ్చి, ఫోటోలు తీసేపని, మనోజ్ కప్ప గించాడు. జ్వాలకి తెలియకుండా, ఓ ఫోటో తీశాడు. పెళ్ళి యథా విధిగా జరిగిపోయింది. ఓ గంట తర్వాత అప్పగింతల కార్యక్రమం కూడా అయిపోయింది. తర్వాత అందరూ సుధీర్ వాళ్ళింటికి వెళ్ళారు. ఓ పదిమంది తప్ప యింకెవరూ లేరు. అందులో జ్వాల కూడా వుంది.

* * *

"ఆ రోజు 'రీలు' నా దగ్గరే వుండిపోయింది. ఇవిగో ఫోటోస్!" మనోజ్ కవరు చేతి కందించాడు.

"కూర్చోండి. బాగా వచ్చాయా?" పక్కనే చోటు చూపించింది.

మనోజ్ కూర్చోబోయాడు. జ్వాల అదే క్షణాన లేవ బోయింది. మనోజ్ ఆమె భుజంపై చేయివేసి నొక్కి, "ప్లీజ్!" అన్నాడు.

"ఎవరే అమ్మాయ్ వచ్చింది?" బామ్మగారు లోపలికొస్తూ అన్నది.

జ్వాల సమాధానం చెప్పకుండా ఛటుక్కున లేచి లోపలికి వెళ్ళింది.

"నువ్వా బాబూ! కూర్చో నాయనా!" పంచెని, నెత్తి మీదకు లాక్కుంటూ అన్నది.

ఋద్ధిగా కిటికీలో కూర్చున్నాడు.

"బామ్మా! పాలు పొయ్యిమీద పెట్టాను" జ్వాల వస్తూ చెప్పింది. బామ్మ లోపలకు వెళ్ళగానే "బావున్నాయా?" అని అడిగాడు మనోజ్.

"చాలా బాగున్నాయి. మీరు ఫోటోలు చాలా బాగా

తీస్తారల్లే వుండేదే?" ఒక్కొక్క ఫోటో చూస్తూ అన్నది.

"జ్వాల! రేపు నువ్వోసారి మా యింటికి రా. నీ జాబ్ విషయం మెహతాగారితో చెప్తే, రేపోసారి రమ్మన్నారు."

'అలాగే' నన్నట్లు తలూపింది.

"ఆఫీస్ ఎడ్రస్ చెప్పండి. అక్కడికే సరాసరి వస్తాను!"

"ఏం? మా ఇంటికి రాకూడదా?"

"......"

జేబులోనుండి డైరీ తీసి, చిన్న కాగితం చింపి, ఎడ్రస్ వ్రాసిచ్చాను.

"జ్వాల! యింక వెళ్తాను!"

"కాఫీ తీసుకుని వెళ్ళండి" లోపలికెళ్ళబోతూ అన్నది.

"ఊహు. ఇంకోసారి తీసుకుంటాను. వెళ్తున్నాను!"

* * *

అన్నట్లుగానే మరుసటి రోజు పదింటికే బైలేరింది. అర్థ గంటలో వస్తానని అనుకుంది. కాని మూప్పావుగంట పట్టింది.

"ఏంటింత ఆలస్యమైంది?" వెళ్ళగానే అడిగాను.

"బావుంది. నాకు నీలా కారులేదుగా? చాలా త్వరగానే బైలేరాను. బస్సందలేదు!" నుదుటపట్టిన చెమట తుడుచుకుంటూ అన్నది.

"నువ్విక్కడే కూర్చో. ఇప్పుడే వస్తాను!"

వెళ్ళిన పదినిముషాల కొచ్చాడు. "మెహతాగారు రమ్మంటున్నారు. వెళ్ళు!"

"నువ్వు రావా?"

"ఊహు. నిన్నే రమ్మన్నారు!"

ఏవో నాలుగయిదు ప్రశ్న లేసారు. రేపువస్తే జాయినవ్వొచ్చన్నారు. ఇంత తేలికగా జాబ్ వస్తుందనుకోలేదు. మనోజ్ లాటివాళ్ళు తల్చుకుంటే తనలాటి వాళ్ళకి ఓ పాతికమందికయినా ఈజీగా యిప్పించగలరు. చిన్నగా ప్రసాద్ విషయం, శాంతి విషయం కూడా మనోజ్ కి చెప్పాలి. అప్పటిదాకా మనోజ్ తో

ంచిగా వుండడం ఎంతయినా అవసరం! గట్టిగా మనస్సులో అనుకుని, మనోజ్ తో అతిమర్యాదగా వుండాలని నిర్ణయించుకుంది.

* * *

రోజుటలవాటుగానే, శాంతి ఆ రోజు క్లినిక్కి వెళ్ళింది. రూమ్ కి తాళం వేసుంది. ప్రక్కన వాళ్ళనడిగితే తెలియదన్నారు. మరుసటి రోజు ప్రొద్దున్న, సాయంత్రం వెళ్ళింది. ఐనా రూమ్ తలుపేసే వుంది. తాళంతీసిన గుర్తులుకూడా లేవు. తనకి చెప్పకుండా ధీరజ్ ఎక్కడికీ వెళ్ళడే! మరి ఊళ్లోనే వుంటే క్లినిక్ ఎందుకు తీయకుండా వుంటాడు? బహుశా ఇంటి దగ్గరుండొచ్చు. ఆ అనుమానంతోనే మరుసటి రోజు ప్రొద్దున్నే వెళ్ళింది. అక్కడ వాచ్ మన్ శాంతికో చీటీ యిచ్చాడు.

డియర్ శాంతి,

టెలిగ్రాం వస్తే నేను బొంబే వెళ్తున్నాను. మన విషయం కూడా అమ్మవాళ్ళతో మాట్లాడి వీలైనంత త్వరలో వచ్చేస్తాను.

నీ
ధీరజ్.

శాంతి వచ్చి వెళ్ళాక ఇరవై రోజులకు వచ్చాడు ధీరజ్. వచ్చిన రోజే వాచ్ మన్ శాంతి వాళ్ళింటికి వచ్చి చెప్పాడు.

శాంతి అప్పటికప్పుడే టాయిలెట్ అయింది. గులాబిరంగు చీర, అదే రంగు జాకెట్. తలలో ఒకపక్కగా గులాబిపువ్వు పెట్టుకుంది. చెవులకి జూకాలు, మెడలో గొలుసూ వేసుకుని బయలు దేరింది.

ధీరజ్ యింట్లోకి అడుగుపెట్టబోయిందల్లా హాల్లో సోఫాలో కూర్చున్న అమ్మాయిని చూసి నిల్చుండిపోయింది.

"ఎవరు కావాలండి?" సోఫాలోనుండి లేస్తూ అడిగింది. మర్యాద ధ్వనించిందా స్వరంలో.

"ధీరజ్ గారు!" తడబాటుగా చెప్పింది శాంతి.

"మా అన్నయ్య పైనున్నాడు. వెళ్ళండి."

శాంతికి కొత్తగా ఊపిరి అందినట్టయింది. గబగబా మేడ మెట్లెక్కి పైకి వెళ్ళింది. ధీరజ్ ని చూసి నిర్ఘాంతపోయింది.

"ధీరజ్! ఏంటలా వున్నావు?" ఆదుర్దాగా అడిగింది.

ఈ నెలరోజుల్లోనే చాలా చిక్కిపోయి, నల్లబడ్డట్టుగా కన్పడ్డాడు. షేవ్ చేసుకుని రెండు, మూడు రోజులైనట్టుంది. ధీరజ్ మాట్లాడలేదు.

శాంతి తలుపు గడియవేసి, వచ్చి ధీరజ్ ప్రక్కన కూర్చుంటూ "ఎందుకు అంత అర్జంటుగా యింటికి వెళ్ళాల్సి వచ్చింది?" అని అడిగింది.

"......"

"ఏమిటి ధీరజ్ మాట్లాడవూ? నాకు చెప్పవా ఏమైందో?" ప్రతిమాలుతూ అడిగింది.

"శాంతి నేనో సంగతి చెప్తాను. అది విని నువ్వు తట్టుకోగల గాలి" అన్నాడు ఎటో చూస్తూ.

"నీవు ప్రక్కనే వుంటే ఎంత 'షాకింగ్ న్యూస్' అయినా ఫర్వాలేదు. తట్టుకోగలను" ధీరజ్ భుజాలమీద తలాన్చి అంది.

ధీరజ్ తన భుజాల మీదినుండి శాంతి తలను మృదువుగా తొలగించి "మనం అనుకున్న విధంగా పెళ్ళి జరగబోవటం లేదు శాంతీ!" అన్నాడు. పక్కలో బాంబ్ పడినట్టయింది శాంతికి.

"ను... వ్వు... నువ్వనేది నిజమేనా?" అంది ఆమె దుఃఖంతో పూడిపోయిన కంఠంతో.

"ప్లీజ్ శాంతీ! నేను చెప్పేది విను!"

"నువ్వేది చెప్పినా నే నింకేం వినను. ఒక్కమాట చెప్పు. నీ విదివరకన్నావే, మా వాళ్ళ కిష్టం లేకపోయినా ఫర్వాలేదు. నా కిష్టమైతే చాలు 'రిజిష్టరు మ్యారేజి' చేసుకుందామని. ఆ మాటే ఇప్పుడను. మీ ఆస్తిలో చిల్లిగవ్వ లేకపోయినా ఫర్వాలేదు. నాకు నీవు కావాలి ధీరజ్... నీవు కావాలి" ధీరజ్ భుజాలమీద తల పెట్టి విలపిస్తూ అంది.

ధీరజ్ పెదవులనుండి ఒక్క మాట కూడా బైటికి రాలేదు.

"ధీరజ్! మాట్లాడు ధీరజ్, నిన్ను మోసం చేయనని, పెళ్ళి చేసుకుంటానని అన్నావు. నీవు లేకపోతే చచ్చిపోతాను ధీరజ్! నేను చచ్చిపోవడం నీ కిష్టమేనా?" ఏడుస్తూ అంది శాంతి.

ఆఖరిసారిగా ధీరజ్ పెదవి కదిపాడు.

"ఇప్పటికే ఒకసారి మోసం చేసాను. రెండోసారి కూడా అబద్దం చెప్పి మరోసారి మోసం చేయలేను. నాకు... నాకు... నాలుగు రోజుల క్రితం పెళ్ళయిపోయింది" గొంతు పెగుల్చుకుని చెప్పాడు.

ఆ మాటతో ధీరజ్‌ని చుట్టిన శాంతి చేతులు అప్రయత్నంగా విడిపోయాయి. ఏదో మాట్లాడబోయింది. మాట పెగిలి రాలేదు. గుమ్మం దగ్గరకి పోయి ఒక్కసారి వెనక్కి తిరిగి చూసింది. ఎప్పుడూ కళ్ళల్లో కళ్ళుపెట్టి చూడని శాంతి, ఈసారి ఎంతో ధైర్యంగా, మరెంతో తిరస్కారంగా చూసింది. అంటరాని వాడ్ని చూసి నట్లుగా చూసిన ఆ చూపుల ధాటికి తట్టుకోలేక యీసారి ధీరజే తలదించుకున్నాడు.

*            *            *

శాంతి చాలా నీరసంగా వుంది. నాలుగైదుసార్లు వాంతి కూడా చేసుకుంది. లేచే వోపిక లేక అక్కడే పడుకుంది.

"శాంతీ! ఏమిటి? ఒంట్లో బాగాలేదా! డాక్టర్ని పిల్చు కొస్తానుండు" శాంతి వాళ్ళమ్మ కంగారుగా డాక్టర్ దగ్గరకు బయలుదేరిబోయింది.

లేని వోపిక తెచ్చుకుని "ఏం లేదమ్మా! కొంచెం కడుపులో త్రిప్పింది. అదే తగ్గుతుందిలే!" అన్నదేగాని తనకి అనుమానంగానే వుంది. ఇవాళ కాకపోయినా, రేపైనా తను గర్భవతి అన్న సంగతి బయటపడేదే. తను ఎంత దాచిపెడ్తే మాత్రం ఈ సంగతి దాగుతుందా! అమ్మతో చెప్పాలి. ఇంతవరకూ తల్లికి చెప్పకుండా తనలో తనే కుమిలిపోతుంది. కానీ... ఎన్నాళ్ళు తల్లితో చెప్ప కుండా వుంటుంది? ఆఖరికి తల్లితో చెప్పింది.

"ఏమిటే నువ్వనేది? నిజమేనా?" నమ్మలేనట్లుగా చూసింది.

"......"

"అతనెవరు?"

"ఎవరైతేనేం? అతనికి పెళ్ళయిపోయింది" నిస్పృహగా అంది శాంతి.

"ఛీ! ఎంత పని చేశావే? పాపిష్టిదానా!" అంటూ ఆమె శాంతి జుట్టు పట్టుకుని చెంపమీద కొట్టబోయింది. అంతే! గుండెని చేత్తో పట్టుకుని అక్కడే పడిపోయింది.

"అమ్మా! అమ్మా!" శాంతి కంగారు పడిపోతూ తల్లిని కుదిపి చూసింది.

ఆమె నోటివెంట మాట లేదు. బరువుగా శ్వాస పీలుస్తోంది.

"తాతయ్యా! అమ్మ పడిపోయింది. కొంచెం చూస్తూండు" ఏడుస్తూ చెప్పి డాక్టరుకోసం బయలుదేరింది.

అక్కడికి దగ్గరలోవున్న డాక్టరు ధీరజ్ ఒక్కడే. అక్కడికే పోయింది. దగ్గరగా వేసున్న తలుపుల్ని నెమ్మదిగా నెట్టింది. లోపల ధీరజ్ ఒక్కడే వున్నాడు. కుర్చీలో కూర్చుని, తలని ముందున్న టేబిల్ మీద పెట్టి పడుకునున్నాడు.

"డాక్టర్."

ధీరజ్ తలెత్తి శాంతివంక ఆశ్చర్యంగా చూశాడు.

"డాక్టర్! అమ్మకి గుండెల్లో నొప్పి వచ్చింది. అర్జంటుగా రావాలి" అంది శాంతి ఎలాగో. అంతే!

ధీరజ్ గబగబా మెడికల్ బ్యాగ్ తీసుకుని శాంతివెంట నడిచాడు.

"బాబూ! ఫర్వాలేదా?" శాంతి తాతగారు ఆదుర్దాగా ప్రశ్నించాడు.

"ఫర్వాలేదండి!" వినయంగా అని "శాంతి ఎక్కడ?" చుట్టూ చూస్తూ అడిగాడు.

"గదిలో వున్నట్టుంది బాబూ! పిచ్చిపిల్ల, గుండె నొప్పన గానే భయపడినట్టుంది. కొంచెం ధైర్యం చెప్పయ్యా!"

ధీరజ్ గదిలోకి వెళ్ళాడు. అక్కడే కళ్ళు మూసుకుని తలుపు నానుకుని నిల్చుంది. శాంతి కళ్ళంబడి నీళ్ళు చెక్కిళ్ళమీదుగా జారి క్రింద పడుతున్నాయి. అతి కష్టంమీద ఏడుపు నాపుకుని, లోలోపలే వెక్కిళ్ళు పెడుతోంది.

"శాంతీ!" ధీరజ్ దగ్గరగావెళ్ళి పిల్చాడు.

"ధీరజ్" ఒక్కంగలో వచ్చి ధీరజ్ కాళ్ళమీద పడింది.

"ధీర...జ్ నేను నిన్నేమీ కోరను. మా అమ్మను బ్రతికించు ధీరజ్. లోకంలో నా...నాకుంది అమ్మ ఒక్కతే. మీ అమ్మాయిని ప్రేమించింది నేను. పెళ్ళి చేసుకుంటానని అమ్మతో చెప్పు. నీవు...నీవు నిజంగా నన్ను పెళ్ళిచేసుకోనక్కరలేదు. కనీసం... అమ్మ ... బ్రతికేందుకైనా అలా చెప్పండి ... డాక్టర్ ... అలా చెప్పండి" ఎంతో దీనంగా తన రెండు పాదాలను అభిషేకం చేస్తున్న శాంతిని చూడలేకపోయాడు.

"శాంతీ! అలానే చెప్తాను. ముందు నువ్వు లే!" బలవంతంగా శాంతి భుజాలను పట్టుకుని లేవదీసి మంచంమీద కూర్చోబెడ్తూ భారంగా అన్నాడు.

ఈ సంగతి తెల్సి చుట్టుప్రక్కలవాళ్ళు వచ్చారు. అప్పుడే జ్వాల, ప్రతాప్ అందరూ వచ్చారు.

"ధీరజ్ గారు" జ్వాల బైటికి పిల్చింది.

"రెండురోజులు గడిచాక గాని ఏ సంగతీ చెప్పలేను జ్వాలా! బి. పి. సడెన్‌గా రైజయింది" చిన్నగా చెప్పాడు.

జ్వాల ఏం మాట్లాడలేదు. మెదలకుండా ఎటో చూస్తూ కూర్చుంది. ఆరోజంతా శాంతి తల్లికి తెలివి రాలేదు. స్పగతగా పడుకునుంది. ధీరజ్ మంచంప్రక్కనే కూర్చుని మాటిమాటికి బి. పి. చూస్తూ, యింజక్షన్స్ యిస్తున్నాడు. మరుసటిరోజు తెలివి రాకుండానే మరో స్ట్రోక్ వచ్చింది. అంతే! శాంతి తల్లికి కాలం తీరిపోయినట్టయింది.

"ముసలాయన పోతాడనుకున్నాం గాని, ఈమె యింత త్వరగా పోతుందనుకోలేదు" ఇరుగుపొరుగువాళ్ళనుకుంటున్నారు.

శాంతి ఏడ్చి, ఏడ్చి అలానే శూన్యంలోకి చూస్తుండి పోయింది.

"ధీరజ్ గారూ! ఒకసారిలా వస్తారా?" కొంచెం దూరంగా వున్న ప్రతాప్ పిల్చాడు.

"ఏమిటి?"

"ఇంక ఆ ఏర్పాట్లన్నీ చూడొద్దూ!"

శవాన్ని దహనంచేసి వచ్చేసరికి దాదాపు పన్నెండుగంటలు

వాటించి. ప్రతాపే చితికి నిప్పంటించాడు. జ్వాల వంటచేసి అంద రికీ వడ్డించింది. ధీరజ్ కూడా మధ్యాహ్నందాకా అక్కడే వుండి, వెళ్ళేటప్పుడు జ్వాలకు చెప్పి వెళ్ళాడు. కోడలి చావుతో జ్వాల తాతగారు మంచం పట్టారు. అందుకని ధీరజ్ తప్పనిసరిగా రోజూ వచ్చేవాడు. గంటో, గంటన్నరో ఆయన మంచం దగ్గరనే కూర్చుని ఆ మాటా, యీ మాటా మాట్లాడేవాడు. శాంతిమాత్రం ధీరజ్ ఎంతసేపున్నా యివతలకి మాత్రం వచ్చేది కాదు. ధీరజ్ వచ్చే వేళకే ముందే లోపలుండేది. ధీరజ్ ఏమైనా మందులు వ్రాసిస్తే, ఆ చీటీని అక్కడపెట్టి వెళ్ళిపోయేవాడు. తర్వాత నెమ్మదిగా వచ్చి ఆ చీటీని తీసుకుని మందులు తెచ్చేది.

ఆ రోజు...

ధీరజ్ రోజుటికన్నా రెండుగంటల ముందరే వచ్చాడు. శాంతి తాతగారి మంచం దగ్గరనే కూర్చుని ఏదో చదివి విన్పిస్తుంది. అతన్ని చూడగానే లోపలకి వెళ్ళిపోయింది.

"నిన్న వేసుకోమన్న టాబ్లెట్ వేసుకున్నారా?" యింజక్షన్ యిస్తూ అడిగాడు.

"ఏం టాబ్లెట్లో బాబూ. ఎలాగూ పోయే ప్రాణమే."

"నా మీద నా కెప్పుడూ దిగులులేదు బాబు. శాంతిని చూస్తుంటేనే కడుపు తరుక్కుపోతుంది. పెళ్ళి చేసుకుని పిల్లా, పాపల్తో కళకళలాడ్తూ వుండాల్సింది. ఇలా దిక్కులేండైంది. నేను... ఇంకెన్నాళ్ళుంటాను బాబూ. ఇవాళో, రేపో పోయే వాడ్నే. దాని పెళ్ళి వాళ్ళమ్మెలాగూ చూడలేకపోయింది. కనీసం నేనున్నప్పుడే ఐనా దానికో గీతరాసిపెట్టి వుందో... లేదో!"

"......" ధీరజ్ మాట్లాడకుండా వూరుకున్నాడు.

"బాబూ! నీ కెరుకలో ఎవరైనా మంచి కుర్రాళ్ళుంటే చూడు. బుద్ధి మంచిదై ఏదో నాలుగు రాళ్ళు సంపాదించుకుంటే చాలు. పెద్ద, పెద్ద సంబంధాలు చూడడానికి దానికి తగ్గట్లుగా మనం కట్నం ఇవ్వలేముగా!...

"......"

"ఏం బాబూ! ఎవరైనా వున్నారా?"

"ఉన్నారండి!"

"ఈసారి వచ్చినపుడు వాళ్ళని తీసుకొచ్చి నాకు, శాంతికి చూపించు. ఆ అబ్బాయికి కూడా నచ్చితే మిగతా సంగతులు తర్వాత మాట్లాడుకుందాము. ఏమంటావు?"

"అలాగేనండి! రెండు, మూడు రోజుల్లో తీసుకురావడానికి ప్రయత్నిస్తాను."

"వెళ్ళొస్తానండి."

"కొంచెం కాఫీ తీసుకుని వెళ్దువుగాని! అమ్మాయ్! శాంతీ! డాక్టర్ గారికి కొంచెం కాఫీ తీసుకురామ్మా" లోపలకు చూస్తూ కేక పెట్టాడు.

ధీరజ్ రెండు మూడు నిముషాలున్నాడు, కాఫీ వంకనైనా శాంతితో మాట్లాడదామని. వచ్చే సూచనలు లేకపోయేసరికి బ్యాగ్ తీసుకుని గబగబా బైటికి దారితీశాడు.

ధీరజ్ మనసులో రమేష్ మెదిలాడు. చదువుకున్నవాడు. అందం కూడా ఫరవాలేదు. బాగానే వుంటాడు. తన మూలంగా శాంతి జీవితం నాశనం కావడానికి వీల్లేదు. తనెలాగైనా జీవించ గలడు కాని, ముందు, ముందు జీవితంలో శాంతికి తోడు ఎంతో అవసరం. ఎలాగైనా, బలవంతంగానైనా సరే శాంతిని పెళ్ళి వొప్పించేట్లు చేయాలి. మనసులో దృఢంగా అనుకుని నిద్ర పోయాడు.

* * *

మరుసటి రోజు ధీరజ్ రమేష్ దగ్గరకు వెళ్ళాడు. రమేష్ చెట్లకు బోదెలు తయారుచేస్తున్నాడు.

"రమేష్ చేయికడుక్కుని రా! నీతో మాట్లాడాలి!"

"ఏంటిది?" చేతులు టవల్ కు తుడుచుకుంటూ పాకలోకి దారితీస్తూ అడిగాడు.

అక్కడే మిగతా ఫ్రెండ్స్ ముగ్గురూ కూడా వున్నారు.

"రమేష్ రేపొద్దివారం ఒకళ్ళింటికి తీసుకెళ్తాను. తప్పకుండా రావాలి" అన్నాడు.

ఆ మర్నాడు నలుగురు ఫ్రెండ్స్‌ని తీసుకుని శాంతి వాళ్ళింటికి

తీసుకెళ్ళాడు.

జ్వాల, శాంతి అక్కడే కుర్చీల్లో కూర్చుని ఏదో మాట్లాడు కుంటున్నారు. అంతమంది తమింటికి ఎందుకు వచ్చారో తెలియక అర్థంకానట్లు చూసింది శాంతి.

"శాంతి! ఇతను రమేష్ ఎమ్. ఎస్. సి., వీడు శంకర్, వీళ్ళు రాము, ఠవి. నాతోపాటే ఎమ్. డి. చేస్తున్నాడు" పరిచయం చేశాడు ధీరజ్.

"నమస్తే!"

"ఈమె జ్వాల!" ఫ్రెండ్స్ నలుగురికీ పరిచయం చేశాడు. ఈలోగా ధీరజ్ కోసం "డాక్టరుగారూ!" అంటూ ఎవరో కుర్రాడు వచ్చాడు. నిజానికి, వారందరి మధ్యనుండి అవతలకు వెళ్ళేందుకు ఆ కుర్రాడిని ధీరజే ఏర్పాటు చేసుకున్నాడు. "ఇప్పుడే వస్తాను" అని చెప్పి, అతడు అక్కణ్నించి తప్పుకున్నాడు.

దారిలో వచ్చేటప్పుడే ధీరజ్ చెప్పాడు శాంతి సంగతి.

"బ్రదర్స్! ఇప్పుడు మనం వెళ్ళేది శాంతివాళ్ళ యింటికి. కొద్దిరోజుల క్రితమే వాళ్ళమ్మగారు చనిపోయారు. మీ మాటలతో శాంతి దిగులును కొంతవరకూ మర్చిపోతుందని మిమ్మల్ని తీసుకు వెళ్తున్నాను."

రమేష్ మహా చొరవ మనిషి. ఒకసారి పరిచయమైతే చాలు. అందులో ధీరజ్ చెప్పిన విషయం మనసులో వుంచుకున్నాడేమో. శాంతిమీద తన ప్రజ్ఞా పరంపరతో కవ్వించి, నవ్వించి, తెగ మాట్లాడించాడు.

నిజంగానే శాంతి ఆ కాస్సేపూ బాధని మర్చిపోయింది.

ఒక గంట గడిచాక ధీరజ్ తిరిగి వచ్చాడు. శాంతి అందరికీ కాఫీ యిచ్చింది.

"మీరిచ్చిన కాఫీ చాలా బాగుందండీ! నిజంగా అమృతం లానే వుంది. బహుశా పంచదార ఎక్కువగా వేసివుంటారు" రమేష్ నవ్వుతూ చూశాడు శాంతివైపు.

"అప్పుడప్పుడూ వస్తూండండి" వాళ్ళంతా లేచినపుడు అంది.

"అబ్బే! ఎప్పుడూ మేమే వస్తే మాకు విలువ ఏముందండీ,

అసలే నిరుద్యోగులం. మీరు వస్తేనే మళ్ళీ మేము వచ్చేది."

"ఆల్ రైట్! మేము ఆదివారం వస్తాం" అంది జ్వాల.

"అలా అయితే తొమ్మిదింటికల్లా రెడిగా వుండండి. నే నొచ్చి తీసికెళ్తాను" రమేష్ శలవు తీసుకుంటూ చెప్పేడు.

* * *

రమేష్ అన్నట్లుగానే ఆదివారం వచ్చాడు. జ్వాల, ప్రతాప్ అప్పటికే శాంతివాళ్ళింటికి వచ్చారు.

ప్రతాప్‌కి, రమేష్‌కి పరిచయం చేసింది జ్వాల.

"ఇంక వెళ్దామా?" శాంతి రాకకోసం లోపలకి చూస్తూ అన్నాడు రమేష్.

"పదండి!" శాంతి వస్తూనే అన్నది.

దాదాపు మూడు బస్సులు మారి, కాలి నడకతో బయలు దేరారు.

"ఇంకా ఎంత దూరం?" అంది జ్వాల నవ్వి.

"అదుగో! దూరంగా కన్పించడం లేదూ? అవే మా నివాస స్థలాలు" వేలుపెట్టి చూపెడ్తూ అన్నాడు రమేష్.

వెళ్ళగానే అందరికీ వేడివేడి కాఫీ యిచ్చారు. రెండు నిట్రాళ్ళ పాకేగాని, క్రింద బండలు పరిచి అతి శుభ్రంగా వుంది. దాదాపు డజను కుర్చీలు, నాలుగు టీపాయ్‌లు వున్నాయి. అతి ప్రశాంతంగా వుంది. సిటీ హోరుకి అలవాటయిన వాళ్ళు అక్కడో నిముషంకూడా వుండలేరు. వాళ్ళక్కడ ఎందుకున్నారో కూడా అర్థం కాలేదు.

టేప్ రికార్డర్‌లోనుండి హోరెత్తే సంగీతం తప్ప యింకే విధమైన శబ్దాలూ లేవు. కాని ధీరజ్ ఫ్రెండ్స్ మాత్రం వచ్చిం దగ్గరనుండి క్రొత్తా, పాతా లేకుండా, పోటీలు పడ్డట్లుగా, మళ్ళీ మాటలు వినడానికి మాకెవరూ దొరకరన్నట్లుగా ఒకటే వాగే స్తున్నారు.

రమేష్ జ్వాలనీ, శాంతినీ, ప్రతాప్‌నీ తీసుకుని పొలాలవైపు నడిచాడు.

"ఇవన్నీ మా పొలాలు! ఇటువైపు చూసారా? ఇక్కడంతా

ఆకుకూరలు, కూరగాయలు వేశారు. ఆధునాతన పద్ధతుల్లో వ్యవసాయం చేస్తున్నాము. ఈ వైపు పూలతోట వుంది. పెద్దదేం కాదుగాని చాలా రకాలున్నాయి!" పూలతోటవైపు దారితీస్తూ అన్నాడు.

"ఇక్కడ కూర్చుందామా!" చిన్న నీటి మడుగుదగ్గర వున్న బండలవైపు చూపెడ్తూ అడిగాడు ప్రతాప్.

"ఇదంతా మేము కష్టపడి, స్వయంగా నిర్మించుకున్న స్వర్గం!"

నిజంగానే స్వర్గంలానే వుంది. ఎటు చూసినా విరగబూసిన పూలచెట్లే. ఓ పద్ధతంటూ లేకుండా వేశారు. గులాబీ ప్రక్కనే మందారం, దాని ప్రక్కనే నందివర్ధనం యిలా అన్నిరకాలు వున్నాయి. స్వచ్ఛమైన, ఆరోగ్యమైన గాలి, మత్తెక్కించే సువాసనలతో తేలివస్తూంది.

"స్వంత పొలమా? లేక కౌలుకి తీసుకున్నారా?" జ్వాల అడిగింది.

కొన్ని నిముషాలు దూరంగా చూస్తూ వూరుకున్నాడు. తర్వాత "మాదే పొలం!" అన్నాడు.

"ఇంత చదువూ చదివి యిలా చేయడం...," ప్రతాప్ మాటలను మధ్యలోనే త్రుంచివేస్తూ,

"నేనూ, శంకర్ మాతోపాటే యింకో యిద్దరు చాలా కాలం నిరుద్యోగులుగా వున్నాం. ఎన్నో అప్లికేషన్స్ పెట్టాం. కొన్ని ఇంటర్వ్యూలకి కూడా వెళ్ళాము. వచ్చినట్లే వుండేది, అంతలోనే మరెవరికో వచ్చేది. అందరూ విసిగిపోయాం.

అప్పుడనిపించింది. ఉద్యోగాలకోసం తిరిగేకన్నా ఏ బంజరు భూమైనా సాగుచేస్తే నయమని. ఐడియా రావటం ఏమిటి_ఎక్కడ భూమి సాగులేకుండా పడివుందా అని వెదికాం. ఇక్కడ కనిపించింది. ఈ భూమి ఎవరిదై వుంటుందోనని ఆచూకీ తీయగా, గవర్నమెంటు పోరంబోకు అన్నారు. వెంటనే మేమంతా కలిసి ఓ మహజరు పడేశాం _ సెల్ఫ్ ఎంప్లాయిమెంట్ స్కీమ్ క్రింద! వెంటనే సాంక్షనయింది. ఈ బీడుని బాగు చేయాలంటే చాలా కష్టమన్పించింది మొదట. అయినా ధైర్యంతో యింతకన్నా చేయ

టానికి ఏముందన్న నిస్పృహాలో ఏర్పడ్డ మనోబలంతో పని మొదలు పెట్టాము. సరిగ్గా సంవత్సరం క్రితం యిది జరిగింది. ఇప్పుడు చూడండి! ఎలా వుందో! ప్రతి ఆదివారం కొంతమంది ఫ్రెండ్స్ అయినా వస్తుంటారు. ఆరోజు చాలా సరదాగా గడిచిపోతుంది. ఎక్కువగా ధీరజ్ ప్రతి ఆదివారం వస్తుంటారు. మాకారోజు పండగలానే వుంటుంది" అన్నాడు రమేష్ నవ్వుతూ.

జ్వాల, శాంతి రమేష్ చెప్పిన విషయాల గురించే ఆలోచిస్తున్నారు. వాళ్ళకి తమ బజ్జీల వ్యాపారం మనస్సులో మెదిలింది. మొత్తం అంతా ఒకగూటి పక్షులైనందుకు జ్వాలకీ, శాంతికీ రమేష్ బృందంమీద ఆత్మీయత ఏర్పడసాగింది.

వాళ్ళంతా వెళ్ళిపోయాక ధీరజ్ రమేష్ దగ్గరకొచ్చాడు.

"రమేష్! శాంతి బాగా మాట్లాడిందా?"

"బాగానే మాట్లాడింది. మా సెల్ఫ్ ఎంప్లాయిమెంట్ ప్లాన్ ఆమెను ఉత్తేజపరిచినట్టు కనిపించింది" అన్నాడు.

శాంతిపై రమేష్ అభిప్రాయం అడుగుదామనుకున్నాడు. కాని ఎందుకైనా మంచిది, ముందర శాంతినే అడుగుదామనుకున్నాడు.

తర్వాత నాలుగు రోజులకు వెళ్ళాడు శాంతి వాళ్ళింటికి. వంటింట్లో వున్నట్లుంది. బెరుగ్గానే లోపలకు వెళ్ళాడు. అవతలగా కూర్చుని ఏదో చదువుతుంటుందల్లా అడుగుల చప్పుడుకి తలెత్తి చూసింది.

"ఏంవిటి?"

"శాంతి! కూర్చో! నీతో మాట్లాడాలి!" తనూ కూర్చుంటూ అన్నాడు.

శాంతి చెప్పేదేదో వింటానికన్నట్లుగా అటుతిరిగి కూర్చుంది.

"శాంతి."

"......" ఏమిటన్నట్లుగా చూసింది.

"రమేష్‌పై నీ అభిప్రాయం?" కొంచెం చిన్నగా అడిగాడు.

"బజార్లో చూసిన ప్రతి మొగాడిపైన అభిప్రాయాలు ఏర్పరుచుకోవడానికి నాకేం పనిలేదనుకుంటున్నావా?" కొంచెం

తీవ్రంగానే అడిగింది.

"అది కాదు... శాంతీ! నీ కిష్టమైతే రమేష్ పెళ్ళిచేసుకుంటాడు!" భయపడ్తూనే అన్నాడు.

"ఛీ! సిగ్గులేకపోతేసరి! అలా అడగడానికి! నువ్వు అమ్మాయిల్ని మార్చినట్లుగా, నేను కూడా రోజుకో అబ్బాయిని మారుస్తాననుకుంటున్నావేమో! నేనేం నీలా జులాయిగా తిరిగేదాన్ని కాదు. మాకు పరువూ, మర్యాదలున్నాయి. అలా ఒకళ్ళని ప్రేమించి, మరొకళ్ళని పెళ్ళాడ్డం మా ఇంటా వంటా లేవు!"

"శాంతి!" పళ్ళబిగువున పిల్చాడు.

"......" నిరసనగా చూసింది శాంతి.

"నేను చేయరాని తప్పే చేశాను. ఒప్పుకుంటున్నాను. నేనే పరిస్థితుల్లో ఇంకోమ్మాయి మెడలో తాళికట్టానో నీకు చెప్పినా అర్థంకాదు. నా తప్పు వలన ఇంకొకళ్ళ జీవితం నాశనం అవుతుందనే నా బాధ" ఎంతో బాధగా అన్నాడు.

"ప్రేమించేటప్పుడు, ప్రేమించిన అమ్మాయిని మోసం చేసేటప్పుడు ఆ పరిస్థితులేం గుర్తుకు రాలేదు కాబోలు!" వెటకారంగా అని, "ఐనా నీవు ఒకరి జీవితాన్నే నాశనం చేశావనుకుంటున్నావేమో! ఒక మనిషి నిండు ప్రాణాన్ని బలికొన్న పశువ్వి!" ఎన్నిరోజులనుండో అణచుకున్న ద్వేషాన్ని ఒక్కసారిగా వెళ్ళగ్రక్కింది.

"శాంతీ... నేను... నేను. చంపానా మీ అమ్మని?" ఎంతో ఆశ్చర్యంగా, మరెంతో బాధతో విలవిల్లాడిపోతూ అడిగాడు.

"ఓహో! కత్తితో పొడిచి చంపితేనే చంపినట్లు కాబోలు నీకు. నీ మూలంగా కదూ అమ్మ చచ్చిపోయింది! తన కూతురు పెళ్ళి కాకుండానే, గర్భవతి అని తెలిసి ఎంతో ఆవేశంతో, మరెంతో కోపంతో నామీద చెయ్యి చేసుకోబోయింది. ఆ ఆవేశంలోనే కదూ! అమ్మకి గుండెనొప్పి వచ్చి చచ్చిపోయింది. నీవే గనక నా జీవితంలో తటసపడకపోయినట్లైతే ఎంత బాగుండేది? ఎంతో సంతోషంతో వుండవలసిన సమయంలో, యింత బాధ ననుభవిస్తున్నాను నీ ధర్మమా అంటూ!" వెటకారంగా ఫరజ్

వైపు చూసింది.

ధీరజ్ అప్పటికే వెళ్ళిపోయాడు. "నీవే చంపావు మా అమ్మని" శాంతి ఏడుస్తున్న కంఠం చెవుల్లో గింగురుమంటూంది. భగవాన్, నా వలన... ఒక మనిషి చనిపోయింది. తనకు ఊహ తెలిసినప్పటినుండి ఒకళ్ళ కష్టాల్లో ఆదుకోవడం తప్ప ఒక్కళ్ళనీ బాధపెట్టి ఎరగడు. తన మూలంగా శాంతి పెళ్ళికాకుండానే గర్భవతైంది. నిజంగా... తనెంత దుర్మార్గుడు? బెడ్ మీద పడుకుని దిండుని ముఖానికి రుద్దుకుంటూ విలపించాడు.

* * *

"ఎక్కడికి కెళ్దాం?"

"నీ ఇష్టం!"

"ఇవాళ మూడ్స్ బావున్నట్లుందే!" నవ్వుతూ అని, ఫైల్స్ వెనక్కి నెట్టేసి, కోటు తీసుకుని బైటికి దారితీసాడు మనోజ్. అతడివెనక బయలుదేరింది జ్వాల.

ఇద్దరూ టిఫిన్, కాఫీ హోటల్లో తీసుకున్న తర్వాత, ద్రాక్షతోటలకి తీసుకెళ్ళాడు.

"ఊ! ఇప్పుడు చెప్పు!" బంగళా బైట ఒత్తుగా పెరిగిన గడ్డిలో కూర్చుంటూ అన్నాడు.

"నువ్వో సాయం చెయ్యాలి" అంది జ్వాల.

"......" ప్రశ్నార్థకంగా చూసాడు.

"శాంతికి వున్నపళంగా జాబ్ ఇప్పించాలి!"

మనోజ్ ముఖం చిట్లించాడు.

జ్వాల ఇంకేం మాట్లాడలేకపోయింది, మనోజ్ ముఖాన్ని చూసి.

"నేన్నిను, వుద్యోగా లిప్పించే కల్పవృక్షంలా తప్ప, మరోలా కన్పించను కాబోలు!" నిష్ఠూరంగా అన్నాడు.

"కల్పవృక్షంలా, కామధేనువులా, ఐరావతంలా..." చిలిపిగా నవ్వుతూ అన్నది జ్వాల.

"ఇంకా నయం! వరాహంలా అన్నావు కాదు!" నవ్వుతూ పూర్తిచేసాడు.

జ్వాల పెద్దగా నవ్వేసింది. జ్వాల నవ్వుతుంటే, చిన్నగా, రేఖలా కన్పించే కళ్ళనీ, ఎర్రనవుతున్న చెక్కిళ్ళనీ, ముక్కునీ, సాగదీసినట్లున్న పల్చటి పెదవుల్నీ, తెల్లటి తీరైన పలువరసల్నీ చూస్తున్నాడు. జ్వాల నవ్వు ఎదటివాళ్ళని పిచ్చివాళ్ళని చేసేలా వుందని మొదటిసారిగా అనుకున్నాడు. అది తెలిసే జ్వాల నవ్వదేమో? నిజంగా జ్వాల నవ్వుకి దాసోహం అనాలన్పిస్తుం దెవరికైనా. ఎంత అందంగా ఆకర్షణీయంగా వుంది. అలాగే కళ్ళార్పకుండా తనవైపు చూస్తున్న మనోజ్ ని చూసి, తెల్లబోయి కవ్వించే నవ్వా పేసింది.

"బావుంది!"

"ఏంటి?" ఆశ్చర్యంగా అడిగింది.

"ఏదోలే! ఇంకా నువ్వు చెప్పాల్సిందేదయినా వుందా? ఇంకెవరికయినా వుద్యోగాలు కావాలా?"

"మా ప్రసాద్ కూడా కావాలి!" తటపటాయిస్తూ అడిగింది.

"మీ ప్రతాప్ కొద్దా?" సీరియస్ గా అడిగాడు.

"ఊఁ! కావాలి. కాని యీ సంవత్సరం తర్వాత కదా?" వుత్సాహంగా అన్నది.

"మీ ధీరజ్ కో?"

జ్వాల మళ్ళీ పెద్దగా నవ్వింది.

"ధీరజ్ మాలా ఉద్యోగం కోసం యింకొకర్ని అడగాల్సిన పన్లేదు!"

"ఎందుకని?"

"ధీరజ్ వాళ్ళ బంగళా చూస్తే, నువ్విలా అడిగేవాడివి కాదు! నువ్వూ నేనూ ఊహించనంతటి భాగ్యవంతు డతడు."

"అయితే శాంతికి జాబ్ చెయ్యాల్సిన అవసరమేంటి?"

"అంటే?"

"నీకు తెలీదా? ధీరజ్, శాంతి ఒకటి, రెండుసార్లు తాజ్ లో వున్నారు! వారిద్దరూ ప్రేమికులని చాలామందికి తెలుసు."

జ్వాల ఆలోచిస్తూ చాలాసేపు మౌనంగా వుండిపోయింది.

"ఎంత సేపా చీకట్లో వుంటారు? లోపలికి రండి!" హఠాత్తుగా కిరణ్ కంఠం విన్పించడంతో, మనోజ్ వులిక్కిపడి చూసాడు.

"జ్వాల వెళ్దాం రా" చెయ్యిపట్టుకుని లేవదీస్తూ అన్నాడు. జ్వాల యాంత్రికంగా, మనోజ్‌తో నడిచింది. మనోజ్ అన్నదానికి, తన వూహని జోడిస్తూ తేలిగ్గానే అన్సరొచ్చింది. కాని, ధీరజ్ లాటి కోటీశ్వరుడి ఏకైక సుపుత్రుడు శాంతిని చేసుకుంటాడు అంటే అనుమానమే. కాని ధీరజ్‌లో ధనంతో వచ్చే అహంకారపు ఛాయలేవీ లేవు. చాలా మామూలుగా, అతి తేలిగ్గా తమలో కలిసి పోయాడు. అంతమాత్రాన ధీరజ్, శాంతిని చేసుకుంటాడా? వీళ్ళిద్దరి పరిచయం ఎంతదూరం వెళ్ళిందో? ఒక్కసారన్నా ఇద్దరూ తనతో అనలేదే? శాంతయినా తనతో ఎందుకన్లేదో?

"వెల్‌కమ్ మిస్టర్ అండ్ మిసెస్ మనోజ్!" రవి ఆహ్వానించాడు.

మనోజ్ కంగారుగా జ్వాలని చూసాడు. జ్వాల విన్నట్లుగా లేదు. బ్రతికిపోయాను! లేకపోతే ఎంత హంగామా చేసేదో?

"మనో! కమాన్!" అప్పటికే సిప్ చేస్తున్న వాళ్ళు పిలిచారు.

మనోజ్, కంతమందెక్కడికెలా వచ్చారో అర్థం కాలేదు. తనకి తెలీకుండా ఏదయినా పార్టీ ఆరేంజ్ చేసుకున్నారా! వూహు! తనకు తెలియకుండా ఎందుకు చేస్తారు? అసలు, తనిక్కడున్నట్లు వీళ్ళకెలా తెలుసు? జ్వాలతోపాటు తననే ఫూల్ చేసేలా వున్నారు.

"జ్వాల! ఇక్కడ నువ్వేదీ టేస్ట్ చెయ్యకు!" మనోజ్ జ్వాల చెవిలో గొణిగినట్లుగా అన్నాడు.

జ్వాల అర్థంకాని దాన్లా చూసింది.

మనోజ్ వెంటే నడిచి, అతని పక్కనే కూర్చుంది.

"ఇక్కడ పార్టీ వున్నట్లు నాకు చెప్పలేదేం?" చిన్నగా అడిగింది.

"......"

"ఏ సందర్భంగా ఇస్తున్నారు?"

అప్పటికే మనోజ్ మాట్లాడక పోవడంతో, వింతగా చూసింది. తనెలా ఆశ్చర్యపోతుందా! మనోజ్ ముఖంలో కూడా అంతే ఆశ్చర్యం కొట్టొచ్చినట్లుగా కన్పిస్తుంది. సున్నితమయిన సంగీతంతో పాటు, గ్లాసుల గలగలలు మృదు, మధురంగా విన్పిస్తున్నాయి.

సర్వర్ వాళ్ళముందు కూడా గ్లాసుల్తో పాటు మిగతా సరంజామా అంతా పెట్టి వెళ్ళాడు.

మౌనంగా మనోజ్ గ్లాసుల్లోకి వంచి, ఐస్ క్యూబ్స్ వేశాడు. జ్వాల గ్లాసుని చేతిలోకి తీసుకుని దానివైపు దీర్ఘంగా చూసింది. అందంగా వున్న నీలం గ్లాసు, దాన్లో తేనెరంగు ద్రవంమీద నిశ్చలంగా తేలుతున్న ఐసు ముక్క! అందరూ అంటే త్రాగేవాళ్ళెప్పుడూ అంత దీర్ఘంగా చూసి వుండరు! లేకపోతే అంత అందంగా కన్పిస్తున్న దృశ్యాన్ని క్షణంలో ఎలా మాయం చేస్తారు. తనకయితే ఎంచక్కా అయిసుముక్క ఒకటి కరిగిపోగానే ఇంకోటి వేస్తూ అలాగే చూడాలన్పిస్తుంది.

"జ్వాల! కమాన్! హేవిట్!" కిరణ్ అతి మర్యాదగా టేబుల్ దగ్గరకొచ్చి అన్నాడు.

తలెత్తి సూటిగా అతనివైపు చూసింది.

"జ్వాల! ఇప్పటినుండే ఇలాటివి అలవాటు చేసుకుంటే ముందు, ముందు చాలా వుపయోగం!" రవి యీవైపుకొచ్చి అన్నాడు.

చిత్రంగా ఇద్దర్నీ మార్చి మార్చి చూసింది.

"ఇవేళ మీరు టేస్ట్ చెయ్యాలి. తప్పదు!" నవ్వుతూ అన్నాడు కిరణ్.

"జ్వాల మనోజ్ వైపు చూసింది. మనోజ్ నిస్సహాయంగా చూసాడు. అంతమంది ముందు తనేం చెప్పగలడు? చెప్తే మాత్రం ఏం బావుంటుంది?

జ్వాల నోట్లో బలవంతంగా పోసాడు కిరణ్. ఇలాటివి అక్కడున్న వాళ్ళెవరికీ క్రొత్తకాదు. కాని యిలాగ ఎప్పుడోగాని

జరగదు. జరిగినప్పుడు మాత్రం అందరూ వుత్సాహంగా, కొత్తగా టేస్ట్ చేసిన వాళ్ళ ముఖంలో వచ్చే భావతరంగాల్ని ఆసక్తిగా చూస్తుంటారు. ఇప్పుడూ అదే చేసారు.

"ఎలా వుంది? బావుందా?"

జ్వాల మాట్లాడలేదు. కాని గ్లాసులో వున్నదాన్ని నెమ్మదిగా సిప్ చేస్తూ కూర్చుంది. కొద్దిక్షణాల్లో హోరెత్తించే సంగీతంతో పాటు, కేకలు, ఈలలు, డాన్సులూ! ఓహ్! ఒకటేంటి? అన్నీ కలగలుపుగా వున్నాయి.

"జ్వాల! వెళ్దామా?" నెమ్మదిగా అడిగాడు.

జ్వాల తలూపడంతో లేచి చెయ్యందించాడు.

"మనూ!" కోపంగా అరిచాడు రవి.

కిరణ్ జ్వాల చేతిని గట్టిగా పట్టుకుని, మనోజ్ చేతిని విదిలించాడు.

"రవీ?" తెల్లబోయి చూసాడు.

"నీకూ ఓ ఛాన్స్ ఇస్తాంలే!" రాకేష్ హేళనగా నవ్వుతూ అన్నాడు.

ఒక్క క్షణంలో పరిస్థితి నర్థం చేసుకున్నాడు. అంతే! జ్వాలని రెండు చేతుల్లో ఎత్తి బైటికి పరుగెత్తాడు. అనుకోని సంఘటనకి తెల్లబోయారు.

వెంటనే తమాయించుకుని, క్రిందికి వ్రేలాడుతున్న జ్వాల పైటచెంగుని పట్టుకున్నాడు రవి. మనోజ్ అదేం పట్టించుకోకుండా పరుగెత్తడంతో, రవి వెనకనే అలా చీర పట్టుకునే వచ్చాడు.

"రవీ! వదిలెయ్!" చూసింతర్వాత గట్టిగా అరిచాడు మనోజ్.

రవి వదలకపోవడంతో, జ్వాలని భుజంమీదకు మార్చుకుని, మరో చేత్తో చీరని గట్టిగా లాగేడు. అలా చేస్తాడనుకోక పోవడంతో, రవి చీరతోపాటు విసురుగా ముందుకు పడ్డాడు. కిరణ్, రాకేష్ మనోజ్ కిరువైపులా వచ్చారు.

"మనోజ్! అనవసరంగా దెబ్బలాట చెయ్యకు. జ్వాల వొదిలెయ్! కావాలంటే ఫస్ట్ ప్రిఫరెన్స్ యిస్తాం!" రాకేష్, మనోజ్

భుజం పట్టుకుని తీవ్రంగా అన్నాడు. జ్వాల తెలిసీ తెలియని చేతనావస్థలో వుంది. కడుపులో ఏదో వికారంగా మత్తుగా కళ్ళు మూసుకోవా లన్పిస్తుంది.

"మనూ! జ్వాల నవమానించడం కోసం మనం ఎంత ఎదురు చూసాం? గుర్తులేదా?" హేళనగా అడిగాడు రవి.

"రవీ! జ్వాల మామూలుగా వుంటే, మీ ముగ్గురెలా చేసినా, నేనేం కల్పించుకోను. జ్వాలకిలా తాగించి, అవమానిస్తుంటూ అసహ్యంగా మాట్లాడితే నే నూరుకోను. ఐ యామ్ వెరీ సారీ! నేను మీతో కలవలేను!" నిర్మొహమాటంగా అన్నాడు.

కిరణ్ యింక మాట లనవసరం అన్నట్లు జ్వాలని క్రిందకు లాగాడు. మనోజ్ కోపంగా కిరణ్ మీదకు లంఘించాడు. ఓ చేత్తో జ్వాలని గట్టిగా పడిపోకుండా పట్టుకుని, మరో చేత్తో దెబ్బలాటకు సిద్ధమయ్యాడు.

"జ్వాల! ప్లీజ్! మెలకువ తెచ్చుకో!" అనునయంగా, బలవంతంగా కళ్ళు తెరవాలని ప్రయత్నం చేస్తున్న జ్వాలతో అన్నాడు.

మనోజ్ విసురుగా జ్వాల చెంపలు వాయించాడు. వాళ్ళ దెబ్బలాటలో జ్వాలకి అప్పుడప్పుడు బలంగా దెబ్బలు తగుల్తూనే వున్నాయి. ఒక్కసారి బాగా మెలకువ తెచ్చుకుని చూసింది.

"జ్వాల! ప్లీజ్ హెల్ప్ మి!" మనోజ్ ఓవైపు వాళ్ళ దెబ్బలు కాచుకుంటూనే, జ్వాలతో అన్నాడు.

జ్వాల, మనోజ్ చేతిని వదిలించుకుని సరిగ్గా నించుని చూసింది. ఒకవైపు వాళ్ళు ముగ్గురూ, రెండోవైపు మనోజ్, చుట్టూ ఫ్రీ ఫైటింగ్ మేచ్‌ని చూడ్డానికి చాలామంది ఉత్సాహంగా నిల్చున్నారు. చూస్తూ నిల్చున్నారే తప్ప, ఎవరూ విడదీసే ప్రయత్నం చెయ్యడంలేదు. జ్వాల నిరసనగా, అసహ్యంగా చూసింది. ఒకటి, రెండు క్షణాలకంటే మనోజ్ వాళ్ళ నెదుర్కోలేడు. అప్పుడు తన స్థితి! అలా అని తను వాళ్ళతో దెబ్బలాడ్డం సాధ్యమా? కాని వూరికేమాత్రం ఎలా నిల్చోడం? మనోజ్ మీద కొస్తున్న రవి చేతిని ఒడుపుగా పట్టుకుని, అలవాటుగా నొక్కే

సింది. రవి రెండో చేత్తో వదిలించుకోబోయాడు. ఆ చేతినికూడా రెండో చేత్తో పట్టుకుని గట్టిగా, గిలగిల కొట్టుకునేలా నొక్కేసింది. మనోజ్ సంతోషంగా చూసి, రవి ముఖంమీద బలంగా చరిచి మీదకొస్తున్న కిరణ్ మీదకు నెట్టాడు.

"జ్వాల! మనం ఓడిపోతాం. వీలయినంత త్వరగా ముందుకు పరుగెత్తు!" చిన్నగా అన్నాడు.

రెట్టించిన కోపంతో కిరణ్ ఒక్కసారిగా జ్వాలమీద కొచ్చాడు. జ్వాల ఆపుకోలేక వెనక్కి పడిపోయింది. 'కెవ్' మనే కేక ప్రతిధ్వనించింది. నలుగురూ ఒక్కక్షణం అచేతనంగా నిల బడ్డారు.

"జ్వాల! ఏమైంది?" మనోజ్ ఆదుర్దాగా జ్వాలమీదకి వొంగి అడిగాడు.

వాళ్ళకెవరికీ ఏ అవకాశం యివ్వకుండా జ్వాలని లేపి, "జ్వాల త్వరలో మిసెస్ మనోజ్ కాబోతుంది. అనవసరంగా నా కడ్డు రావద్దు. ఈ పోట్లాట చాలాదూరం పోతుంది, మీ రడ్డు పడ్డా రంటే!" విసురుగా అని జ్వాలని బలవంతంగా ముందుకు తీసు కెళ్ళాడు.

అంతా ఆశ్చర్యంగా చూసారు. బజ్జీలమ్మే యీ బజారు పిల్ల మనోజ్ భార్యా? మనోజ్ కి మతిగాని చలించలేదు కదా? రవి, తన ప్రయత్నంగా, జ్వాల నేదో అవమానించాలని, మిసెస్ మనోజ్ అంటూ ఆహ్వానించాడు. కాని, యిలా మనోజ్ అంటా డని కల్లోకూడా ఊహించలేకపోయాడు. రాకేష్ కోపంగా జ్వాలని తినేసేలా చూసాడు. జ్వాల వీటన్నిటికీ దూరంగా, స్పృహలేని స్థితిలో వుంది. ఆ తర్వాత మనోజ్ కెవరూ అడ్డు రాలేదు.

"జ్వాల!" కార్లో పదిలంగా పడుకోబెట్టి, చిన్నగా పిల్చాడు.

జ్వాలనుండి సమాధానం రాలేదు. చీర సరిగా కప్పి, ప్రక్కనే కూర్చుని స్టార్ట్ చేసాడు. దారిలో ఒకటి, రెండుసార్లు పిల్చినా పలకలేదు. మనోజ్ కి అలా వున్న జ్వాలని యింత రాత్రి సమయంలో మరెక్కడికో తీసుకెళ్ళాలనిపించలేదు. సరాసరి

కాయని తమ యింటికి తోలిచ్చాడు.

జ్వాలని రెండుచేతుల్తో ఎత్తి యింట్లోకి తీసికెళ్ళాడు.

"మనూ?" అప్పటివరకూ కొడుకుకోసం ఎదురుచూస్తూ, మేలుకునివున్న పార్థసారధిగారు, విసురుగా, కోపంగా పిల్చారు.

"ఏంటిది? ఎవరా అమ్మాయి?" తీక్షణంగా అడిగారు.

"జ్వాల!" అని చెప్పి మనోజ్ పైకి వెళ్ళిపోయాడు.

బెడ్ మీద దించి, చీర సరిచేసి, గొంతువరకు బెడ్ షీట్ కప్పి, డాక్టర్ కి, వెంటనే రమ్మని ఫోన్ చేసాడు.

పార్థసారధిగారు పైకి వచ్చారు. మనోజ్ - ఏం జరిగిందో అంతా వివరించి చెప్పాడు.

"ఇంతకూ ఈ అమ్మాయిని నీ వెంట ఎందుకు తీసుకెళ్ళినట్టు?" అన్నారాయన కోపంగా. ఈ మాత్రం రభస మనోజ్ ముందుగానే ఊహించాడు.

"డాడీ! మీ పుత్రుడిగా నేను ఎక్కడైనా ఏదైనా అరాచకం చేసివస్తే మీరు నిగ్గతీయటం న్యాయం. జ్వాల నేనూ కలిసి వున్నంతమాత్రాన, నేను చెడ్డపని చేస్తున్నట్టు ఎందు కనుకుంటున్నారు?" అన్నాడు. పార్థసారధిగారు మాట్లాడలేదు. ఈలోగా డాక్టరొచ్చాడు.

* * *

ఉదయం ఆరింటికి తలుపు తట్టిన శబ్దానికి మనోజ్ కి మెళకువ వచ్చింది. వెళ్ళి తలుపు తీసాడు. ఎదురుగా ప్రతాప్.

"జ్వాలేది?" ఆత్రంగా, ఆదుర్దాగా అడిగాడు.

వేలితో బెడ్ వైపు చూపించాడు.

దగ్గరకెళ్ళి, నాలుగయిదుసార్లు "జ్వాల!" అంటూ పిలిచాడు.

జ్వాల కళ్ళు తెరిచింది. క్షణంసేపు తనెక్కడుందీ ఆమె కర్థం కాలేదు. ఎదురుగా నిల్చున్న మనోజ్ నీ, పక్కనే కూర్చున్న ప్రతాప్ నీ, మెత్తగా, ఒత్తుగావున్న పరుపునీ, తలగడనీ, చేత్తో తాకి అర్థం కానట్లు చూసింది. తర్వాత నెమ్మదిగా అన్నీ గుర్తొచ్చినయి.

"ఇది మీ యిల్లా?" మనోజ్ వైపు చూసి అడిగింది.

మనోజ్ అవునన్నట్లుగా తల వూపేడు.

"జ్వాల! లేవగలవా? ఇంటికెళ్దామా?"

"వెళ్దాం" అన్నదే కాని, లేవలేకపోయింది. ఒళ్ళంతా భారంగా, బాధగా వుంది.

"ప్రతాప్! డాక్టర్‌గా రాస్తారు ఏడింటికి. తీసుకెళ్ళమంటే అలాగే చేద్దువుగాని!" మనోజ్ క్రిందికి వెళ్తూ అన్నాడు.

"జ్వాల! ఏమయిందే?" ఆత్రంగా అడిగాడు. జ్వాల నెమ్మదిగా ఒక్కొక్కటీ చెప్పింది.

"రాత్రి శాంతివాళ్ళ తాతగారు పోయారు. నీవు ఏమయ్యావో బోధపడక మేము తికమక పడిపోయాం. నీ గురించి అడుగుదామని మనోజ్ కోసం వస్తే, మనోజ్ వాళ్ళ డాడీ, మీరు పైన వున్నట్టు చెప్పారు" అన్నాడు ప్రతాప్.

"ఏమిటీ! శాంతివాళ్ళ తాతయ్య పోయారా!"

"అంతే కాదు. శాంతికి మరో షాక్!" అంటూ ప్రతాప్ ఓ ఉత్తరం జ్వాల కందించాడు. అది శాంతికి వ్రాయబడ్డ ఉత్తరం.

ఆ ఉత్తరం చదవగానే జ్వాల మొహంలో రంగులు మారాయి.

హు! అంతా అయిపోయింతర్వాత చిలకలా, ముద్దుముద్దుగా క్షమించమంటూ వ్రాసాడు. శాంతికి అన్యాయం చెయ్యాలని తనెప్పుడూ అనుకోలేదట. పాపం! పరిస్థితు లలా వచ్చాయట. తన తండ్రి స్మగ్లర్ అట. ప్రస్తుతం ప్రభుత్వ అతిథిగృహంలో విశ్రాంతి తీసుకుంటున్నారట. ఆస్తిపాస్తులన్నీ ప్రభుత్వ అధీనంలోనే వున్నాయట. ఇలాటి పరిస్థితుల్లో శాంతిని పెళ్ళిజేసుకోవడం ఏమంత బాగుండదట. కాని తల్లి ఇష్టప్రకారం, ఇంకో అమ్మాయి మెడలో తాళికట్టినట్లయితే పోయిన తమ పేరువు ప్రతిష్టల్ని, ఆ అమ్మాయి ద్వారా పొందవచ్చునట. ఆ అమ్మాయి తండ్రి పలుకుబడిగల వ్యక్తట. ఛ! ఛ! ఎంత మోసం! ధీరజ్ పైకెంత మంచివాడుగా కన్పిస్తాడు.

జ్వాలలో ఉద్వేగం ఏర్పడుతోంది. 'ఈ మగవాళ్ళంతా యింతే!" అనిపిస్తోం దామెకు.

"ఇంతకూ శాంతి ఎలా వుందిరా?" అడిగింది ప్రతాప్‌ని.

ఫోన్ రింగవ్వటం ప్రారంభించింది.

"చూడు! ఫోన్ రింగవుతోంది" అంది జ్వాల.

జ్వాల చెప్పడంతో ప్రతాప్ లేచి రిసీవరందుకున్నాడు.

అటువైపునుండి ప్రసాద్ పలికాడు.

"ప్రతాప్! జ్వాల, నువ్వు త్వరగా రండి" ఆదుర్దాగా అన్నాడు.

"ఏంటంత ఆదుర్దాగా వున్నావ్?"

"శాంతి ఆత్మహత్య చేసుకోబోయింది. సమయానికి నేను చూడబట్టి సరిపోయింది. శాంతి ఏడుస్తూ పడుకుంది. నేను అడ్డం వెళ్ళానని, నన్ను తిడుతోంది."

"ప్రసాద్! నే నిప్పుడే వస్తున్నాను. కాని జ్వాల......" అంటూ జరిగిందంతా చెప్పాడు.

"ఏం? జ్వాల లేవగల స్థితిలో లేదా? బాగా తగిలాయా?"

"డాక్టర్ గారి కోసం వెయిట్ చేస్తున్నాం. ముందు నే నొస్తాను. తర్వాత చూద్దాం జ్వాల విషయం!"

"త్వరగా రా!"

"ఏంవిటిరా? ఏంవయింది?"

"శాంతి ఆత్మహత్య చేసుకోబోయిందట!"

జ్వాల వులిక్కిపడ్డది. అచేతనంగా అలాగే చూస్తుండి పోయింది.

"జ్వాల! నేను వెళ్తానే! ఓ గంట తర్వాత ప్రసాదో, నేనో వస్తాం" సమాధానం కోసం ఎదురుచూడకుండా వెళ్ళిపోయాడు.

"జ్వాల! ముఖం కడుక్కుంటావా?" మనోజ్ వస్తూనే అడిగాడు.

అప్పటికే స్నానం చేసినట్లున్నాడు. ఫ్రెష్‌గా నీట్‌గా తయారయ్యాడు. జ్వాల తీక్షణంగా చూసిందే తప్ప, ఏం చెప్ప లేదు. జ్వాలకి ఎంత కసిగా, కోపంగా వున్నదంటే, ఆ క్షణంలో కన్పించిన ప్రతి మగాడిని కొట్టి, తిట్టి చంపాలన్నంత ఆవేశంగా వుంది. ఆ మగాళ్ళలో ప్రతాపూ, ప్రసాదూ లేకపోయివుంటే, శాంతికి జరిగినదానికి తనాపనే చేసేది.

"లే! ముఖం కడుక్కొని కాఫీ తీసుకుందువుగాని" దగ్గర కొచ్చి చెయ్యందిస్తూ అన్నాడు.

ఆ చేతిసందుకుని కసిగా నొక్కాలనిపించి, గట్టిగా పట్టుకుంది. కాని ఇదివరకటిలా తను బలంగా లేదనిపించింది. మనోజ్ కిదేం తెలియక, జ్వాలని రెండో చేత్తో కూడా పట్టుకుని లేవ తీశాడు. ఏదో వూడిన చీర కప్పాడే కాని, ఎలా కట్టాలో తెలియక వూరుకున్నాడు. చీర జారిపోయి కాళ్ళమీద కుప్పలా పడింది. జ్వాల చప్పున సిగ్గుతో, అభిమానంతో కూర్చుండిపోయింది. మనోజ్ గిరుక్కున వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు. క్షణంలో ప్యాకెట్ తెచ్చి, గుమ్మంలో నుండే, బెడ్ మీదకు పడేలా విసిరేసి వెళ్ళి పోయాడు. జ్వాల అయోమయంగా, అచేతనంగా చాలాసేపు అలాగా కూర్చుండిపోయింది.

"జ్వాలా! రావచ్చా?" బైటనుండే అడిగాడు.

"వూహుఁ!" కూడదీసుకుంటూ అన్నది.

"ఇంకా కాలేదా! నువ్వు త్వరగా తయారయితే. నిన్నింటి దగ్గర డ్రాప్ చేస్తాను!"

జ్వాల తప్పదన్నట్లుగా లేచి, చీరను తీసుకుంది. తన చీరంతా అక్కడక్కడా చిరిగి, దుమ్ముతోనూ, రక్తం మరకల తోనూ అసహ్యంగా వుంది. చేసేది లేక, మనోజ్ తెచ్చిన చీరే కట్టుకుంది. ఆ కొద్దిసేపు నిల్చుని చీర కట్టుకున్నందుకే చాలా నీరసంగా అనిపించి అక్కడే కూలబడింది.

"రానా?"

"వూఁ!" నిస్సత్తువగా అన్నది.

"ముఖం కడుక్కున్నావా?" చూసీ చూడనట్లుగా, జ్వాలని పరీక్షిస్తూ అడిగాడు.

"ముందు నేను యింటికి వెళ్ళాలి!" అంది ఆమె తీక్షణంగా.

"ఈ దశలోనా?"

"నా దశకేం ఫర్వాలేదు. దయవుంచి నన్ను మా యింటికి చేర్చు."

మనోజ్ కి నవ్వొచ్చింది. తాచుపాముకి నడుం విరిగినా అది

అల్లంత ఎత్తున లేచేందుకు ప్రయత్నిస్తూ బుసలు కొడుతూనే వుంటుంది. సరిగ్గా జ్వాల అలాంటిదే! ఆమె యింటికి వెళ్తానని అన్నాక, ఆమెతో వచ్చి మంచినీళ్ళు కూడా తాగించలేకపోయాను. మనోజ్ లోపలి కెళ్ళి కాగితం, కలం ఆమె చేతి కందించాడు.

"పది రోజులకి లీవ్ పెట్టు. నేనే వెళ్ళి, పరిస్థితులేమిటో వివరించి, చెప్పి యిచ్చొస్తాను!" మృదువుగా అన్నాడు.

జ్వాల తటపటాయించింది. ఏమనుకుందో తెలీదు. మౌనంగా వ్రాసిచ్చింది. మడిచి జేబులో పెట్టుకున్నాడు.

"రేపు నేను ఢిల్లీ వెళ్తున్నాను!"

ఏమయినా చెప్పాలా? అన్నట్లు చూసాడు.

"జ్వాల! నేను డాడీకి చెప్పి వెళ్తాను. ఓసారి ప్రసాద్‌ని డాడీకి కన్పించమను. పోతే శాంతి విషయం...?"

అసలే తెల్లగా వున్న జ్వాల ముఖం మరీ తెల్లగా పాలిపోయింది.

"ఫ్రాడ్ యిలాంటి మోసగాడని నేనెప్పుడూ అనుకోలేదు. వీళ్ళిద్దరి పరిచయం యింత దూరం వచ్చిందని కూడా నాకు తెలియదు!" అంది గంభీరంగా ఆమె. ఈలోగా ప్రసాద్ వచ్చాడు.

"ప్రసాద్! జ్వాలని క్రిందికి తీసుకురా. కారు బైటకి తీస్తాను" అంటూ మనోజ్ క్రిందకు వెళ్ళాడు.

* * *

"శాంతీ!" ఆర్ద్రంగా పిల్చింది జ్వాల.

శాంతి నిర్లిప్తంగా తల తిప్పి చూసింది.

ఇద్దరూ చాలాసేపు మౌనంగా వుండిపోయారు. జ్వాల కేం మాట్లాడాలో కూడా అర్థంకాలేదు.

"జ్వాల! నన్ను ఓదార్చకే! ఓదార్చేవాళ్ళు నిముషాని కొకళ్ళు వస్తున్నారు. విసుగెత్తుతోంది. నువ్వు ఏ విషయాలు ఎత్తకు. నా దగ్గర సమాధానమేదీ లేదు." విసుగ్గా, నిస్పృహగా, విరక్తిగా అని ముఖం తిప్పుకుంది.

"శాంతీ!" శాంతి తలమీద చెయ్యి వేసి మృదువుగా నిమిరింది.

జ్వాల ఆరోజే ఆఫీస్ కెళ్ళింది. శాంతి వాళ్ళిల్లు ఖాళీచేసి జ్వాల వాళ్ళింటికే వచ్చేసింది. జ్వాల పేరున ఢిల్లీనుండి ఏదో కవరొచ్చింది. ప్రసాద్ అప్రయత్నంగా చించాడు. ఖాళీ చెక్, మనోజ్ సంతకం చేసింది వుంది. చిన్న స్లిప్ మీద జ్వాల పేరులో వుత్తరం వుందిగాని, అది ప్రసాద్ గురించే వుంది.

జ్వాల!

ప్రసాద్‌కి జాబ్ దొరికి వుండదు. డాడీ నాకు వ్రాశారు. డాడీ ఎందుకో నామీద కోపంగా వున్నారు. అందుకే ప్రసాద్‌ని కలవలేదేమో? ప్రసాద్‌ని, పదివేల లోపు ఎంతయినా సరే, ఏదయినా చిన్న కుటీర పరిశ్రమ లాటిది పెట్టదల్చుకుంటే నేను సాయం చేయదల్చు కున్నాను. ఖాళీ చెక్ పంపుతున్నాను. దానంగా మాత్రం యివ్వడం లేదు. ప్రసాద్‌కి వీలైనప్పుడు యిస్తే తప్పకుండా తీసుకుంటాను. శాంతి ఎలా వుంది? శాంతికి కూడా ప్రసాద్ పెట్టే దానిలో భాగం యివ్వమను.

మనోజ్.

శాంతి, ప్రసాద్ ముఖముఖాలు చూసుకున్నారు. పదివేలు, కేవలం జ్వాల మీద నమ్మకంతో యిస్తున్నాడంటే నమ్మ బుద్ధి కాలేదు. కాని, ఎంత నిరాశలో వున్న ఈ సమయంలో తమకి సాయం చేస్తున్నాడు. ఫర్వాలేదు. మంచివాడే! సాయంకాలం జ్వాల రాగానే చెప్పారు. జ్వాల ముందు తెల్లబోయింది. చూసిం తర్వాత ఏం మాట్లాడలేదు.

"జ్వాల! రెండో, మూడో సెకండ్ హాండ్ లైప్ మిషన్లు కొందామా?" ప్రసాద్ తటపటాయిస్తూ అడిగాడు.

"ఎక్కడ పెడదాం?" జ్వాలకి బదులుగా ప్రతాప్ అడిగాడు.

"ఇప్పటికే వీధికొకటివున్నాయి!" శాంతి నెమ్మదిగా అన్నది.

"కాగితం సంచులు తయారుచేద్దామా? కొద్ది పెట్టుబడితో సరిపోతుంది." ప్రసాద్ సాలోచనగా అన్నాడు.

"వక్కపొడి పొట్లాలు కూడా తయారు చేయొచ్చు!"

వుత్సాహంగా అన్నాడు ప్రతాప్.

"రెండూ పెడదాం, మూడు, నాలుగు వేలయితే చాలు!" హుషారుగా అన్నాడు ప్రతాప్.

"అవును. అలా అయితే శాంతికి కూడా చేతినిండా పనుంటుంది!" ప్రసాద్ అన్నాడు.

"ఏం జ్వాల! చెప్పు?"

"మీ యిష్టం!"

ప్రతాప్, ప్రసాద్ వుత్సాహంగా వాటి వివరాలు, మరేదయినా మూడు, నాలుగు వేలు పెట్టుబడితో వచ్చేవి వున్నాయేమో కనుక్కుందామని బైటికెళ్ళారు. జ్వాల ఆలోచిస్తూ పడుకుంది. తను వద్దని తిరస్కరిస్తే, ప్రసాద్ చాలా ఆశాభంగం పొందుతాడు. శాంతికూడా యిదో కాలక్షేపం చూపించినట్లవుతుంది. మనోజ్ ఏ వుద్దేశ్యంతో పంపినా, తను తిరస్కరించే స్థితిలో మాత్రం లేదు. తిరస్కరించి, తన స్నేహితుల్ని నిరాశపర్చడం మాత్రం తనవల్ల కాని పనిగా కనిపించింది.

తర్వాత నాలుగయిదు రోజులకే, అనుకున్నట్లుగానే పని ప్రారంభించారు. శాంతి మొదట ఏ పనీ కల్పించుకుని చెయ్యలేదు. తర్వాత తర్వాత, ఎవరూ చెప్పకుండానే చేసింది. మొదటి నెల అనుకున్నదాని కంటే కొద్దిగా ఎక్కువే వచ్చింది. రెట్టించిన వుత్సాహంతో, చురుగ్గా చేసారు. శాంతి ఇదివరకటిలా నిరుత్సాహంగా, స్తబ్దుగా పడుకోకుండా, వుత్సాహంగా, ప్రసాద్‌తో తనూ చేస్తూనే వుంది. ప్రతాప్, జ్వాల యింట్లో వున్నంతసేపూ చేసేవారు. బామ్మకూడా పని కాగానే వచ్చి కూర్చునేది.

* * *

ఓ సంవత్సరం గడిచింది. ఒక విధమయిన నిశ్చింతతో వున్నారందరూ. శాంతికి బాబు పుట్టాడు. ప్రసాద్ తండ్రిగా, హాస్పిటల్లో జాయిన్ చేసేముందు సంతకం చేసాడు.

"శాంతీ! బాబుని సువ్వు సక్రమంగా, ధైర్యంగా యీ లోకంలో పెంచగలననుకుంటే నీ ఇష్టం. కాని, నా సహాయం కావాలంటే అందుకు నేనెప్పుడూ సిదమే!" ప్రసాద్ నిదానంగా

అన్నాడు.

జ్వాల ఆశ్చర్యంగా చూసింది. ప్రసాద్ పైకెంత మామూలుగా కన్పిస్తాడు! ఇంత ధైర్యంగా, శాంతికి అండగా నిలబడ్డాడనుకుంటే చాలా సంతోషమేసింది. శాంతి తను ఆలోచించేదేమీ లేదని, జ్వాల, ప్రసాద్ కెలా ఇష్టమయితే అలాగే చేస్తానన్నది.

"అలా అంటే నేనూరుకోను. నీ కిష్టమైతే నే యిలా జరుగుతుంది. నా యిష్టమేదో చెప్పాను. జ్వాలని సలహా అడుగు. అంతే కాని, జ్వాల, నేను చెప్పగానే చెయ్యడం కాదు!" నవ్వుతూ మందలించాడు.

జ్వాల అభినందిస్తున్నట్లుగా ప్రసాద్ కేసి నవ్వుతూ చూసింది.

ఆ తర్వాత ప్రసాద్ పెళ్ళి మాటెత్తకుండానే, శాంతిని భార్యగా స్వీకరించాడు. ప్రసాద్ ఇంట్లో వాళ్ళకి దూరంగా, తను నమ్మిన ఆదర్శానికి చేరువగా వచ్చాడు.

ఇదివరకులా జ్వాల వాళ్ళింట్లో ఎవరూ స్తబ్దుగా లేరు. బాబు రాకతో ఇంట్లో ఆనందోత్సాహాలు వెల్లి విరిసాయి. అయిదు వేలతో పెట్టిన ఈ బిజినెస్, చాలా సంతృప్తిగా అన్పించింది అందరికీ. నిజంగా శాంతి మామూలుగా అవుతుందని ఎవరూ అనుకోలేదు. ప్రసాద్ సాహచర్యంలో శాంతి మామూలుగా అయింది. జ్వాలకి గాని, ఆ ఇంట్లో వాళ్ళకిగాని ప్రసాద్ మామూలు స్నేహితుడిలా కాక, బాధ్యతగా చూసుకునే ఇంటి పెద్దలా కన్పిస్తున్నాడు. ఆ ఇంట్లో ఎవరయినాసరే ఏ పని చెయ్యాలన్నా, నలుగురూ కూర్చుని ఆలోచించిగాని చెయ్యడంలేదు.

జ్వాల మామూలుగా ఆఫీసుకెళ్ళి వస్తూంది. మనోజ్ అప్పటి నుండి ఇంతవరకూ కన్పించలేదు. మనోజే కాదు వాళ్ళ ఫ్రెండ్సు కూడా తనకెవరూ తటస్థపడలేదు. రోజులు అతి నిశ్చింతగా సాగిపోతుండగా, ఓ రోజు హఠాత్తుగా వచ్చాడు మనోజ్.

శాంతి, ప్రసాద్ సినిమా కెళ్ళారు. ప్రతాప్ బజారు కెళ్ళాడు. బామ్మ పురాణానికెళ్ళింది. జ్వాల బాబుకి జుబ్బా తొడిగి బొట్టు పెడుతుంది.

"జ్వాల!" మనోజ్ ఆత్రంగా, ఆరాటంగా పిల్చాడు.

ఉలిక్కిపడి చూసింది.

"నువ్వా?" అనుకోకుండా అన్ని రోజులకి కన్పించడంతో ఆశ్చర్యంగా చూసింది. తర్వాత బాబు నెత్తుకుని నిలబడింది.

"బావున్నారా మీ వాళ్ళంతా?" నవ్వుతూ పరామర్శించాడు.

జ్వాల తలూపింది.

"ఎవరా బాబు?" కుతూహలంగా అడిగాడు.

"......"

"నీ కొడుకా?"

చురుగ్గా తలెత్తి చూసింది.

"అవును. నా కొడుకే!" స్థిరంగా అన్నది.

"జ్వాలా?!" నమ్మలేనట్టుగా చూశాడు.

"ఏం? నమ్మలేకపోతున్నావా?" తలెత్తి సూటిగా అడిగింది.

మనోజ్ ముఖంలో కొట్టొచ్చినట్టుగా ఆశ్చర్యం, నిరాశ కన్పిస్తున్నాయి.

"హూఁ! పాపం! నీవు నెలల తరబడీ కనిపించకపోతే నేను ఆత్మహత్య చేసుకుంటాననుకున్నావా? లేక విరాగిగా మారతాననుకున్నావా?"

"........."

"ఇన్ని రోజులు ఎక్కడున్నావ్?" కొత్తగా కొన్న కుర్చీని మనోజ్ కి చూపించి, తను, బాబు మంచం మీద కూర్చున్నారు.

"........."

"జ్వాల! పర్సు మర్చిపోయాను!" హడావుడిగా లోపలికొస్తూ అన్నాడు ప్రసాద్.

"ఓ! మీరా! బావున్నారా? మీరు చేసిన సహాయానికి చాలా థ్యాంక్సండి" నవ్వుతూ పలకరించాడు.

జ్వాల పర్సు తీసుకురావడానికి లోపలి కెళ్ళింది.

"జ్వాల! టిఫినేదయినా తీసుకురానా?" చిన్నగా అడిగాడు

తనూ లోపలికెళ్ళి.

"వద్దు. అత నేం తీసుకోడు."

"మా జ్వాలతో మాట్లాడుతుండండి. మీ రీ వూళ్ళోనే వుంటారా? నేను తర్వాత మీ దగ్గరకొచ్చి మాట్లాడతాను!" వెళ్ళ బోతూ అన్నాడు.

మనోజ్ తలాడించాడు. ప్రసాద్ బాబు నోసారి ముద్దు పెట్టుకుని వెళ్ళిపోయాడు.

"విశేషాలేంటో చెప్పు?" తిరిగ్గా కూర్చుంటూ అడిగింది.

"అతను ప్రసాద్..." ఏదో అడగబోయి వూరుకున్నాడు.

"బాబుకి తండ్రి!"

"అంటే నువ్వు ప్రసాద్‌ని చేసుకున్నావా?"

"ఏం? చేసుకోకూడదా! ఐదు వేలు యిస్తే నీకోసం ఎన్నేళ్ళయినా కాచుకు కూర్చుంటానని అనుకుని వుండాలి."

"జ్వాల!" అసహనంగా కదిలాడు.

"ఏం? బాబు నెత్తుకుంటావా? చూడు!" దగ్గరకొచ్చి అందిస్తూ అన్నది.

"జ్వాల! నిజం చెప్పు. నువ్వు ప్రసాద్‌ని చేసుకున్నావా?"

"ఏం? తప్పా చేసుకుంటే?"

"అని కాదు. అన్ని రోజులు మరి నాతో తిరగడంలో అర్థ మేంటి?" తీక్షణంగా అడిగాడు.

"సింపుల్! నువ్వు ఉద్యోగం యిప్పించిన వాడివి. నువ్వు రమ్మన్నప్పుడు, రాకపోతే ఉద్యోగం పోతుందనే భయం ఒకటి. రెండవది నీతో మంచిగా వుండి, మా ఫ్రెండ్స్‌కి వుద్యోగాలిప్పించడం. నువ్వు నాకోసం ఒక్క రాత్రికోసం తిరిగితే, నేను నీ వెంట యిందుకు తిరిగాను!" నిర్లక్ష్యంగా తలెగరేస్తూ అన్నది.

"ఛ! నీతో ఒక్క రాత్రి గడిపేందుకు నేను నీ చుట్టూ తిరగాల్సిన పన్లేదు. నాకా వుద్దేశ్యమే వుంటే బలవంతానయినా అనుభవించేవాడిని!" కోపంగా అన్నాడు.

"మరెందుకు తిరిగినట్లో?" హేళనగా అడిగింది.

మనోజ్ సమాధానం చెప్పేందుకు కాసేపాగి, జ్వాలనే

పరీక్షగా చూశాడు. ఆమెది కళ్ళు చెదిరే అందం! ఆ అందానికి అణకువ జోడైతే ఎంత బాగుండేది!

"జ్వాలా! నీవు నమ్మినా నమ్మకపో! ఐ లవ్ యూ జ్వాలా! ఐ లవ్ యూ!" అన్నాడు.

జ్వాల మొహంలో ఏ బాధ కనిపించలేదు.

బాబుని క్రింద పడుకోబెట్టి లోపలికి, కాఫీ పెట్టడాని కెళ్ళింది. ఓసారి లోపలికి తొంగి చూసి, బాబు నెత్తుకున్నాడు. ఆశ్చర్యంగా చూస్తూ వచ్చిన ప్రతాప్ నోరు మూసి బైటికి తీసి కెళ్ళి, తనకి కావాల్సిన వివరాలు అడిగి, అటునుండి అటే బైటికి పంపేసి, తలుపులు వేసేసి లోపలికొచ్చాడు. జ్వాల ఆ గదిలోకి రాగానే, అమాంతం ఆమెను చేతుల్లోకి లాక్కుని ముద్దుపెట్టు కున్నాడు.

జ్వాల ఆవేశంగా, ఆపుకోలేని కోపంతో చెయ్యెత్తింది. మనోజ్ మధ్యలోనే ఆపి, తన చేతిలోకి తీసుకున్నాడు.

"నీతో చెంపదెబ్బలు తినడానికొక్కాదు నేనొచ్చింది!"

"ముందు నన్నొదిలి నీవు బైటికెళ్ళు" విసురుగా అన్నది.

"వూరికే ఎలా వెళ్తాను? నా బాబుని తీసుకునే వెళ్తాను!" అంటూ జ్వాలని వదిలి క్రింద పడుకుని వున్న బాబుని తీసుకుని అతడు బయటికి నడవబోయాడు.

"ఏయ్! మనూ! నీకేం పిచ్చెక్కలేదు కదా? వాడెందుకు?" గుక్కపట్టి ఏడుస్తున్న బాబుకోసం చేతుల చాస్తూ అన్నది.

"నువ్వే చెప్పావ్ గా? వాడు నా బాబని. ఎలాగూ నాకు పెళ్ళి చేసుకునే ఉద్దేశ్యం లేదు. బాబుని తీసికెళ్ళి, నా తర్వాత వారసుడ్ని చేస్తాను!"

"మనోజ్!" తెల్లబోయింది.

"........."

"మనో! ముందు బాబు నివ్వు. వాడు చూడెలా ఏడుస్తు న్నాడో?" ఆదుర్దాగా అన్నది.

"వూహు. నేను తీసికెళ్తాను" మొండిగా అన్నాడు.

"చెప్తే వినవేం! వాడ్నివ్వడానికి, వాడి తల్లిని కాను నేను!"

కోపంగా అన్నది.

"అదీ! అలా ఒప్పుకోవాలి! లేకపోతే నన్నే బోల్తా కొట్టిస్తావా?" నవ్వుతూ బాబు నందించాడు.

జ్వాల మాట్లాడకుండా బాబుని కూర్చోపెట్టి, పాలగ్లాసు నోటిదగ్గర పెట్టింది. కాఫీ గ్లాసు తీసుకుని, చనువుగా జ్వాల పక్కనే కూర్చున్నాడు.

"ఫైర్! ఇలాంటివాడు మనకి అర్జంటుగా కావాలి కదూ? నీ గర్వం అణచడానికి!" నవ్వుతూ అన్నాడు.

జ్వాల తలెత్తలేదు. శ్రద్ధగా గ్లాసువైపే చూస్తూ కూర్చుంది.

"జ్వాల తలెత్తు! యిలా చూడు!" జ్వాల భుజం చుట్టూ చెయ్యివేసి, భుజం మీద గడ్డం ఆన్చుకుని, చిన్నగా నవ్వాడు.

"........."

"నీ కోసం సంవత్సరం ఆగాను. ఢిల్లీనుండి ఆత్రంగా పరుగెత్తుకొస్తే, నువ్వేమో అబద్ధాలతో ఆట పట్టించావ్."

"నా కోసమా?"

"అవును. కేవలం నీ ఉద్దేశ్యం తెల్సుకుందామని ఆగాను. అసలే ధీరజ్ మోసం చేసాడని కోపంగా వున్నావ్! నేనేది చెప్పినా మోసమే అనేదానివి అందుకే యింతకాలం ఆగాను. నీ కోసం డాడీని ఎదిరించి, అసలు పెళ్ళి కోసుకోనని బెదిరించి, నిన్ను చేసుకుందుకు ఒప్పుకున్నాకనే యీ ఊళ్ళో అడుగుపెట్టాను."

"థేం......"

"మిస్ ఫైర్! నువ్వు నాకు థేంక్స్ కాదు చెప్పాల్సింది" చిలిపిగా అన్నాడు.

"మరి?"

"తర్వాత నేనే తీసుకుంటాను. ఇన్నిరోజులు నీకు కన్పించక పోవడంతో, నిన్ను మర్చిపోయాననుకున్నావ్ కదూ?" జ్వాల వడిలో తలపెట్టుకుని పడుకుని, బాబుని పొట్టమీద కూర్చోపెట్టుకున్నాడు.

"ఎలా అనుకుంటాను. అప్పున్నవాళ్ళ నెవరూ మర్చిపోరు" చురుగ్గా అన్నది.

"ఏం కాదు. ఉమనో, మరెవర్నో చేసుకున్నాననుకుని వుంటావు. నిన్ను ఘోరంగా మోసం చేసాననుకున్నావ్ కదూ?"

"........."

"నిజం కదూ?"

"ఊఁ!"

"నాకు తెల్సు! ఇలా అనుకుంటావని. నీకు నామీద యిష్టం లేకపోతే పెళ్ళి చేసుకుంటావని అనుకున్నాను. ఎందుకు చేసుకో లేదు?" కొంటెగా అడిగాడు.

"పెళ్ళి చేసుకోడం అవసరమే కాని, అనివార్యం కాదుగా! అదీకాక నా కెవర్నీ చేసుకోవాలని లేదు!"

"నన్నుకూడా?" బాబుని క్రింద కూర్చోపెట్టి, జ్వాలని సూటిగా చూసాడు.

"ఊహుఁ!"

"జ్వాల!" దెబ్బతిన్నట్లుగా చూసాడు.

"సారీ. జ్వాల! నీ కిష్టం లేకపోతే, నిన్ను బలవంతంగా చేసుకునేటంత మూర్ఖుడిని కాను!" జ్వాల ఒళ్ళోంచి లేచి నిల్చుని అన్నాడు.

"........."

"ఐ యామ్ వెరీ సారీ! నీ అభిప్రాయం తెల్సుకోకుండా ఏదేదో వాగేసాను!" అభిమానంగా, బాధగా అని గిర్రున వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

"జ్వాల! ఏమన్నారు మనోజ్?" సినిమానుండి రాగానే అడిగాడు ప్రసాద్.

"ఏదో అన్నాడు. అంత చెప్పాల్సిందేం కాదు!"

"డబ్బు విషయమేమీ అడగలేదా?"

"ఊహు. ఏం చేస్తున్నారని అడిగాడు. చెప్పాను. రేపు సువ్వోసారి, వాళ్ళింటికెళ్ళి మాట్లాడిరా!"

ఉదయమే ప్రసాద్ వాళ్ళింటి కెళ్ళాడు.

మనోజ్ అతన్ని ఎంతో మర్యాదగా ఆహ్వానించాడు.

ప్రసాద్ సూటిగా మొదలుపెట్టాడు.

"మీ డబ్బు విషయం మాట్లాడ్దామని!"

"చెప్పండి!" ప్రసాద్ కి సోఫా చూపెట్టి, తనూ ఎదురుగా కూర్చున్నాడు.

"మీరు వెంటనే యివ్వమంటే, మాకు చాలా యిబ్బంది. మాకు కొద్దిరోజులు గడువు యివ్వండి!"

"........."

"మీకీ అయిదువేలు అంత లెక్కలోవి కావు. కాని ప్రస్తుతానికి మా అందరికీ జీవనమార్గం అదే చూపిస్తున్నది. మీరు చేసిన సహాయం మేము మర్చిపోలేనిది. నిజంగా ఆ సమయంలో నేమెంత నిరాశలో వున్నామంటే, బ్రతకడం దండగ అన్పించింది. అనుకోకుండా, మీరు అత్యంతవసర సమయంలో పంపించారు. దానికి మేమెప్పుడూ కృతజ్ఞులమే. మాలో నిరాశ, నిస్పృహలు పోడానికి కారణం మీరు!" చిన్నగా, స్పష్టంగా అన్నాడు.

"........."

అప్పటికీ మనోజ్ ఏం మాట్లాడకపోవడంతో, ప్రసాద్ యిబ్బందిగా చూసాడు.

"నేను డబ్బు యివ్వమని జ్వాలతో అన్లేదే?" సాలోచనగా అన్నాడు.

"అనలేదు. కాని మాట్లాడి రమ్మన్నది."

"అయితే జ్వాలనొకసారి యిక్కడకు రమ్మనండి. ఇది ఆహ్వానమని చెప్పండి. జ్వాలతోనే మాట్లాడ్తానా విషయం!" పైకి లేచి అన్నాడు.

"ఫర్వాలేదు. నాతో మాట్లాడినా, జ్వాలతో మాట్లాడినా ఒకటే! మీ యిష్టమేదో చెప్తే అందు కనుగుణంగానే చేస్తాం!" ప్రసాద్ తనూ నిలబడి అన్నాడు.

మనోజ్ సమాధానం చెప్పలేదు. ప్రసాద్ మరేం మాట్లాడకుండా వచ్చేసాడు.

* * *

ఆఫీసు కాగానే జ్వాల, మనోజ్ వాళ్ళింటి కెళ్ళింది.

తనకోసమే నన్నట్లుగా, ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

సరాసరి పైకి, అతని రూమ్‌లోకి తీసికెళ్ళాడు.

వెంటనే ఏం మాట్లాడాలో, ఎలా మొదలెట్టాలో అర్థం కాలేదు. కొద్దిసేపు టీపాయ్ క్రిందినుండి కన్పించే, నిగనిగలాడు తున్న అతని షూస్‌నీ, కొద్దిసేపు తనచేతుల్ని చూస్తూ కూర్చుంది.

"మీ కిప్పుడు కావాలా ఆ డబ్బు!" కూడబలుక్కున్నట్లుగా అడిగింది.

మనోజ్ మాట్లాడలేదు!

జ్వాల తలెత్తి చూసింది. అతడామె కళ్ళల్లోకి చూశాడు.

"జ్వాలా! నన్నెందుకు కాదన్నావో కారణాలు చెప్పగలవా?" సూటిగా చూస్తూ అడిగాడు.

జ్వాల చప్పున తల వొంచుకుంది. "నా అభిప్రాయాలకీ, మీ అభిప్రాయాలకి చాలాదూరం!" నిదానంగా అన్నది.

"ఏ అభిప్రాయాలు?"

జ్వాల దానికి సిద్ధంగా వున్నట్లు, పర్సులో కవరుతీసి అందించింది.

"ఏంటది?" లేచి దగ్గరకొస్తూ అడిగాడు.

"మీ రడిగిన దానికి జవాబు!" చేయి చాచింది.

మనోజ్ విసురుగా చెయ్యిపట్టుకు లాగేడు. ఊహించని సంఘటనకి బిత్తరపోయి చూసింది.

"నాలాంటివాడు కోరివస్తే, కాదనడానికి నీ కెంత ధైర్యం!" కోపంగా అడిగాడు.

జ్వాలకి క్షణంపాటు భయం కలిగింది.

"ఏం చూసుకుని అంత గర్వం!" ఎంత విసురుగా అన్నాడో, అంతకంటే విసురుగా డెస్క్ మీదికి నెట్టాడు. జ్వాల లేచే లోపలే, లేవనీయకుండా చేతులడ్డం పెట్టాడు. జ్వాల కోపంగా రెండు చేతుల్ని, తన చేతిలోకి తీసుకుని, అలవాటుగా నొక్కేసింది.

"ఇలాంటి వాళ్ళంటే నాకు చాలా అసహ్యం!"

"నాకు చాలా ఇష్టం!" జ్వాల చేతుల్ని అతి ప్రయత్నంమీద విడిపించుకుని, జ్వాలలాగే తనూ గట్టిగా నొక్కి పట్టుకున్నాడు.

"అందరి చేతుల్నీ అలా నొక్కేస్తుంటే, వాళ్ళకెంత బాధో

యిప్పుడు తెల్సిందా?''

''అనవసరంగా నే నెవర్నీ బాధపెట్టను. నన్ను బాధపెట్టిన వాళ్ళని క్షమించి వూరుకునేంత ఉదార హృదయం నాకు లేదు!'' రోషంగా అన్నది.

''నన్నింత బాధపెట్టిన నిన్ను, క్షమించే హృదయం నాకసలే లేదు!'' పక్కనే కూర్చుంటూ అన్నాడు.

జ్వాల, చేతులు విడిపించుకునేందుకు, పెనుగులాడుతూనే, చురుగ్గా అన్నది. ''నేను తెలిసి ఎవరినీ బాధపెట్టను. నిన్ను తిరస్కరించడం, నాకేదో గొప్పని, గర్వమనీ అనుకుని కాదు!''

మనోజ్, చేతుల్ని వదలకుండానే ఒక్క భుజం కసుపుతో బెడ్ మీద పడేశాడు. జ్వాల బలంగా ఒక్క విసురుతో, మనోజ్ ని పగిలించుకుని, అందుబాటులో వున్న జబ్బమీద బలంగా కొరికింది. మనోజ్ అప్రయత్నంగా చేతులు ఒదిలేసి బాధగా, కోపంగా భుజం పట్టుకున్నాడు.

''మనో! అనవసరంగా నాతో దెబ్బలాట పెట్టుకున్నావు. నువ్వనుకునేంత తేలిగ్గా నేనెవ్వరికీ ఎప్పుడూ లొంగను. అందరాడపిల్లలా, నా బలాన్ని అంచనా వేసుకుంటే పొరపాటే!'' వాష్ బేసిన్ దగ్గర నోటిని శుభ్రంగా కడుక్కుంటూ అన్నది.

మనోజ్, రక్తం కారుతున్నా చలించనట్లు కూర్చున్నాడు.

జ్వాల అతడి పక్కగా వచ్చి నిలబడి, ''మనో! డాక్టర్ కి ఫోన్ చెయ్యనా?'' అంది మెల్లగా.

''అక్కర్లేదు'' అన్నాడతడు గంభీరంగా.

''ఎందుకని?'' అడిగింది. తర్వాత ఓ గ్లాసుతో నీళ్ళు తెచ్చి, కర్చీఫ్ తో రక్తమంతా శుభ్రంగా తుడిచి, దాన్నే తడిపి కట్టు కట్టింది.

ఆశ్చర్యంగా, జ్వాల చేసే పని చూస్తూ, కనీసం కదని కూడా అన్లేకపోయాడు.

''మనో! నిజం చెప్తున్నాను. నీతో తిరిగింది, కేవలం నీ సాయం పొందడానికే. అంతకంటే వేరే వుద్దేశ్యం నాకు లేదు. నీకు కూడా ఉండివుండదు. కేవలం నా అందం చూసి, నాకేదో

గర్వమనీ, దాన్ని అణిచెయ్యాలనీ అనుకుంటావు. నీకు నేనెలాగూ లొంగనని తెలిసి, పెళ్ళిమాట తీసుకొచ్చావు!" చిన్నగా అన్నది.

"జ్వాలా!!"

"అవును. నీలాంటి వాళ్ళని చేసుకోనని నేను మొదట్లోనే నా అభిప్రాయాన్ని ఖచ్చితంగా చెప్పాను. అయినా నువ్వు వినిపించుకోలేదు. ఆ తప్పు నాది కాదు."

"జ్వాలా!"

"మనోజ్! నీకు నేనస్సలు సరిపోను. రోజూ ఇలాగే ఓ దెబ్బలాట పెట్టుకుని, ఓడిపోతూ గాయాలు చేసుకుంటే హాస్పిటలే గతి!" చిన్నగా నవ్వుతూ అన్నది.

"నీకు చాలా ధైర్యం!" ఇంకా దగ్గర కూర్చుని, నవ్వుతూ అంటున్న జ్వాలకేసి చిత్రంగా చూసాడు.

"అవును. మానసికంగా, శారీరకంగా, అమ్మాయిలు, అబ్బాయిలూ ధైర్యంగా, దృఢంగా వుండాలనేది నా అభిప్రాయం!"

"జ్వాలా! నువ్వంటే నాకిష్టం. అభిమానం. ప్రేమ. అన్నీ!" ఆవేశంగా జ్వాల చేతిని పట్టుకుని అన్నాడు.

"అబ్బ! నీతో భలే చిక్కు. ఎదుటివాళ్ళ మాట అస్సలు వినిపించుకోవు. విన్నా, నీ పాటే పాడ్తావు. అవన్నీ మనస్సులో భద్రంగా దాచుకుని, నీ జీవితంలోకి రాబోయే ప్రియమయిన శ్రీమతి కివ్వు. నేనూ, ఆవిడా ఇద్దరం సంతోషిస్తాం. నా మీద స్నేహభావం ఉంటే చాలు!" మనోజ్ చేతిని మృదువుగా విడిపించుకుని అన్నది.

"జ్వాల! నిన్ను చేసుకుని, యీ బిజినెస్సంతా నీ చేతిలో పెట్టి, నేను హాయిగా వుందామనుకున్నాను. నాకీ బిజినెస్సంటే తలనొప్పి. డాడీ తర్వాత నేనే చూడాలి!" విసుగ్గా అన్నాడు.

"ఇప్పుడు మాత్రమేమయింది? వచ్చే అమ్మాయిని, బిజినెస్ శ్రద్ధగా, నేర్పుగా చేయగలిగి వుండేలా చూసుకో. లేకపోతే తెలివయిన, నమ్మకమయిన పి. ఏని పెట్టుకో!" స్నేహంగా అన్నది.

"జ్వాల! ఎవరయినా నీ మనస్సులో నాకు ముందే స్థానం సంపాదించారా?" కుతూహలంగా అడిగాడు.

తల అడ్డంగా తిప్పింది.

"మరి?"

"ఎందుకంత ఆశ్చర్యం?"

"నిజం చెప్పు!"

"నిజమే! నేను టీనేజ్‌లో వున్నట్లయితే, ఎగిరి గంతేసి నిన్ను పెళ్ళిచేసుకోడానికి ఒప్పుకునేదాన్ని! టీనేజ్ పిల్లల కలలు కనే రాజకుమారుడిలానే వున్నావు. అందరినీ ఆకర్షించే అందం, అంతకు మించిన ఐశ్వర్యం వున్న నిన్ను చేసుకోడం అంటే చాలా మంది యిష్టపడతారు."

"........."

"కాని నేను టీనేజ్ దాటేసి నాలుగేళ్ళయింది. కలలు కనడం ఎప్పుడో ఆగిపోయింది. వాస్తవం లోకి సూటిగా చూడ్డం అలవాటయింది. దాంతోపాటు కొన్ని ఖచ్చితమయిన అభిప్రాయాలు కలిగినయి!"

"ఏంటవి?" అమితాశక్తిగా చూశాడు.

"నీలా అతిగా త్రాగేవాళ్ళన్నా, అతిగా స్మోక్ చేసే వాళ్ళన్నా, బాధ్యతల్లేకుండా వున్నా పట్టించుకోకుండా, ఎప్పుడూ ఫ్రెండ్స్‌తో తిరుగుతూ, క్లబ్బులట్టుకు వేలాడే వాళ్ళన్నా నాకిష్టం లేదు."

మనోజ్ గబుక్కున చేతిలోని సిగరెట్‌ని దూరంగా విసిరేసాడు.

జ్వాల యిదేం గమనించకుండా చెప్తూనే వుంది.

"ఓ వయస్సంటూ వచ్చాక బాధ్యతలన్నీ తండ్రి మీద వెయ్యడం నాకిష్టం లేదు. దీనికి నువ్వు పూర్తిగా వ్యతిరేకం. ఇరవై నాలుగ్గంటలు నీ కాలక్షేపాలు, సరదాలు తప్ప నీకేం పట్టదు. నన్ను చేసుకున్నాక, హాయిగా యీ బిజినెస్ నా నెత్తిన పడేసి, నీ కాలక్షేపాలు, సరదాలు మామూలుగానే సాగిస్తావు. నేను బిజినెస్‌లో మునిగి తేలుతూ వుంటే, నువ్వు పార్టీలంటూ వూళ్ళు చెక్కేస్తుంటావు. అది నా కిష్టం లేదు. ఇష్టం లేకుండా కేవలం నీ డబ్బుని చూసి నిన్ను పెళ్ళాడేటంత చెడ్డదాన్ని కాను.

నీకు, నాకు ఆస్తి, అంతస్తులోనే కాదు, అభిప్రాయాల్లోనూ చాలా దూరం వుంది."

"కాని... కాని నీ అభిప్రాయాల కనుగుణంగా నేను మారకానా!" అంతా విన్న తర్వాత అన్నాడు.

జ్వాల చిన్నగా నవ్వింది.

"మీ డాడీ నిన్ను మార్చడాని కెప్పుడూ ప్రయత్నించలేదా? 'ఎందుకు నవ్వుతున్నావ్' అన్నట్లుగా తన వైపు చూస్తున్న మనోజ్ ని అడిగింది.

"ఎందుకూ?" సాలోచనగా చూశాడు.

"చెప్పు!"

"ఆఁ! చాలాసార్లు ప్రయత్నించి, యిప్పుడు మానేసారు!"

"చూసావా! మీ డాడీ ఎంతో ప్రయత్నం చేసినా మారని నువ్వు, నేనేనో మార్చగలనని, నువ్వేదో మారావని ఎలా అనుకోను? మా శ్రీవారు ముఖ్యంగా, యీ అలవాట్లకి, వ్యసనాలకి దూరంగా వుండాలి. బాధ్యతల్ని సక్రమంగా పంచుకోగలిగినవాడు, భార్యని పూర్తిగా అర్థం చేసుకుని, ప్రతి చిన్న విషయానికి భార్య సలహా అడుగుతూ, యిద్దరూ ఒకటిగా అనుకుని చేయగలిగినవాడై వుండాలి. అతడి జీవితంలో నేను తప్ప, నా అంత ప్రాముఖ్యం ఎవరికీ వుండకూడదు. అతడి జీవితానికి జ్యోతిని నేను కావాలి. ఆ జ్యోతి వెలుగులో పయనించే పాంథుడు కాకూడ దతను. ఆ జ్యోతి సదా వెలగడాని కవసరమయ్యే తైలం కావాలి అతను!" చిన్నగా, స్పష్టంగా, అతి మృదువుగా అన్నది.

జ్వాలవైపు ఆశ్చర్యంగా చూసాడు. ఎంత మృదువైన భాషలో చెప్పింది. జ్వాలలో తనెన్నడూ చూడని మృదుత్వం యీ రోజు కన్పిస్తుంది. శ్రీవారు అంటూ ఎంత మన్ననగా అంటుందో? అలా అంటున్నప్పుడు జ్వాల కళ్ళలో ఎంత వెలుగు! ఎంత గౌరవం! జ్వాలకున్న ఖచ్చితమయిన అభిప్రాయాల్లో తనకొక్కటీ లేదు. తన అందానికి తగ్గట్లుగా, తన హోదాకి సరిగా వుండాలి ఆ వచ్చే అమ్మాయి. ఇలా అనుకున్నాడు తప్ప మరో విధంగా తనెన్నడూ అనుకోలేదు. ఎందుకని తను అనుకోలేదు?

తనుండే హైక్లాస్ సొసైటీలో అందం, ఆస్తి, హోదా తప్ప, జ్వాలకున్నటువంటి అభిప్రాయాలు ఎవరికీ కలగవు. కలిగినా వాటి కిచ్చే ప్రాముఖ్యం వీటి కివ్వరు. తమ సొసైటీలోనే కాదు. అసలు మామూలు ఆడపిల్లలెంతమంది కిలాంటి అభిప్రాయాలుంటాయి? ఎవరయినా ముఖ్యంగా చూసేది అందం, చదువు, ఆస్తి. ఇంతకు మించి చూడాలని ఎవరికీ వుండదు. ఇద్దరూ చాలాసేపు మౌనంగా, ఎవరి ఆలోచనల్లో వాళ్ళుండి పోయారు. జ్వాల అన్నట్లుగా తనెంతవరకు మారగలడు. ఈ అలవాట్లకి, వ్యసనాలకి దూరంగా తనుండగలడా? ఎన్నిరోజు లుండగలడు?

మనోజ్ మనస్సులో ఆ ఆలోచన వుండగానే, జ్వాల అదే అడిగింది.

"ఈ ఖరీదయిన అలవాట్లకి నువ్వు దూరంగా వెళ్ళలేవు. వుండలేవు. ఒకవేళ వున్నా పెళ్ళయిన కొద్దిరోజులు. మోజులు తీరాక మామూలు," అన్నది జ్వాల.

మనోజ్ జారవిడిచిన సిగరెట్ కార్పెట్ మీద పడి. అది కాలుకోవటం ప్రారంభించింది. సన్నగా పొగ పైకి లేస్తోంది.

మనోజ్ అమాంతం జ్వాల రెండుచేతులూ పట్టుకుని, "డియర్! నేను మారతాను ప్లీజ్! నన్ను నమ్ము," అన్నాడు.

జ్వాల సున్నితంగా అతడి చేతుల్లోంచి, తనచేతులు వెనక్కి తీసుకుని, "మనో! నన్ను గుడ్డిగా ఆరాధించటం గాని, లేదా నీ మాటలు నేను గుడ్డిగా నమ్మటంగాని యిద్దరికీ శ్రేయస్కరం కాదు. ఇది జీవిత సమస్య. నీమీద నాకు ఎక్కడో అంతరాంతాలలో ప్రేమ గూడుకట్టుకుని వుండాలి. లేకపోతే, నిన్ను వివాహమాడ లేనని చెప్పి, యిక్కణ్ణించి కదలకపోవటం ఏమిటి? నామీద నీ ప్రేమ అమోఘం. నీపై నా విశ్వాసం అమోఘంగా మారిననాడు, నిన్ను వెదుక్కుంటూ వస్తాను. అయినా మగాడిగా ఆడది నీకోసం వెదుక్కుంటూ రావటమే నీకు ఖ్యాతీ, తృప్తీ. నేను వస్తాను," అంటూ జ్వాల అక్కడినుండి చివాలున లేచి వెళ్ళిపోయింది. కార్పెట్ సాంతం అంటుకుని మంట భగ్గున పైకి లేచింది.

"జ్వాలా!" పిలిచాడు మనోజ్.

ంగలేదు. అవతలగదిలో గుమ్మంపక్కన
ున్నాడు.

జ్వాలా!" పిలిచారాయన జ్వాలవరకే పరి
ిన కళ్లు, అంతవరకూ విన్న జ్వాలమాటలకు
ామిలా మెరుస్తున్నాయి.

! మీసాలూ గడ్డాలు వచ్చినవాడికి తండ్రి
ాక తండ్రిగా నాకు మారనప్పుడు, నీ
సంశయం. ఇనుపముక్కమీద ఎన్ని సమ్మెట
గుతుందేమోగాని సాగటం కద్దమ్మా! అ
ంలో పెట్టి కాల్చాక, అది సాగేందుకు చిన్న
ల! ఇప్పుడు వాడి హృదయం నీవు వా
ధికారంతో కణకణలాడుతోంది. అని నా
వచ్చేందుకు."

ంగి అమాంతం ఆయన పాదాలకు నమస్కరి

మరికొంతసేపు వుంటే నేను ఓడిపోతానే
న్నాను. దయవుంచి నన్ను పారిపోనివ్వండి.
ంత అవసరమో, నాకూ అంత అవసరం. సర్క
ంచేవాడికి బాలన్సుకోసం చేతిలో కర్ర వు
మార్పుకి నేను సర్కస్ కర్ర కాకూడదని
ోసమే గాకుండా, తనకోసంకూడా మనోజ్
. అతను నా కోసమే మారితే, నేను
దక్కి లేకపోవటం జరిగినప్పుడో మనోజ్
అవకాశం వుంది."

తండ్రికి జ్వాల అభిప్రాయం అర్థమయింది.
నిలబడ్డారు.

ంలోకి వచ్చింది.

ంనుండి మనోజ్ విస్కీ బాటిల్సన్నీ కిటికీ

వుండాలి. రోడ్డంతా విస్కీ కంపు. గాజు

ుందుకు జ్వాలకి ఎటుపక్క రోడ్డు మీద

కాలేదు. యుద్ధవ్యూహం గుర్తుకొచ్చింది

వును అలా నిలబెట్టేందుకు అతడిచుట్టూ

ాస్త్రం' వాడేవారట! మనోజ్ విస్కీ

ష్. జ్వాలకు నవ్వు ఆగిందికాదు.

జైహింద్.

# విజయ

మే నెల అనుబంధమాలిక

# మానవత

రచన:

దాశరథి రంగాచార్య

శ్రీ

్వాల ఆగలేదు. అవతలగదిలో గుమ్మంపక్కన మనోజ్

ిలబడి వున్నాడు.

"అమ్మా! జ్వాలా!" పిలిచారాయన జ్వాలవరకే పరిమితమై

. ఆయన కళ్లు, అంతవరకూ విన్న జ్వాలమాటలకు తృప్తి

తో మిలమిలా మెరుస్తున్నాయి.

"జ్వాలా! మీసాలూ గడ్డాలు వచ్చినవాడికి తండ్రి అం

మ్మా! మనోజ్ తండ్రిగా నాకు మారనప్పుడు, నీ కొంచు

డని నీ సంశయం. ఇనుపముక్క మీద ఎన్ని సమ్మెటదెబ్బ

అది విసుగుతుందేమోగాని సాగటం కద్దమ్మా! అదే ఇను

ను కొలిమిలో పెట్టి కాల్చాక, అది సాగేందుకు చిన్న సమ్మె

గాలు జ్వాల! ఇప్పుడు వాడి హృదయం నీవు వాడియె

నిరసన, ధిక్కారంతో కణకణలాడుతోంది. అది కాలమ

మార్పు వచ్చేందుకు."

జ్వాల వొంగి అమాంతం ఆయన పాదాలకు నమస్కరించిం

"సార్! మరికొంతసేపు వుంటే నేను ఓడిపోతానని భ

రపోతున్నాను. దయవుంచి నన్ను పారిపోనివ్వండి. మా

ం మీకెంత అవసరమో, నాకూ అంత అవసరం. సర్కస్ లో

ాద నడిచేవాడికి బాలన్స్ కోసం చేతిలో కర్ర వుంచు

మనోజ్ మార్పుకి నేను సర్కస్ కర్ర కాగూడదని నా

ం. నా కోసమే గాకుండా, తనకోసంకూడా మనోజ్ మా

ఆకాంక్ష. అతడు నా కోసమే మారితే, నేను ద

, లేక దక్క లేకపోవటం జరిగినప్పుడో మనోజ్

తయ్యే అవకాశం వుంది."

మనోజ్ తండ్రికి జ్వాల అభిప్రాయం అర్థమయింది. ఆ

వ తప్పుకు నిలబడ్డారు.

జ్వాల వీధిలోకి వచ్చింది.

మేడమీదనుండి మనోజ్ విస్కీ బాటిల్సన్నీ వీధిలోకి

వుండాలి. రోడ్డంతా విస్కీ కంపు. గాజు పెంకులు.
యేందుకు జ్వాలకి ఎటుపక్క రోడ్ మీద కాలు ఆ
ం కాలేదు. యుద్ధవ్యూహం గుర్తుకొచ్చింది వెంటనే
ంవును అలా నిలబెట్టేందుకు అతడిచుట్టూ మంటలు
లాస్త్రం' వాడేవారట! మనోజ్ విస్కీ బాటిల్సు
న్నాడు. జ్వాలకు నవ్వు ఆగిందికాదు.

జైహింద్.

---

# విజయ

మే నెల అనుబంధమాలిక

# మానవత

రచన:

దాశరథి రంగాచార్య

---



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M126 |
| పుస్తకం పేరు | విజయ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 129 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| పోని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | Thasin |
| | RUKSANA |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |